అపరాధ పరిశోధన అనుబంధం—95

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అప్పుచేసి చూడు
రచన : వసుంధర

## సానికొంపలో స్మశానం
రచన : ఇమంది రామారావు

## మాయమైన మొసలిపాము
రచన : ఎమ్. వి. వి. సత్యనారాయణ

## ఐదు లక్షలు
రచన : టెంపోరావ్

రక్తం త్రాగే పిశాచం - ఐదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—95
నవంబర్, 1981
వెల: రు. 5-00
ఏడాది చందా: 60 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-6484

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# అప్పుచేసి చూడు!

వసుంధర

"ప్రపంచంలో దేన్నైనా భరించవచ్చును కానీ ఆకలిని భరించలేం—ఏమంటావ్?" అన్నాడు శాస్త్రి.

ఆతను వెల్లకితలా చాపమీద పడుకుని గది పైభాగాన్ని చూస్తున్నాడు.

"ఈ మాట ఎన్ని సార్లు చెబుతావ్? ఆకలినేనా భరించవచ్చును కానీ ఒకే మాట పదే పదే వినడం మరీ కష్టమనిపిస్తోంది నాకు. ఇంకోసారి ఇదేమాట చెప్పావంటే మనిద్దరం ఫైటింగ్ ప్రారంభించాల్సి వుంటుంది" అన్నాడు శర్మ.

"అందుకు మాత్రం ఓపిక కక్కర్లేదేసిందీ—ఆకలితో చస్తూంటే! అనగా అనగా నీకు పౌరుషం వచ్చి ఏదో ఉపాయం చెబుతావేమోనని ప్రయత్నిస్తున్నాను. నిద్రోక్షపం వస్తోంది తప్పితే ఉపాయం తట్టలేదు—" అన్నాడు శాస్త్రి.

"నీకు తట్టని ఉపాయాలు నాకుమాత్రం తడతాయా?

ఇప్పటికి భోంచేసి మూడు పూటలైంది. ఇంకా ఇలా ఎన్నాళ్ళు మాడిపోతాం? జేబులో ఒక్క పైసా కూడా లేదు. గదిదాటి బైటకు వెడదామంటే అప్పులు...." అన్నాడు శర్మ.

శాస్త్రి ఉన్నట్లుండి లేచికూర్చుని—"విన్నావా.... అడుగుల చప్పుడు...." అన్నాడు.

"అప్పులవాళ్ళనగానే నీ కలాగే అనిపిస్తుంది. నాకే అడుగుల చప్పుడూ వినిపించడంలేదు—"

"నాకు అంతా స్పష్టంగా వినబడుతూంటే నీకెందుకు వినబడదు? బహుశా నీరసంతో నీకు చెవులు గళ్ళడి వుంటాయి. అదిగో—అడుగుల చప్పుడు తలుపును సమీపించింది...." అని శాస్త్రి ఇంకా ఏదో అనబోతూండగా తలుపు తట్టిన చప్పుడైంది. శర్మ ఉలిక్కిపడి లేచి నిలబడి "నువ్వు చెప్పింది నిజమే!" అన్నాడు.

"మనింటికి అప్పులవాళ్ళు తప్ప రారు. ఇప్పుడేం చేయాలి? అసలే ఆకలితో చచ్చిపోతూంటే ఈ అప్పులవాళ్ళ బెడద ఒకటి! ఈ గదికి వున్నదొక్కటే తలుపు. ఆ తలుపు దగ్గర అప్పులాడు..ఏమిటి చేయడం?" అని శాస్త్రి వాపోతూంటే అతడితోపాటు శర్మ కూడా వాపోసాగాడు. ఈ లోగా మరోసారి తలుపు చప్పుడయింది.

"నాతోపాటూ నువ్వూ గోలెట్టేబదులు — వెళ్ళి తలుపుతీసి సమాధానపర్చరాదూ!" అన్నాడు శాస్త్రి.

"నీకైతే దూరంనుంచి అడుగుల చప్పుళ్ళు కూడా వినపడుతున్నాయి. నాకంటే నీ పరిస్థితే మెరుగ్గావుంది కాబట్టి ఆ వచ్చినవాడిని నువ్వే సమాధానపర్చాలి...." అంటూ చతికిలబడిపోయాడు శర్మ. ఈలోగా తలుపు

మళ్ళీ తట్టిన చప్పుడయింది. శాస్త్రి విసుక్కుంటూ లేచి నిలబడి శర్మను పడుకోమని కనుసైగ చేసి—"అబ్బబ్బ—వస్తున్నా ముండండయ్యా — ఏమిటీ — అదే పనిగా బాదుతారు...." అంటూ వెళ్ళి తలుపు తీశాడు.

ఎదురుగా నవ్వుతూ ఇంటాయన కనిపించాడు.

"మిమ్మల్ని నవ్వుతూండగా చూసి చాలా కాలమయింది సార్—రండి—రండి—లోపలికి—" అంటూ ఆయన్ను సాదరంగా ఆహ్వానించాడు శాస్త్రి లోపలకు. ఆయన ఇంకా నవ్వుతూనే లోపలకు వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

"మీరింకా నవ్వుతూనే వున్నారు. నాకెంతో సంతోషంగా వుందిసార్. మీరెప్పుడూ ఇలా నవ్వుతూనే వుండాలని నా కోరిక. అవును కానీ—నవ్వేదాకా తెలియలేదు—మీరెంతో అందంగా వుంటారని...." అంటూ శర్మ పడుకున్నవాడల్లా లేచి కూర్చున్నాడు. శాస్త్రి మాత్రం ఆయన లోపలకు ప్రవేశించగానే వీధి తలుపువేసి "హమ్మయ్య!" అనుకున్నాడు.

ఇంటాయన వాళ్ళిద్దరివంక ఆప్యాయంగా చూసి—"చాకుల్లాంటి కుర్రాళ్ళయ్యా మీరు! అలా వాడలిపోయారేమిటి? మీ దగ్గర డబ్బుల్లేవా?" అన్నాడు.

శాస్త్రి, శర్మ ఆశ్చర్యంగా ఒకరినొకరు చూసుకున్నారు. ఇంటాయనకి అద్దె ఇచ్చి మూడు నెలలైంది. వచ్చినప్పుడల్లా మొహం చిట్లించుకొని వెడుతున్నాడు. తమనెప్పుడూ ఆయన ఆప్యాయంగా పలకరించిన పాపాన పోలేదు.

"ఏం—బాబూ—మీ దగ్గర డబ్బుల్లేవా?" అన్నాడు ఇంటాయన.

"లేవండి. ఆఖరికి చేతివాచీలు కూడా అమ్మేశాం! భోంచేసి మూడు పూటలైంది!" అన్నారు మిత్రులిద్దరూ ఏక కంఠంలో. అప్పులవాళ్ళ దగ్గర మానాభిమానాల సంగతి మర్చిపోవాలని వాళ్ళు ఎప్పుడో తెలుసుకున్నారు.

"అయ్యో—ఎంతమాట....ముందు వెళ్ళి భోంచేసి రండి...." అన్నాడు ఇంటాయన జేబులోకి చెయ్యి పెడుతూ. శాస్త్రి, శర్మ ఆయన జేబువంకే చూస్తున్నారు ఆత్రుతగా. అందులోంచి పదిరూపాయల నోటొకటి బైటకు వచ్చింది. అయితే మిత్రులిద్దరూ ఆయన్ను సమీపించలేదు.

"డబ్బు తీసుకోరా?" అన్నాడాయన ఆశ్చర్యంగా.

"మాకో ఇబ్బంది ఉందండి. చుట్టుపక్కల చాలా అప్పులు చేసేశామండి. ఈ పదిరూపాయలతో వీధిలో కనబడ్డామంటే ఎవడో ఒకడు మా దగ్గర్నుంచి లాగేసుకుంటాడు. ఇదీ మా యిబ్బంది. దయతో మీరే మాకు అన్నం తెచ్చి పెట్టాలి. ఇలా అంటున్నామని ఏమీ అనుకోవద్దు—...." అన్నాడు శాస్త్రి.

"భలేవాళ్ళయ్యా మీరు....బోలెడు సంపాదిస్తారు కదా—అంతా ఏంచేసేస్తారు?" అన్నాడు ఇంటాయన.

"మా సంగతి మీకు తెలియనిది ఏముందిసార్! రేపు గురించి ఆలోచించం. వున్నప్పుడు అడిగినవాడికి లేదనకుండా దానాలిచ్చేస్తాం. అలాగే లేనప్పుడు వున్నవాళ్ళనడిగి తీసుకుంటాం. దురదృష్టమేమిటంటే మేమిచ్చిందల్లా దానమైపోతోంది. పుచ్చుకొన్నదల్లా అప్పయిపోతోంది" అన్నాడు శర్మ.

"అయినా మీరు దానాలు మానేసి—అప్పులెందుకు తీర్చరూ?" అన్నాడు ఇంటాయన.

"సమాధానం చెప్పాలంటే ఆకలి....ఆకలితీరితేగానీ ఏమీ చెప్పలేం...." అన్నాడు శాస్త్రి.

ఇంటాయన మారుమాట్లాడకుండా బైటకు వెళ్ళి—కాసేపటికి ఓ క్యారియరు తీసుకుని వచ్చాడు. మిత్రులిద్దరూ ఆవురావురుమంటూ భోంచేసి—"అన్నదాతా—సుఖీభవ!" అన్నారు.

"కడుపు నిండిందా?" అన్నాడు ఇంటాయన.

"ఆహాహా....గృహ యజమానులంటే మీకులాగా వుండాలి. మూణ్నెల్లనుంచి అద్దె అడగడంలేదు. పైగా ఈ రోజు కడుపునిండా భోజనం పెట్టారు...." అంటూ శర్మ ఆయన్ను మెచ్చుకున్నాడు.

"అవునుసార్—రోజు మీరు మాకిలాగే క్యారియర్ ఎందుకు పంపకూడదు?" అన్నాడు శాస్త్రి.

"నేనడిగిన ప్రశ్నకింకా జవాబు చెప్పలేదు! మీరు అప్పులు తీర్చక దానాలెందుకు చేస్తారు?"

శాస్త్రి నవ్వి—"జవాబడక్కండి సార్—అది మీకు నచ్చదు. అందుకే భోజనానికిముందు మీరడిగితే భోంచేసి గానీ చెప్పలేమన్నాను. ఎందుకంటే జవాబు వింటే మీరు భోజనం పెట్టరు...." అన్నాడు.

"ఫరవాలేదు. ఈ రోజు నేను చాలా శాంతంగా వున్నాను. అదీకాక మీరు భోంచేయడం కూడా అయిపోయింది—"

"అదికాదు సార్—అన్నంపెట్టినవారి మనసు కష్టపెట్టడం నాకిష్టంలేదు...." అన్నాడు శాస్త్రి.

"ఫరవాలేదు—చెప్పు!" అన్నాడు ఇంటాయన.

"అవసరంలో వున్నవాళ్ళనీ, లేనివాళ్ళనీ ఆదుకోవడం మా అలవాటు సార్! వళ్ళు వాచిన వాళ్ళంటే మాకు

వ్యవహారం. అప్పులు తీర్చొచ్చులే అనుకునేలోగా డబ్బు మరో రకంగా అయిపోతుంది. అయినా ఈ లోకంలో వచ్చినవాళ్ళకంటె — అవసరాలతో బాధపడేవాళ్ళే ఎక్కువ సార్! అలాంటప్పుడు కనీసం మాబోటి కొందరైనా వాళ్ళకి సపోర్టివ్వకపోతే ఎలా చెప్పండి!" అన్నాడు శాస్త్రి.

"అలా అయితే మాబోటివాళ్ళగతేమిటి? మీలాంటి వాళ్ళకు తినే ఇల్లదెకివ్వాలా?" అన్నాడు ఇంటాయన.

"లేదు సార్! కానీ మీరే న్యాయం చెప్పండి. మేం మీకు మూడు నెల్ల అద్దె బకాయి. అయినా మీకొచ్చిన నష్టమేమిటు? పైగా మాకు భోజనం కూడా తెచ్చిపెట్టారు...." అన్నాడు శర్మ.

"మీ సమాధానం నాకు నచ్చింది. నా మనసు ఎంత మాత్రమూ కష్టపడలేదు—" అన్నాడు ఇంటాయన.

"చాలా థాంక్స్ సార్...." అన్నాడు శాస్త్రి.

"మరి నేను వచ్చిన పని చెబుతాను. మీరూ కాదన కూడదు...." అన్నాడు ఇంటాయన.

శాస్త్రి, శర్మ ముఖముఖాలు చూసుకున్నారు. ఇంటాయన ఔదార్యం వెనుక ఏదో పెద్ద కథే వుండాలని ఇద్దరూ అనుకుంటూనే వున్నారు-"చెప్పండి!" అన్నాడు శాస్త్రి.

"విశాఖపట్నంలో అప్పారావు తెలుసా?" అన డిగాడు ఇంటాయన.

"విశాఖపట్నం ఎల్లమ్మతోట సెంటర్లో నిలబడి ఓసారి అప్పారావ్ అని కేకపెట్టాను. అంతే ఒక్కసారిగా ఎన్నో కార్లకు, బస్సులకు, స్కూటర్లకు, బ్రేకులు పడ్డాయి. ఎందరో మనుషులు ఆగిపోయారు,

ట్రాఫిక్ సంభించిపోయింది. ఏమిటీ వింతపరిణామం అని నేను వెర్రి మొహం వేసుకుని చూస్తూండగా ట్రాఫిక్ పోలీసు నా దగ్గరకు పరుగునవచ్చాడు. అతగాడికేం సమాధానం చెప్పాలా అని నేను హడలి చస్తూండగా అతను వినయంగా-"సార్—మీరు పిలిచింది నన్నేనా?" అన్నాడు. అలాంటి విశాఖపట్నంలో ఓ అప్పారావు గురించి అడిగితే నేనేం చెప్పను?" అన్నాడు శాస్త్రి.

శర్మ నవ్వాడు కానీ ఇంటాయన నవ్వలేదు. ఆయన అదోలా శాస్త్రివంక చూసి—"ఇదిప్పటి జోకు కాదు. మీ పెద్దాళ్ళెవరో చెబితే విని నువ్వు నాకు చెబుతున్నావు. విశాఖపట్నం అప్పటికీ ఇప్పటికీ మారింది. నువ్వు చెప్పే ఎల్లమ్మతోట సెంటర్ అంత పాప్యులర్ కాదు. ఇప్పుడు అక్కడికి కాస్త దగ్గర్లోనే వున్న జగదాంబా సెంటర్ పాప్యులర్! జగదాంబా సెంటర్ దగ్గర నువ్వు అప్పారావ్ అని కేక పెడితే—ఆ కేక నీకే వినపడనంత గొడవగా వుంటుందక్కడ. కాబట్టి అలాంటి టెంగలేమీ పెట్టుకోకు. నేను చెప్పే అప్పారావు గురించి కాస్త విను...." అన్నాడు.

"ఈ రోజు మీరు చాలా తెలివిగా మాట్లాడుతున్నారు సార్! మాకు భోజనం పెట్టారు. ఆ ఫలితం ఊరికేపోలేదుగదా..." అన్నాడు శాస్త్రి. అప్పటికీ ఇంటాయన కోపగించుకోకుండా మనస్ఫూర్తిగా నవ్వాడు.

"మరీ అంతలా నవ్వేయకండి సార్. నాకు భయం వేస్తోంది. కాస్త కోపంగా చూడండి-" అన్నాడు శర్మ.

"అప్పారావు హిందీ సినిమాలో 'శెట్టి'లాగుంటాడు. చాలామందికి అతడంటే భయం. నాక్కూడా భయమే!" అని ఆగాడు ఇంటాయన.

"మీరేమీ అనుకోనంటే ఒక్క ప్రశ్న సార్! ఈ ప్రపంచంలో మీరు భయపడని మనిషి ఎవరైనా వున్నారండీ?" అని ఆగి—"మీరు ఆ అప్పారావులాంటి వాళ్ళతో గొడవ పెట్టుకోకండి సార్!" అన్నాడు శాస్త్రి.

"మధ్యలో నన్ను డిస్టర్బ్ చెయ్యవద్దు" అన్నాడు ఇంటాయన - "అప్పారావు నా దగ్గర పాతిక వేలు అప్పు తీసుకున్నాడు. ఇప్పటికి రెండేళ్ళయింది. తిరిగి ఇమ్మంటే యివ్వడం లేదు. అప్పు తిరిగివ్వడం వాళ్ళింటా వంటా లేదన్నాడు."

"పాపం నిజమే నేమో-ఇంటా వంటాలేని పని చేయడాని:కెవరు మాత్రం ఇష్టపడతారు" అన్నాడు శాస్త్రి.

ఇంటాయన అతడివంక కోపంగా చూసి—"మీరు నాకు మూడునెల్ల అద్దె బాకీ వున్నారు. ఇప్పుడు నా భోజనం తిన్నారు. ఇంకా నా శత్రువునే సమర్థిస్తున్నారు. నన్ను వేళాకోళం చేస్తున్నారు. ఇది మర్యాదగా వుందా?" అన్నాడు.

"ఏం చేస్తే మర్యాదగా వుంటుందో మీరే చెప్పండి" అన్నాడు శర్మ.

"అప్పారావు దగ్గర బాకీవసూలు చేసి తీసుకురండి. అందులో అయిదు వేలు మీకిస్తాను...."

శాస్త్రి, శర్మ లేచి నిలబడ్డారు—"ఓ.కే—ముందుగా అడ్వాన్సిస్తారా?"

"నాకు దొరికేవన్నీ మీలాంటి బేరాలే అయితే—అడ్వాన్సివ్వడానికి డబ్బు లెక్కడేదుస్తాయి? ఇప్పుడు మీకు పెట్టిన భోజనమే అడ్వాన్సనుకోండి. మీరు ఘటనాఘటన సమర్థులని తెలిసింది. అందుకే ఈ పని

మీకు అప్పగిస్తున్నాను. డబ్బు తీసుకురాగానే మీకు వెంటనే అన్న మొత్తం ఇచ్చేస్తాను...."

"పోనీ ప్రయాణం ఖర్చులు...."

"టికెట్ లేకుండా ప్రయాణం చేయగలరని మీ గురించి నాకు తెలును...." అన్నాడు ఇంటాయన.

"గురూ—ఈయన దగ్గర్నుంచి మనకింకేమీ గిట్టదు. అయిదువేలంటే మాటలుకాదు. అప్పులన్నీ తీరిపోగా ఇంకా రెండువేలకుపైగా మిగుల్తుంది—" అన్నాడు శర్మ.

## 2

"నమస్కారమండీ—నా పేరు శాస్త్రి!" అన్నాడు శాస్త్రి.

"నా పేరు శర్మ!" అన్నాడు శర్మ.

"మా యింట్లో ప్రస్తుతం శుభకార్యాలూ, అశుభ కార్యాలూ కూడా లేవు ..." అన్నాడతను.

"మీ పేరు అప్పారావుగారే కదండీ—" అన్నాడు శర్మ.

"మా అమ్మా నాన్నలకూ, నాకంటే పెద్దలకూ నా పేరు అప్పారావు. నా కాలికింది తొత్తులకూ, నా మోచేతి నీళ్ళు తాగేవాళ్ళకూ నా పేరు అప్పారావుగారు—" అన్నాడతను.

"అయితే నేను నిన్ను అప్పారావు అనే పిలుస్తాను" అన్నాడు శాస్త్రి.

అప్పారావు కోపంగా శాస్త్రివంక చూసి నెమ్మదిగా చొక్కా విప్పాడు. కుర్చీమీద వేశాడు. ఓసారి కుర్చీ లోంచి లేచి నిలబడి కండలు పొంగించి—"మరోసారి నన్ను అప్పారావూ అను...." అన్నాడు.

శాస్త్రి నవ్వి "నువ్వు శాబరే డ్యాన్సులకి బాగా పని కొస్తావు. నువ్వు చొక్కా విప్పిన పద్ధతీ, నీ కండలు కూడా చాలా బాగున్నాయి. దురదృష్టమేమిటంటే ఇది ఇండియా అయిపోయింది. ఇక్కడ మగ డ్యాన్సర్లకంత డిమాండు లేదు—" అన్నాడు.

అప్పారావు ఆవేశంగా కండలు కదిలించి—"ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా?" అన్నాడు.

"నీ గురించి చెప్పుకోవడమేకానీ నువ్వు మా గురించి అడగవేం?" అన్నాడు శర్మ.

"అడ్డమైన వాళ్ళ గురించీ వాకబు చెయ్యడం నాకసహ్యం—" అన్నాడు అప్పారావు.

"అలాంటి పని మాకూ అసహ్యమే. అయినా మీ గురించి వాకబుచెయ్యక తప్పలేదు. నువ్వు ఎవరెవరికి ఎంతెంత బాకీలున్నావో తెలుసుకుని వాళ్ళందరి బాకీలూ తీర్పించాలని వచ్చాం—" అన్నాడు శాస్త్రి.

"నా చేత బాకీలు తీర్పిస్తారా? నేనసలు ఎప్పుడైనా ఎవరి దగ్గరైనా అప్పుచేస్తేకదా!"

"నువ్వు అప్పుచెయ్యలేదూ?" అన్నాడు శాస్త్రి.

"అప్పు చెయ్యాల్సిన అవసరం నాకేమిటి? నన్ను చూడండి, నా యిల్లు చూడండి, నా వైభవం చూడండి...."

"నిన్ను తప్ప మిగతావి చూడ్డానికి మాకేం అభ్యంతరంలేదు కానీ నువ్వు అప్పుచెయ్యలేదనడానికి సాక్ష్యమేమిటి?"

"ముందు అప్పుచేశాననటానికి సాక్ష్యమేమిటి?" అన్నాడు అప్పారావు.

శాస్త్రి, శర్మ ముఖముఖాలు చూసుకున్నారు.

అవును—ఇంటాయన తనకు నోటులాంటిదేమీ ఇవ్వలేదు. ఏ నోటూ లేకుండా బాకీ ఎలా ఇస్తాడు ఆయనమాత్రం? ఆయన నిజంగా అప్పారావుకు అప్పిచ్చాడా? ఇస్తే నోటెందుకు ఇవ్వలేదు? అయినా బాకీ వసూలు చేసుకొస్తామని బయల్దేరిన తాము మాత్రం నోటు అడగ లేదేమిటి? తామే మర్చిపోయినపుడు ఇంటాయన మర్చిపోవడంలో ఆశ్చర్యమేముంది? ఇప్పుడేం చేయాలి? వెళ్ళి నోటు తీసుకుని మళ్ళీ రావాలా? లేక....

"మిస్టర్ అప్పారావ్! చంద్రుడు వెన్నెల కాశాడనడానికి సాక్ష్యం అక్కర్లేదు. అలాగే మేము బాకీ వసూలుకు వస్తే - నువ్వు అప్పు చేశావనడానికీ సాక్ష్యం అవసరం లేదు" అన్నాడు శాస్త్రి.

"శుక్లపక్ష చంద్రుడిలా ఎగిరెగిరి పడుతున్నావు. కృష్ణపక్షంలోకి పంపేయగలను. కాస్త జాగ్రత్తగా వుండు—" అంటూ అప్పారావు భుజాలు కదిపి కండలు పొంగించాడు.

"అసలు నీ పేరే అప్పారావు. అప్పారావు అప్పులు చేస్తాడని మూళ్ళపూడి వెంకటరమణ అన్నాడు. ఆ సంగతి నీకు తెలుసా?" అన్నాడు శాస్త్రి మళ్ళీ.

"పోనీ—ఆ రమణగారింకా ఏమన్నారో చెప్పండి. అప్పారావు అప్పులు తీరుస్తాడుటా?"

అప్పారావు మాటలకు శాస్త్రి, శర్మ ఇద్దరూ కూడా ఆశ్చర్యపోయారు. శాస్త్రి నెమ్మదిగా—"నువ్వు పహిల్వాన్‌లా కనబడుతున్నావ్? నీకిన్ని తెలివితేటలేమిటి—ఇది బాగోలేదు—" అన్నాడు.

"నాకు తెలివి తేటలెలా వచ్చాయో తెలుసుకోవాలనుంటే చెబుతాను. కానీ అందుకు పాతికవేలు ఖర్చవు

తుంది. ఒప్పుకుంటారా?" అనడిగాడు అప్పారావు.

"ఒప్పుకోను. బాకీ ఇలా చెల్లగొట్టడానికి వీల్లేదు—" అన్నాడు శర్మ.

శర్మ మళ్ళీ బాకీ ఊసెత్తగానే అప్పారావుకు కోపం వచ్చింది. తనెవ్వరికీ బాకీ లేననీ మరోమాటు బాకీ అంటే మర్యాద దక్కదనీ అతను తీవ్రంగా హెచ్చరించాడు. అయినా శాస్త్రి, శర్మ మానలేదు. అప్పుడు అప్పారావు చిరునవ్వు నవ్వి—"పక్కింట్లో జంబులింగం వున్నాడు. నా బాకీ గురించి ఆయనతో ఓ పదినిముషాలు మాట్లాడండి. ఇక్కడేం జరిగిందో ఆయనకు చెప్పడం మర్చిపోకండి. ఆ తర్వాత మీకింకా సరదాగా వుంటే నా దగ్గరకొద్దురుగాని. ప్రస్తుతానికి వెళ్ళండి—" అన్నాడు.

శాస్త్రి, శర్మ జంబులింగం ఇంటికి వెళ్ళారు.

జంబులింగం సన్నగా ఊచలా వున్నాడు. మాట్లాడుతూంటే దగ్గుతాదేమోనని అనుమానం వస్తుంది. కానీ దగ్గడు. వంటికి తగ్గట్టే పిట్ట మొహం. మొహానికి తగ్గట్టే గుడ్లగూబ కళ్ళు.

"మీరు అప్పారావుగారితో దెబ్బలాడి వచ్చారా?" అనడిగాడు జంబులింగం శాస్త చిరాగ్గా.

"మీకెలా తెలుసు?" శర్మ ఆశ్చర్యంగా అడిగాడు.

"తనతో దెబ్బలాడిన వాళ్ళనే ఆయన నా యింటికి పంపుతాడు...." అన్నాడు జంబులింగం.

"నువ్వు ఆయనకంటె మొనగాడివా?" అన్నాడు శర్మ.

"అబ్బే—అదేం కాదు. మా యింట్లోకి పరీక్షించి చూడండి. వీధిలో అన్ని దోమలూ, ఈగలూ వున్నాయి

గదా—మా యింట్లో ఎక్కడైనా ఒక్క ఈగైనా దోమైనా వున్నదేమో చూడండి—" అన్నాడు జంబు లింగం.

శర్మ, శాస్త్రి కాస్త తీరుబడిగానే పరీక్షించారు. ఇంట్లో ఎక్కడా ఈగలు, దోమలు మచ్చుకి కూడా లేవు.

"అప్పారావు మా యింట్లోకి ఈగనూ, దోమనూ కూడా రానివ్వడు. అది ఆయన గొప్పతనం. ఆయన నీడలో నేను చాలా సుఖపడుతున్నాను. ఆయనకు తన్ను తాను పొగడుకోనడం ఇష్టముండదు. లేకపోతే తన గురించి తనే చెప్పుకోవచ్చు. ఆయన్ను పొగడాలంటే ఆదిశేషుడి వేయి నాల్కలూ చాలవు. నా నాలికే పాటిది?" అన్నాడు జంబులింగం పరవశంగా.

శాస్త్రి చిరాగ్గా—"నీ చిన్న మొహంలో నాలిక కూడా వుందా?" అన్నాడు.

జంబులింగం మొహం చిట్లించి — "వేళాకోళంగా వుందా — నాకు అప్పారావు రక్షణ వున్నది—" అన్నాడు.

"అప్పారావు రక్షణ నీకు కలకాలం కావాలంటే— అతణ్ని నువ్వు రక్షించుకోవాల్సి వుంది. మర్యాదగా మా బాకీ తీర్చేయమని అతడికి చెప్పు—" అన్నాడు శాస్త్రి.

జంబులింగం కోపంగా—"కోపంవస్తే అప్పారావు పచ్చిరక్తం తాగుతాడు తెలుసా?" అన్నాడు.

"కోపం రాకపోయినా మా రక్తం పచ్చిగావుండదు. అప్పుడప్పుడూ వేడిగా సలసల మరుగుతూ వుంటుందని అప్పారావుకు చెప్పు—" అన్నాడు శర్మ.

జంబులింగం ఇద్దరివంకా అదోలా చూసి—"మీ ధైర్యంచూస్తే మీకు కరాటే బాగా వచ్చునన్న అను మానం కలుగుతోంది. అప్పారావుకూ కరాటేవచ్చు—" అన్నాడు.

"కరాటే వచ్చినా రాకపోయినా అప్పుతీర్చడం వసేచాలు...." అన్నాడు శాస్త్రి.

"మీరిక్కడే వుండండి—" అంటూ జంబులింగం ఓసారి పక్కింటికెళ్ళి అప్పారావుని కలుసుకుని మాట్లాడి వచ్చాడు. వెళ్ళేటప్పుడు నిరుత్సాహంగా వున్నాడు. తిరిగి వచ్చేటప్పుడు హుషారుగా వున్నాడు.

"అప్పారావుగారు మిమ్మల్ని మళ్ళీ కలవడానికి భయపడుతున్నారు. ఆయనకు నరసరాజుగారు యాభై వేలివ్వాలి. ఆయన ఇవ్వడంలేదుట. ఆ యాభై వేలూ మీరు వసూలుచేసి తేగలిగితే అందులోంచి మీ పాతిక వేలూ ఇచ్చేస్తారుట. నరసరాజుగారి దగ్గర బాకీ వసూలు చేయడం అప్పారావుగారివల్లే కాలేదట. మీ రా బాకీ వసూలుచేసి పెడితే మీ మేలు జన్మకు మరిచిపోలేరుట" అన్నాడు జంబులింగం.

మిత్రులిద్దరూ ముందు తటపటాయించినా తర్వాత అంగీకరించి నరసరాజు వివరాలు తెలుసుకున్నారు. వారం రోజులపాటు వారికి ఘనమైన ఆతిథ్యమిచ్చే బాధ్యత జంబులింగం తీసుకున్నాడు.

## 3

ఇంటిదగ్గర అరుగుమీద కుర్చీలో ఓ మీసాలవ్యక్తి కూర్చుని వున్నాడు. శాస్త్రి, శర్మ అడ్రస్ చూసు కుంటూ ఆ యింటిని సమీపించి ఆ వ్యక్తిని చూసి—"అయ్యా నరసరాజుగారంటే తమరేనా?" అన్నారు.

సమాధానంగా ఆ వ్యక్తి పులిలా ఘాండ్రించి–"నేను నరసరాజునెలా అవుతాను?ఆయన నా అన్నగారు. నేను పులిలా ఘాండ్రిస్తే ఆయన సింహంలా ఘర్జిస్తాడు–" అన్నాడు.

"మేమోసారి ఆయన్ను కలుసుకోవాలి?" అన్నాడు శాస్త్రి.

"ఎవరని చెప్పమంటారు?" అంటూ నరసరాజు తమ్ముడు లేచాడు.

"సర్కస్ వాళ్ళని చెప్పండి...." అంటూ శాస్త్రి, శర్మ మెట్లెక్కారు.

నరసరాజు తమ్ముడు లోపలకు వెళ్ళి కొంత సేపటికి ఓ వ్యక్తితో వీధిలోకి వచ్చాడు. అప్పటికి శాస్త్రి, శర్మ అరుగుమీద సిరపడ్డారు.

"నా పేరే నరసరాజు. మామూలుగా అయితే మిమ్మల్ని లోపలకు పిలిచివుండేవాణ్ని, కానీ మర్యాద తెలీనివాళ్ళను నేను వీధిలోనే కలుసుకుంటాను...." అన్నాడు నరసరాజు.

"నమస్కారమండి. పెద్దమనుషులకు అప్పిచ్చి అడగడం మర్యాదకాదని నాకూ తెలుసు. కానీ అప్పుచ్చుకుని అడిగించుకునేవాడు పెద్దమనిషి అనిపించుకుంటాడంటారా? మర్యాద ప్రస్తావన ఎలాగూ తెచ్చారు కాబట్టి అదే చూపించి — అప్పారావుగారికివ్వాల్సిన యాభై వేలూ ఇచ్చేయండి—" అన్నాడు శాస్త్రి.

"ఓహ్ — మిమ్మల్ని అప్పారావు పంపాడా? ఆ మాట ముందుగా చెప్పలేదేం? లోపలకు రండి డబ్బిచ్చేస్తాను...." అన్నాడు నరసరాజు. ఆయన ముఖంలోని

కోపం మాయమైపోయింది.

శాస్త్రి, శర్మ ముఖముఖాలు చూసుకుని తమలో గుసగుస లాడుకున్నారు. ఇదేదో దొంగ నాటకంలా గున్నదని వారిద్దరికీ అమానం వచ్చింది. అయితే యేం— కోట్లో తలదూర్చడం తమకు కొత్తకాదు కాబట్టి ధైర్యంచేసి ఇద్దరూ లోపలకు వెళ్ళారు. నరసరాజు వాళ్ళిద్దర్నీ ఓ గదిలోకి తీసుకు వెళ్ళి కుర్చీల్లో కూర్చో బెట్టి మర్యాద చేశాడు. వాళ్ళకు కాస్త దూరంగా తనూ ఓ కుర్చీలో కూర్చుని — "మీకు ఎంత ఇవ్వాలన్నారు?" అన్నాడు.

"యాభై వేలు—" వినయంగా అన్నాడు శాస్త్రి.

"తమ్ముడూ — సరిగ్గా యాభై వేలుట లెక్క చూసి పట్రా—" అన్నాడు నరసరాజు గట్టిగా. గది బయట నుంచి—అలాగే అన్నయ్యా—అని వినబడింది. మరు క్షణంలో శాస్త్రి, శర్మల చేతులు, కాళ్ళు కుర్చీకి కట్టు బడిపోయాయి. మిత్రులిద్దరూ ఒక్కసారిగా-"మోసం!" అని అరిచారు.

"తమ్ముడూ—మోసం అంటే ఏమిటో ఒక్కసారి చూపించు...." అంటూ నరసరాజు గట్టిగా అరిచాడు. అలాగే అన్నయ్యా—అని గది బయటనుంచి వినబడింది. మరుక్షణం ఇద్దరి కుర్చీలూ గిరగిరా తిరగసాగాయి. అలా చాలా వేగంగా తిరుగుతున్నాయవి. నరసరాజు ఆ దృశ్యం చూస్తూ విరగబడి నవ్వసాగాడు. ఆయన నవ్వు తూంటే సింహం గర్జించినట్టుంది.

"ఆపు తమ్ముడూ!" అంటూ అరిచాడు నరసరాజు. కుర్చీలు తిరగడం ఆగిపోయింది.

"సర్కస్ ఎలాగుంది?" అన్నాడు నరసరాజు

వాళ్ళవైపు చూసి నవ్వుతూ. అయితే శాస్త్రి, శర్మ సమాధానం ఇచ్చే పొజిషన్లో లేరు. వాళ్ళకు ప్రపంచ మంతా ఇంకా గిర్రున తిరుగుతున్నట్టే వుంది. వాళ్ళు మామూలు స్థితికి చేరుకోనడానికి కొంచెంసేపు పట్టింది. నరసరాజు ఓపిగ్గా వాళ్ళు తేరుకు నేదాకా ఆగి-"సర్కస్ ఎలావుంది?" అని మళ్ళీ అడిగి — సింహగర్జన చేశాడు. అంటే నవ్వేడన్నమాట!

"సర్కస్‌వాళ్ళు జంతువులకు శిక్షణ ఇచ్చేటప్పుడు అన్నీ ముందు తామే చేసి చూపిస్తారు. మేమూ అదే చేశాం. అంతే!" అన్నాడు శాస్త్రి.

నరసరాజు ఆశ్చర్యంగా వాళ్ళిద్దరివంకా చూసి "మీ ధైర్యాన్ని మెచ్చుకోవాలి!" అన్నాడు.

"ధైర్యవంతులు కాబట్టే ఏ సమస్యనైనా ధైర్యంగా ఎదుర్కుంటాం. ఎవర్నీ ఎందులోనూ మోసం చెయ్యం. అందువల్ల దేవుడు ఎప్పుడూ మా పక్షాన్నే వుంటాడు-" అన్నాడు శర్మ.

"సరే—మీ చేత మళ్ళీ సర్కస్ చేయించాల్సి వుంటుంది. కానీ అవతల నాకింకా పనులున్నాయిగదా- అందాకా రెస్టుతీసుకోండి—" అంటూ నరసరాజు గది లోంచి వెళ్ళిపోయాడు. నరసరాజు ఆ గదిలోంచి వెళ్ళి పోయాక మళ్ళీ రెండు రోజులవరకూ ఎవరూ అక్కడ అడుగుపెట్టలేదు. శాస్త్రి, శర్మ ఇద్దరికీ తినడానికి తిండిలేదు. తాగడానికి మంచినీళ్ళు లేవు.

"ఇలా తిండీ తిప్పలూ లేకుండా పడి చావదల్చుకుంటే మన రూములోనే ఆ పని చెయ్యాల్సింది. అనవసరంగా ఇంత దూరం వచ్చాం. రూములో అయితే కాళ్ళూ, చేతులూ కదపడానికుండేది. ఇక్కడ అదీలేదు...."

అన్నాడు శర్మ.

"గాంధీగారు అన్నేసి రోజులు నిరాహార దీక్ష ఎలా చేసేవాడో కానీ నాకు మాత్రం ఈ రెండు రోజులకే ప్రాణం కడంటిపోయింది. చచ్చిపోతున్నానేమోనన్న అనుభూతి కల్గుతోంది——...." అన్నాడు శాస్త్రి.

"ఒకవేళ మనం చచ్చిపోయామేమో...." అన్నాడు శర్మ.

"చచ్చిపోతే మనం శవాలమయ్యుండాలి. ఆత్మలమైతే ఏ సంకెళ్ళూ బంధించలేవు. ఒకవేళ బంధించినా సంకల్పమాత్రాన విడిపోతాయి. పోనీ మనం ఆత్మలమే అనుకుందాం—ఈ సంకెళ్ళు విడిపోవుగాక...." అన్నాడు శాస్త్రి. అతడి నోటంట ఆ మాటలు రావడమే తడవుగా ఇద్దరికీ హఠాత్తుగా సంకెళ్ళు విడివడ్డాయి. మిత్రులిద్దరూ ఠక్కీమని కుర్చీల్లోంచి లేచిపోయారు.

"గురూ.—కొంపతీసి మనం నిజంగానే ఆత్మలమై పోయామా?" అన్నాడు శర్మ.

శాస్త్రికీ అంతా అయోమయంగా వుంది. ముందు కాళ్ళూ చేతులూ నొప్పి పెడుతున్నాయి. వళ్ళంతా నీరసం. ఇక్కణ్ణించి పారిపోవాలంటే వంట్లో శక్తి కావాలి. శక్తి కావాలంటే భోజనం కావాలి. ముందు మంచినీళ్ళు.

"మంచినీళ్ళు కావాలి!" అన్నాడు శాస్త్రి.

సరిగ్గా అప్పుడే శర్మ కళ్ళకు గది మూలగా వున్న వాష్‌బేసిన్ కనబడింది. అందులో కుళాయివుంది. కుళాయి లోంచి నీళ్ళు వస్తున్నాయి. ఇద్దరూ ముందు కడుపు నిండా నీళ్ళు పట్టించారు. కొంత శక్తి వచ్చినట్లయింది. అప్పుడు శర్మ—"మనం అనుకున్నవన్నీ జరుగుతున్నాయి

కాబట్టి ఆత్మలమనుకోవాలా? ఆకలి దప్పులు బాధిస్తున్నాయి కాబట్టి మనుషులమనుకోవాలా?" అన్నాడు.

"పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకోకు. మనం మనుషులమే. ముందా తలుపు దగ్గరకు వెళ్ళి ప్రయత్నిద్దాం. ఆత్మలనైతే తలుపులడ్డగించవు. కానీ మనని అడ్డగించవచ్చు—" అంటూ శాస్త్రి మిత్రుడితో గుమ్మంవైపు నడిచాడు. వాళ్ళు గుమ్మాన్ని సమీపించడమేమిటి? రెండు తలుపులు బార్లా తెరుచుకున్నాయి.

శర్మ ఆశ్చర్యంతో నోరావలించాడు. ఎవరో అక్కడే వుండి తమను కనిపెడుతున్నారు. తమతో ఆడుకుంటున్నారు. మిత్రులిద్దరూ తటపటాయిస్తూ ముందడుగు వేశారు. ప్రమాదం పొంచి వున్నదనీ ఏ క్షణాన్నయినా అది మీద పడవచ్చుననీ ఇద్దరికీ అనిపిస్తోంది— అయినా చేయగలిగినదేమున్నది?, ఇద్దరూ గుమ్మంలోకి వచ్చారు.

అప్పుడు చూశారు వాళ్ళు-పక్కనే వున్న వ్యక్తిని.... ఆ వ్యక్తి పదేళ్ళ బాలుడు!

"ఎవరు మీరు?" అన్నాడు ఆ అబ్బాయి వీళ్ళద్దరి వంకా ఆశ్చర్యంగా చూస్తూ.

మిత్రులిద్దరికీ ఏం చెప్పాలో తెలియ లేదు— "నువ్వెవరు?" అన్నాడు శాస్త్రి.

"నా పేరు రాము. నరసరాజుగారి మనవణ్ని. మా తాత నన్నెప్పుడూ ఇటువైపు రానివ్వడు. ఈ గదికున్న స్విచ్‌లు ముట్టుకోనివ్వడు. నాకిక్కడ ఆడుకోవడం సరదా. ఇప్పుడాయన ఇంట్లో లేడు. ఇలా ఆడుకుందుకు వచ్చాను. ఒకో స్విచ్ నే నొక్కుతున్నాను. ఓ స్విచ్ నొక్కేసరికి ఈ గది తలుపులు తెరుచుకున్నాయి. మీరు

బైటకు వచ్చారు—"

శాస్త్రి బుర్ర చురుగ్గా పనిచేసింది. భగవంతుడు రామురూపంలో తమకు సాయం వచ్చాడు. ఈ సాయం ఉపయోగించుకోవాలి. అతను రామూవంక చూసి—

"నరసారాజుగారి స్నేహితులం. మేము ఇప్పుడే ఇక్కడికి వచ్చాం. పదినిముషాల క్రితందాకా ఆయన ఇక్కడే వున్నారు. ఇప్పుడే వస్తానని బయటకు వెళ్ళారు. నువ్వేమో ఆయన ఇంట్లో లేరంటున్నావు..." అన్నాడు.

రాము బుర్ర గోక్కుని — "ఇంట్లోంచి బయల్దేరి గంటయింది. అయితే నాకు తెలీకుండా ఇలా వచ్చాడన్నమాట తాతయ్య. తాతయ్యకు నేనిటువైపు రావడం ఇష్టముండదు. ఎప్పుడూ ఇటువైపు రాకుండా ఎవరో ఒకరు కాపలా వుంటారు. ఇన్నాళ్ళకీవేళ నాకు అవకాశం దొరికింది. తాతయ్య ఇక్కణ్ణించే అలా బైటకు వెళ్ళిపోయుంటాడు...." అన్నాడు.

నరసరాజుది చాలా పెద్ద యిల్లు. వీధివైపు ఇంట్లో వాళ్ళెవ్వరూ మసలరు. వీధిలోంచి బాగా లోపలకు వెడితేనే—ఆడవాళ్ళు, పిల్లలు మసిలే ఆవరణ వస్తుంది. శాస్త్రి, శర్మ బంధించబడిన ప్రాంతం వీధి గదిలోంచి కుడిపక్కగా వుంది. అది నరసరాజు ప్రత్యేకమైన ఆవరణ. అక్కడ ఇంట్లో వాళ్ళెవ్వరూ మసలరు.

"మీ తాతయ్య ఎక్కడికెళ్ళాడో నాకు తెలుసు. అక్కడ పిల్లలు చూడ్డానికి మంచి తమాషాలున్నాయి. మాతో వస్తావేమిటి?" అన్నాడు శర్మ.

రాముని ఒప్పించడానికి వాళ్ళకు ఎంతో సేపు పట్టలేదు. ఇంట్లో ఎవ్వరూ చూడకుండా వీధిదారినే వాళ్ళు బయటకు వచ్చేశారు.

నరసరాజు, తమ్ముడు కలిసి ఇంటి గుమ్మం మెట్లెక్కుతూ—"నమస్కారమండీ—" అన్న పిలుపు వినబడి ఉలిక్కిపడి వెనక్కి తిరిగారు. వెంటనే వాళ్ళ ఉలికిపాటు ఆశ్చర్యంగా మారిపోయింది.

"మీరా?" అన్నాడు నరసరాజు ఆశ్చర్యంగా.

"చాలా సేపట్నించి మీ యింటిముందు కాపువేశాం. మీరు ఇప్పటికి వచ్చారు. త్వరగా యాభై వేలూ తెచ్చి చ్చేయండి. అవతల మాకు చాలా పనులున్నాయి—" అన్నాడు శర్మ.

"మీకింకా బుద్ధి రాలేదా?" అన్నాడు నరసరాజు ఆశ్చర్యంగా.

"సినిమాల్లోనూ, కథల్లోనూ కూడా మొదట్లో కష్టపడ్డా చివర్లో బుద్ధి తెచ్చుకునేది విలన్లే! మన సినిమాల్లోనూ, కథల్లోనూ వాస్తవికత ఎంతో చక్కగా ప్రతిబింబించబడుతున్నదని మేము నమ్ముతాం. కాబట్టి బుద్ధంటూ వస్తే అది మీకే రావాలి. మాకు కాదు—" అన్నాడు శర్మ.

"బాగా ఆలోచించి మంచి డైలాగే చెప్పావుగానీ-నా శిక్షల డోసు అలా అలా పెరుగుతూంటుంది. రెండోసారి మీ చేత సర్కస్ చేయించానంటే మీరింక బ్రతికి బట్టకట్టలేరు—" అన్నాడు నరసరాజు.

"మీకింకా బుద్ధి రాలేదా?" అన్నాడు శాస్త్రి.

నరసరాజు పులిలా గాండ్రించాడు.

"అయ్యో—నరసరాజుగారూ—అప్పుడే మీ స్టేటస్ దిగిపోతోంది. ఇదివరలో సింహంలా గర్జించేవారు. ఇప్పుడు పులిలా గాండ్రిస్తున్నారు. ఇంకా స్సేపుపోతే

కుక్కలా మొరిగి ఆఖరికి పిల్లిలా మ్యావుమంటారు. లోపలకు వెళ్ళేక ఇంకా యాభై వేలూ తెచ్చి మాకివ్వాలనిపించక పోతే ఒక్కసారి మీ కోడలిగారిని—అమ్మా—రామూ ఏడీ అని అడిగి చూడండి. వాళ్ళ సమాధానం విని అప్పుడు పరుగున వచ్చి యాభై వేలూ తెచ్చి ఇచ్చేయండి" అన్నాడు శాస్త్రి.

"ఏమన్నావ్?" నరసరాజు చేతులు వణికాయి. అప్పటికి శాస్త్రి, శర్మ అరుగులమీద స్థిరపడ్డారు. "తమ్ముడూ, నువ్వు లోపలకు వెళ్ళి రాము గురించి అడిగిరా—నాకేదో భయంగా వుంది—" అన్నాడు.

తమ్ముడు అయిదు నిముషాల్లో బయటకు వచ్చి—"రామూ ఇంట్లో లేడు — ఎక్కడికైనా ఆడుకుందుకు వెళ్ళాడేమో—" అన్నాడు నరసరాజుతో.

"ఎక్కడికీ వెళ్ళలేదు. మా దగ్గర క్షేమంగా వున్నాడు. మీరు యాభై వేలు ఇచ్చేస్తే క్షేమంగా మీ దగ్గరకు చేరుకుంటాడు. లేదా ఎక్కడో సర్కస్ చేస్తూంటాడు—" అన్నాడు శాస్త్రి.

"అభం శుభం ఎరుగని పసివాణ్ని తీసుకుపోవడానికి మీకు చేతులెలా వచ్చాయి? వెంటనే వాణ్ని తీసుకురండి. లేకపోతే నేనేం చేస్తానో నాకే తెలియదు.." అన్నాడు నరసరాజు.

"మీరేం చేస్తారో మీకు తెలియదు. కానీ నేనేం చేస్తానో నాకు తెలుసు. మీకూ తెలుసు. ఆ విషయం గుర్తుంచుకుని యాభై వేల విషయంలో తొందరగా ఓ నిర్ణయం తీసుకోండి—" అన్నాడు శర్మ.

కాసేపు వారి నలుగురిమధ్యా నిశ్శబ్దం రాజ్యమేలింది.

"మిస్టర్స్ మీ పేర్లేమిటి?" అన్నాడు నరసరాజు.

"ఇప్పటికి మా పేర్లడగాలని తెలిసింది మీకు—" అంటూ శాస్త్రి, శర్మ తమ పేర్లు చెప్పారు.

"మిస్టర్ శాస్త్రీ! ఒక్కసారిగా యాభై వేలు తేగల గొప్పవాడిని కాను నేను. నీకు రెండు చేతులూ జోడించి నమస్కరిస్తాను. నా మనుమణ్ని నాకు తెచ్చి యివ్వు. ఆ పసివాడు ఏం అగచాట్లు పడుతున్నాడోనని నా మనసు గిలగిలలాడిపోతున్నది. ప్లీజ్ మిస్టర్ శాస్త్రీ! నా మనుమణ్ని నాకు తెచ్చి యివ్వు...." అన్నాడు నరసరాజు.

ఆయన మాటలు ఆపి ఏడ్వ నారంభించాడు. శాస్త్రి ఆశ్చర్యపోయాడు.

"అయ్యా—నరసరాజుగారూ—చాకులాంటి కుర్రాళ్ళిద్దర్ని మోసం చేసి బంధించి కుర్చీలో కూర్చోబెట్టి గిరగిరా తిప్పి రెండు రోజులు తిండీ, నీళ్ళూ లేకుండా చేశారు. అప్పుడు మీ కంట ఒక నీటిచుక్కయినా చూడలేదు నేను. పదేళ్ళ మీ మనుమడికోసం కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చేస్తున్నారు. మేము మీవంటి రాక్షసులం కాము. కాబట్టి మీ మనుమడికి ఎలాంటి ఆపదా వుండదు. అయితే మీ కల్లబొల్లి ఏడ్పులకు కరిగిపోయి వచ్చిన పని మర్చిపోతామనుకోకండి. యాభై వేలు ఇచ్చితీరాల్సిందే—ఇంట్లోంచి తెచ్చిచ్చినా సరే—లేదా బ్యాంకుకు వెళ్ళి తెచ్చిచ్చినా సరే—" అని వాచీ చూసి "ఇంక బ్యాంకుకు అరగంట మాత్రమే వుంది. త్వరపడండి—" అన్నాడు శాస్త్రి.

"బ్యాంకుకు వెళ్ళి యాభయి వేలు తేవాలంటే ఇప్పుడు లాభంలేదు. రాత్రిదాకా ఆగాలి. అదీ నా పరిస్థితి—" అన్నాడు నరసరాజు. ఆయన చూపులు దీనంగా

వున్నాయి. మీసాలు క్రిందకు వాలివున్నాయి.

"అలాంటప్పుడు అప్పారావుకు అంత డబ్బు ఎలా బాకీపడ్డారు?" అడిగాడు శాస్త్రి.

"ఆ ప్రశ్నకు జవాబు నేను చెప్పలేను. పోతురాజూ చెప్పాలి—" అన్నాడు నరసరాజు.

"పోతురాజా, వాడెవడు?" అన్నాడు శర్మ ఆశ్చర్యంగా.

"పోతురాజు నాకు లక్షరూపాయలు బాకీవున్నాడు. కానీ వాడది తీర్చడు. ఇమ్మని నేనూ అడగలేను. వాడు నా బాకీ తీరిస్తే నేను అప్పారావుగారి బాకీ తీర్చడం కష్టంకాదు సరిగదా క్షణాలమీద పని!" అన్నాడు నరసరాజు.

"మీ యింట్లో ఎలాంటివాడినైనా పట్టుకోగల ఏర్పాట్లున్నాయికదా — మీరు పోతురాజు నెందుకు స్వాధీనం చేసుకోలేకపోయారు?" అనడిగాడు శర్మ.

"పోతురాజు గురించి ఎరిగిన వాళ్ళెవ్వరూ ఈ ప్రశ్న వేయరు—" అన్నాడు నరసరాజు.

"నాకు తెలియదు కాబట్టే నేనీ ప్రశ్న వేశాను. వాడి గురించి చెప్పండి—" అన్నాడు శర్మ.

"వాడి గొప్పతనం అనుభవించిన వాడికి గానీ తెలియదు. పగవాడికి కూడా వాడి గొప్పతనం అనుభవంలోకి రావాలని నేను కోరుకోవడంలేదు—" అన్నాడు నరసరాజు.

"మేమిద్దరం పోతురాజు దగ్గరకు వెళ్ళి మీ బాకీ వసూలుచేసుకువస్తాం. మీకు అభ్యంతరమా?" అన్నాడు శాస్త్రి.

"అభ్యంతరమే—అది నాకు ప్రమాదం. పోతు

రాజుకూ నాకూ గొడవ లేవద్దు మీరు—" అన్నాడు నరసరాజు.

"పోతురాజు మీకు బాకీ వున్నప్పుడు అడగడానికి మీకు భయమెందుకు?" అన్నాడు శాస్త్రి.

"అప్పారావు నా దగ్గర బాకీ వసూలు చేసుకోడానికి సాహసిస్తున్నాడా? ఇదీ అంతే—మహా సముద్రంలో చిన్న చేపలు పెద్ద చేపలకు దూరంగా వుండక తప్పదు. వ్యాపారస్తుడు తీసుకున్నది లాభం అంటారు. గవర్నమెంటు తీసుకుంటే పన్ను అంటారు. అవి అప్పులనరు. సాటివాడు తీసుకుంటేనే అప్పవుతుంది. పోతురాజు నాకు సాటివాడు కాదు—"

"మేమోసారి పోతురాజును కలుసుకోవాలి. వివరాలు చెప్పండి. మీ సంగతి వాడికి చెప్పంలెండి—" అన్నాడు శర్మ. నరసరాజు అయిష్టంగానే వాళ్ళకు కొన్ని వివరాలు చెప్పి తన ప్రసక్తి తీసుకురావద్దని వాళ్ళకు మరీమరీ చెప్పాడు. మనిషి బాగా బెదిరినట్లుగా కనబడ్డాడు.

## 5

అదొక చిన్న పెంకుటిల్లు. శాస్త్రి వెళ్ళి తలుపుతట్టి "పోతురాజుగారూ!" అని పిలిచాడు.

కొద్ది నిముషాల్లో యింటి తలుపులు తెరుచుకున్నాయి. సన్నగా పొట్టిగావున్న ఓ మనిషి తలుపుతీసి శాస్త్రివంక ఎగాదిగా చూసి—"ఎవర్నువ్వు?" అనడిగాడు.

"నా పేరు శాస్త్రి. నాకు పోతురాజుగారితో పని వుంది—" అన్నాడు శాస్త్రి.

"లోపలకురా— నేనే పోతురాజును—" అన్నాడా వ్యక్తి.

శాస్త్రి ఆశ్చర్యంగా లోపలకు వెళ్ళాడు. నరసరాజు

వంటి మనిషి నే గడగడలాడించిన ఆ పోతురాజు చాలా గొప్పగా వుంటాడనుకున్న అతడికి ఆశాభంగమయింది. నరసరాజింట్లో భంగపాటయ్యాక శాస్త్రి, శర్మ ఇద్దరూ ఒకేసారి కలిసి అనుమానాస్పదమైనచోట్ల చొరబడ కూడదనుకున్నారు. అందుకే దూరాన్నుంచి శర్మ కాపలా వున్నాడు.

ఇల్లు చాలా చిన్నది. వంటగది కాక రెండు గదు లున్నాయి. బాత్రూంలేదు. దొడ్లో నుయ్యి ఒకటి వున్నది.

"చాలా చిన్న యిల్లు!" అన్నాడు శాస్త్రి.

"నువ్వు వచ్చిన పనేమిటి?" అన్నాడు పోతురాజు.

"నాకో లక్షరూపాయలు అర్జంటుగా కావాలి—" అన్నాడు శాస్త్రి.

పోతురాజు తీక్షణంగా శాస్త్రివంక చూసి—"అప్పుగానా?" అన్నాడు.

"అప్పనుకున్నా సరే—బాకీ తీరుస్తున్నాననుకున్నా సరే—" అన్నాడు శాస్త్రి.

"నేను బాకీలు తీర్చను. కావాలంటే డబ్బు అప్పుగానే ఇస్తాను—" అన్నాడు పోతురాజు.

"నాక్కావలసింది ఒకటీ రెండూ కాదు. లక్ష రూపాయలు—" అన్నాడు శాస్త్రి నొక్కిస్తూ.

"ఒక లక్షేగా అన్నావు!" అన్నాడు పోతురాజు తేలిగ్గా తీసిపారేస్తూ—"నా దగ్గర చాలామంది సినిమా వాళ్ళు అయినూ, పదికీ తక్కువకాకుండా తీసుకు వెడు తూంటారు. ఇంత తక్కువ మొత్తం అడిగినవాణ్ని నిన్నే చూశాను—"

"నా ప్రాణానికి లక్షే ఎక్కువ. త్వరగా ఇయ్యి"—

అన్నాడు శాస్త్రి.

"నెలకు పదివేలు వడ్డీ కడుతుండాలి—అప్పు తీర్చే దాకా—" అన్నాడు పోతురాజు.

"చాలా దారుణంగా వుంది నీ వడ్డీ రేటు-" అన్నాడు శాస్త్రి.

"ఇష్టమైతేనే తీసుకో—రెడీ క్యాష్ ఇస్తాను. అన్నీ అసలు నోట్లే!" అన్నాడు పోతురాజు.

"నువ్వు నన్నెరుగవు కదా — బాకీ ఎలా వసూలు చేస్తావ్?" అన్నాడు శాస్త్రి ఆశ్చర్యంగా.

"పోతురాజుకు బాకీపడ్డాక ఇంక తెలియనివాడి వెలాగౌతావ్? సప్త సముద్రాల అవతల దాగున్నా వెతికి తీసుకురాగలను. నా వసూలు బెంగ లేదు. నా పద్ధతులు నాకున్నాయి. ప్రతి నెలా ఇదే తేదీకి వడ్డీ మాత్రం నిఖార్సుగా కట్టేయాలి...." అన్నాడు పోతురాజు.

"అలాగే—" అన్నాడు శాస్త్రి.

పోతురాజు అతణ్ని ఓ గదిలో కూర్చోపెట్టి తను పక్క గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకున్నాడు. ఓ అయిదు నిముషాల్లో అతను వంద రూపాయల నోట్ల కట్టలు తీసుకుని వచ్చి శాస్త్రిని లెక్కపెట్టమన్నాడు. అవి సరిగ్గా పదివున్నాయి. శాస్త్రి ఆనందంగా ఆ డబ్బు తీసుకుని జేబులో పెట్టుకున్నాడు.

అప్పుడు పోతురాజు శాస్త్రికి ఒక ఫోటో తీశాడు. తర్వాత అతడి వేలిముద్ర తీసుకున్నాడు. ఆ తర్వాత చటుక్కున అతిడి భుజంమీద ఏదో గుచ్చాడు. శాస్త్రికి చురుక్కుమంది. "ఏమిటది?" అని అతడు అడిగాడు.

"నా జాగ్రత్తలైపోయాయి. ఇంక నువ్వు

ఎక్కడికైనా పోవచ్చు—" అన్నాడు పోతురాజు.

శాస్త్రి బైటకు వచ్చాడు. కొంతదూరంపోయాక శర్మ అతణ్ని కలుసుకున్నాడు. శాస్త్రి అతడికి జరిగింది చెప్పి—"పోతురాజు వ్యవహారం చాలా తమాషాగా వుంది. చూస్తూండగా మనం లక్షాధికారులమైపోయాం" అన్నాడు.

"ఇప్పుడేంచేద్దాం?" అన్నాడు శర్మ.

"ఈ లక్షా తీసుకుని వెళ్ళి నరసరాజుకిచ్చేద్దాం—అందులోంచి యాభయివేలు తీసుకుని అప్పారావుకీ—అందులోంచి పాతికవేలు తీసుకుని మన ఇంటాయనకూ ఇచ్చి మన వాటా అయిదువేలూ వుంచుకుందాం—"

"బాగానే వుంది. మరి నెలనెలా పోతురాజుకు పది వేలు యిచ్చుకోవద్దూ?" అన్నాడు శర్మ.

"లక్షంటే అంత నిర్లక్ష్యంగా వున్నవాడికి అంతే కావాలి. మనం మళ్ళీ వాడికి కనబడొద్దు—"

"కానీ ఒకవేళ మనం పోతురాజునించి తప్పించుకోలేకపోతే?—" అన్నాడు శర్మ.

"ఇది అనుమానించదగ్గ విషయమే-అయితే పోతురాజు శక్తిసామర్థ్యాలు మనం తెలుసుకునే ఉపాయం ఒకటి వున్నది—అదేమిటంటే—ఇప్పుడే వెనక్కు వెళ్ళి—అయ్యా పోతురాజుగారూ—నేను కాస్త మతిమరుపు మనిషిని ప్రతిరోజూ ఏదో సమయంలో ఎన్నిరోజులయ్యాయో మీరు నాకు కాస్త హెచ్చరిక ఇచ్చే ఏర్పాట్లు చేయండి—అని అడుగుతాను. ఆ తర్వాత ఓ వారం రోజులు మనమతన్ని తప్పించుకు తిరుగుదాం—మన్ని పట్టుకోలేకపోతే అప్పుడు దర్జాగా లక్ష రూపాయలు తీసుకుని నరసరాజు దగ్గరకు వెళ్ళొచ్చు—"

అన్నాడు శాస్త్రి.

అతను మళ్ళీ పోతురాజు దగ్గరకు వెళ్ళాడు. పోతురాజు అంతా విని—"రోజూ ఎన్నింటికి గుర్తుచేయమంటావ్ చెప్పు—బాగా ఆలోచించుకుని మరీ టైము చెప్పు. ఎందుకంటే ఆ టైముకి నువ్వు నిద్రపోతున్నాసరే లేపి మరీ గుర్తుచేయడం జరుగుతుంది. తర్వాత విసుక్కుని లాభంలేదు—" అన్నాడు.

"రాత్రి ఎనిమిది గంటలకు—" అన్నాడు శాస్త్రి.

## 6

జేబులో డబ్బు చేరింది. అందులో బాకీ వసూలు క్రింద పదిహేనువేలు తమ స్వంతం. శాస్త్రి, శర్మ హుషారుగా ఓ హోటల్లో మకాం పెట్టారు. అక్కడ గదిలో పూర్తిగా తమ వేషాలు మార్చుకున్నారు. ఇద్దరూ నడివయస్కులైన ముస్లిమ్స్‌లా తయారయ్యారు. తర్వాత హోటల్లోంచి బయటపడ్డారు.

ఆ వేషాల్లో వాళ్ళకి ఒకర్నొకరు గుర్తించుకోవడమే కష్టంగా వుంది. కాబట్టి పోతురాజు మనుషులు గుర్తిస్తారన్న బాధలేదు. అదీకాక పోతురాజు ఇల్లు వదిలినప్పట్నుంచీ జాగ్రత్తగా వున్నారు. ఎక్కడా ఎవ్వరూ తమ ననుసరించిన జాడలేదు. అందుకని ఇద్దరూ ధైర్యంగా హోటల్లోంచి బైటపడి మురికివాడవైపు వెళ్ళారు. ఆ ప్రాంతాల తాముంటామని ఎవ్వరూ ఊహించలేరని ఇద్దరూ అభిప్రాయపడ్డారు.

వాల్తేర్లో మురికివాడలకేం లోటులేదు. అయితే ఈ మురికివాడల ప్రత్యేకత ఏమిటంటే—అవీ మధ్యతరగతి ఇళ్ళలాగే వుంటాయి. ఒకవిధంగా చెప్పాలంటే అదీ సరైన మాటకాదు. వాల్తేర్లో కొన్ని కొన్ని ప్రాంతాల

మధ్యతరగతి ఇళ్ళనీ, మురికివాడల్నీ వేర్వేరుగా గుర్తించడం అసాధ్యం. ఆ గొప్పతనం మురికివాడలద్వో, మధ్యతరగతి ఇళ్ళదో చెప్పడం కష్టం.

శాస్త్రి, శర్మ—అలాంటి మురికివాడలో ఓ చిన్న ఇంటిముందాగి తలుపు తట్టారు. అది నేడో, రేపో కూలేలా వున్న ఇల్లు. బాగా పరీక్షించి చూస్తే అదొక పెంకుటిల్లు అని తెలుస్తుంది.

తలుపు తట్టగానే లోపల అలికిడికావాలి. కానీ అలాంటిదేమీ జరగలేదు. కానీ రెండోసారి తలుపు తట్టడానికి శర్మ భయపడ్డాడు. "ఇవి తట్టవలసిన తలుపులు కావు. తాకవలసిన తలుపులు—" అన్నాడతను.

"ఇంట్లో ఎవరో వుండేవుండాలి. లేకపోతే ఇంటికి తాళంపెట్టి వుండేవారు—" అన్నాడు శాస్త్రి.

"ఈ యింటికి తాళమా—భలే జోకు...." అన్నాడు శర్మ.

శాస్త్రి బుర్ర పనిచేసింది—"అవును—ఈ ఇంటికి తాళం అక్కర్లేదు. ఈ తలుపుకు గడియమాత్రం అవసరమా — తలుపు కాస్త తోసిచూద్దాం—" అంటూ అతను నెమ్మదిగా తలుపు తోసే ప్రయత్నం చేశాడు. శర్మ అతణ్ని జాగ్రత్త జాగ్రత్త అని హెచ్చరించాడు. కానీ తలుపు సులభంగానే తెరుచుకుంది. అయితే అక్కడ దృశ్యంచూసి ఇద్దరూ ఆశ్చర్యపోయారు.

అక్కడ ఓ ఇరవై ఏళ్ళలోపు యువతి నగ్నంగా నిలబడివుంది. సుమారు నలభై ఏళ్ళ మగాడు ఆమె ఒంటిని తుడుస్తున్నాడు—గుడ్డతో. ఇద్దరు కూడా వీళ్ళను చూసి ఉలిక్కిపడ్డారు. ఆ యువతి చటుక్కున కాస్త మూలగా వెళ్ళింది.

"ఎవరు మీరు? ఇక్కడికెందుకు వచ్చారు?" అన్నాడా మనిషి కోపంగా.

"తలుపు తట్టే వచ్చాం. కానీ మైకంలో మీకేమీ వినపడినట్లులేదు...." అన్నాడు శాస్త్రి ఆ మనిషిని పరీక్షించి చూస్తూ. ఆ మనిషి పరమ వికారంగానూ, బికారిలాగానూ వున్నాడు.

"వెళ్ళండిక్కణ్నించి—" అన్నాడా మనిషి.

"ఇక్కడేం జరుగుతోందో తెలుసుకుని మరీ వెడతాం—" అన్నాడు శర్మ.

ఆ మనిషి ఒప్పుకోలేదు. ఆ అమ్మాయి చదువుకున్న దానిలా వుంది. వీడు బిచ్చగాడిలా వున్నాడు. ఇక్కడిలా ఎందుకు కలుసుకుంటున్నారు? ఈ ప్రశ్నకు జవాబు దొరికేదాకా మిత్రులిద్దరూ అక్కణ్నించి కదలమని చెప్పేశారు.

"మేమిద్దరం ప్రేమించుకున్నాం—" అన్నాడా మగాడు.

"నేను నమ్మను. ఇందులో ఏదో తిరకాసుంది. నాలుగు తంతే నువ్వే నిజం చెబుతావు—" అంటూ శాస్త్రి చెయ్యెత్తాడు.

అరుపులూ, కేకలూ పెట్టడం ఆ బికారివాడికిష్టంలేదు-కాబోలు....త్వరగానే తమ కథ చెప్పాడు.

ఆ బికారి బికారికాదు. అదో వేషం. అతడు, ఆమె కూడా పరమ బికారి వేషంలో ఈ ఇల్లు చేరుకున్నారు. వారి దగ్గర జోలెలనిండా, చక్కని ఫోల్డింగ్ పరుపుతో పాటు ఎన్నో ఆధునిక శృంగార ఉపకరణ సాధనాలున్నాయి. వాటి సాయంతో ఇద్దరూ ఘుమఘుమ

లా డేలా తయారై ఓ గంటగడిపి వెళ్ళిపోతారుట. ఇద్దరూ ప్రేమికులు. అమ్మాయి మధ్యతరగతి కుటుంబీకురాలు. డబ్బు అవసరంలో వుంది. మగాడు ఊళ్ళో టాప్ లెవెల్ పెద్దమనిషి. వీళ్ళింటికి డబ్బు సాయంచేసి ఈ పిల్లను ఎవ్వరికీ తెలీకుండా రహస్యంగా అనుభవించడం వాడి ఉద్దేశ్యం.

"అది నేనేం చెబితే అది చేస్తుంది. దాని తల్లి చావు బతుకుల్లో వుంది. వైద్యం పేరు చెప్పి నెలకు అయిదు వేలుదాకా ఖర్చవుతుంది. రోజులెక్కన రేటు కట్టినా నేనిచ్చేది ఎక్కువే! కానీ నేను వితరణ గలవాణ్ని. జాలిగుండె కలవాణ్ని. కాబట్టి అటు పుణ్యం, ఇటు పురుషార్థం చూసుకుని దీన్నిక్కడకు తీసుకొచ్చాను. ఒక్కరోజుకూ—కావాలంటే నా తర్వాత మీరు కూడా దాన్ని వాడుకోండి. కానీ నా రహస్యం దాచండి—" అన్నాడు బికారిలా కనబడే మగాడు.

"నువ్వలా కూర్చో—మమ్మల్ని ముందా అమ్మాయితో మాట్లాడనీ—" అన్నాడు శర్మ. శాస్త్రి అక్కడ పడివున్న మురికి గుడ్డల్ని మూటగా విసిరాడు. ఆ యువతి గబగబా బట్టలు వేసుకుంది. అప్పుడు శాస్త్రి ఆమెను సమీపించి — "నీకేం భయంలేదు. వాడంటే నీకు ఇష్టమేనా?" అన్నాడు.

"ఇష్టంలేదు. కానీ తప్పదు...." అన్నదా యువతి.

"మీ అమ్మకు వైద్యం జరుగుతుంది. నీకే ప్రమాదమూ వుండదు. ఆ బాధ్యత నాది. ఇంకా వాడంటే నీకిష్టమేనా?"

ఆ యువతి స్వరం తగ్గించి—"వాడి పేరు భూషణరావు. వాణ్ని కాదని ఈ ఊళ్ళో ఎవ్వరూ బ్రతకలేరు.

ఊళ్ళో పెద్దమనిషి. అందుకే నాలాంటి కన్నెపిల్లల్ని ఇలాంటిచోట్లకు తీసుకువస్తాడు. నా అదృష్టం కొద్దీ ఈ రోజే మీరొచ్చారు. ఈ రోజే మొదటిసారిగా వీడు నన్ను తీసుకుని వచ్చాడు—" అంది.

శాస్త్రికి ఆ మాటలు అంత నమ్మదగ్గవిగా తోచలేదు. అవకాశం రాగానే ఏ ఆడదైనా తను కన్నెపిల్లనని నమ్మించాలని చూస్తుంది. అయినా అంతకుమించి ఆమె మాత్రం ఏం చేయగలదు? అబల, అసహాయురాలు.... ఆడది! శాస్త్రి ఆమెని వదిలి భూషణరావు దగ్గరకువచ్చి "మిస్టర్ భూషణరావు నీ రహస్యం మాకు తెలిసి పోయింది—ఇకమీదట నువ్వీ పిల్ల జోలికి వెళ్ళకూడదు. వెళ్ళావో నీ బ్రతుకు బైటపెడతాం—" అంటూ శర్మ వైపు చూసి—"ఊఁ" అన్నాడు. వెంటనే శర్మ తన దగ్గరున్న మినీ కెమెరాతో భూషరావు మారువేషం ఫోటోలు విడివిడిగానూ, ఆ యువతితో కలిపీ కూడా తీశాడు.

"ఈ ఫోటోలు వాడే అగత్యం మాకు కలిగించకు—" అంటూ శాస్త్రి భూషణరావుని హెచ్చరించాడు. వాళ్ళిద్దరూ వెళ్ళిపోయాక శాస్త్రి, శర్మ అక్కడే మకాం చేయాలనుకున్నారు. భోజన పదార్థాలు కూడా తెచ్చు కున్నారు. తినేసి కటిక నేలమీద నిద్రపోయారు. చాలా రోజులుగా అలిసిపోయి వున్నారేమో—ఇద్దరికీ వళ్ళు తెలియని నిద్రపట్టింది.

చీకటిపడిన కొంతసేపటికి ఆ యింటిముందు ఓ వృషభ కాయుడు ఆగాడు. అతడు చూడ్డానికి కాస్త భయంకరంగానూ, చాలా బలంగానూ వున్నాడు. ఆ ఇంటిముందు ఆగి చుట్టూ చూశాడతను. తటపటాయిస్తూ గుమ్మందాకా

వెళ్ళి తలుపు తోశాడు. నేలమీద పడుకునివున్న రెండు ఆకారాలు అతడికి కనిపించాయి. దృఢకాయుడు ఆ ఆకారాల్ని సమీపించి ఓ ఆకారంమీద చేయివేసి— “ఏయ్—ఏయ్—లే!” అన్నాడు.

ఆ ఆకారం ఓ పట్టాన లేవలేదు. దృఢకాయుడు చాలాసేపు కుదిపాడు. అతికష్టంమీద ఆ ఆకారం కళ్ళు విప్పి—“ఎవర్నువ్వు?” అన్నాడు.

“నేను పోతురాజు మనిషిని. వడ్డీ కట్టడానికింక నెల రోజుల్లో ఒకరోజు అయిపోయింది—” అన్నాడా వ్యక్తి.

శాస్త్రి ఉలిక్కిపడి — “శర్మా — లే!” అన్నాడు అప్రయత్నంగా.

శర్మ కూడా లేచాడు. దృఢకాయుడు ఆశ్చర్యంగా- “వేషం చూస్తే ముస్లిమ్సులా వున్నారు. మీరు హిందువులా?” అన్నాడు. అప్పటికి శాస్త్రికి తను చేసిన పొరపాటు స్ఫురించింది—“మేము హిందువులం, ముస్లింలం—” అన్నాడతను గంభీరంగా.

“ఎవరతను?” అడిగాడు శర్మ.

“పోతురాజు వడ్డీ గురించి హెచ్చరించడానికి పంపాడు—” అన్నాడు శాస్త్రి.

“హెచ్చరికేకాదు. అన్న టైముకి డబ్బివ్వకపోతే వసూలు చేయాల్సింది కూడా నేనే!” అంటూ అతను చేతులు కదిపి కండలు పొంగించాడు.

“చాలా థాంక్స్—మీ మేలు మరువలేను—మనం మళ్ళీ రేపు కలుద్దాం—” అన్నాడు శర్మ. పోతురాజు మనిషి వెళ్ళిపోయాడు. మిత్రులిద్దరూ లేచి వళ్ళు మలుపుకుని—“ఇంకా ఈ వెధవింట్లో ఎందుకూ వుండడం.

ఇంక హోటలుకే పోయి వుండొచ్చు" అనుకుని అక్కణ్నించి కదిలారు.

# 7

నాలుగు రోజులుపాటు శాస్త్రి, శర్మ రకరకాల ప్రాంతాలు తిరిగారు. నాలుగు రోజులు కూడా రాత్రి అయ్యేసరికి పోతురాజు మనిషి శాస్త్రిని హెచ్చరించడం జరిగింది.

"మన్ని ఇంత తెలివిగా ఎలా నిఘావేస్తున్నారో తెలియడంలేదు—" అన్నాడు శాస్త్రి.

"పోతురాజు అక్కడ నిన్నేంచేశాడో పూర్తిగా మరోసారి చెప్పు!" అన్నాడు శర్మ.

"నా ఫోటో తీసుకున్నాడు, నా వేలిముద్రలు తీసుకున్నాడు...." అని ఆగి...."అన్నట్లు దేంతోనో నన్ను గుచ్చాడు కూడా—చురుక్కుమంది నాకప్పుడు. అప్పుడు నేను దాన్ని గురించి అంతగా పట్టించుకోలేదు—" అన్నాడు శాస్త్రి.

"ఇంకేం-అర్థమయింది. ఇది సామాన్యమైన గ్యాంగు కాదు. చాలా పెద్ద గ్యాంగు. నీకు బహుశా హానిచేయని రేడియేషన్ డోస్ ఇచ్చివుంటారు. దాంతో నువ్వెక్కడున్నదీ సులభంగా ట్రేస్ చేస్తున్నారు. నీ ఫోటోవుంది. నీ వేలిముద్ర। వుంది. నీ ఉనికి తెలుస్తుంది. ఇంకేం—నీకెంత అప్పయినా ఇవ్వగలరు వాళ్ళు—" అన్నాడు శర్మ.

"అయితే మనమిప్పుడేం చేయాలి? ఇంటాయన బాకీ వసూలవుతుంది, కానీ ప్రతీనెలా పదేసివేలు ఈ పోతురాజుకెక్కడ చదివించుకుంటాం!" అన్నాడు శాస్త్రి.

"అవును. ఇప్పుడేం చేయాలి? డబ్బు వెనక్కివ్వా

లన్నా కూడా మనం ఖర్చుపెట్టిందికాక ఇంకో పదివేలు జతపర్చి మరీ ఇవ్వాలి. లేనిపోని చిక్కు తెచ్చుకున్నాం" అన్నాడు శర్మ.

"మనకింకా నెలరోజులు టైముంది. ఈలోగా ఏదో ఉపాయం తోచకపోదు. డెవరక్కోసం ఏదైనా పని చేయాలి. ఓసారి మనం రక్షించిన యువతిని కలుసుకుని వద్దామా?" అన్నాడు శాస్త్రి.

ఇద్దరూ ఆ యువతి ఇంటికి వెళ్ళారు. వీళ్ళు వెళ్ళిన సమయానికి ఆమె ఇంట్లోనే వున్నది. వీరిని చూస్తూనే ఆమె ఆప్యాయంగా ఆహ్వానించింది—"రండి—రండి మీ దయవల్ల మాకు బాగానే వుంది—" అన్నది.

"అల్లా మిమ్మల్ని చల్లగా చూస్తాడు—" అన్నాడు శాస్త్రి.

"మీ రెవరో తెలుసుకోవాలనుంది. వివరాలు చెబుతారా?" అన్నదామె.

"చెప్పడానికేముంది? ఎక్కడ ఆపదవుంటే అక్కడ ప్రత్యక్షమవుతూంటాం — ఎలాంటి ప్రమాదమైనా ధైర్యంగా ఎదుర్కుంటాం. ఎప్పుడూ విజయాన్ని సాధిస్తూంటాం—" అన్నాడు శాస్త్రి.

ఆమె తన పేరు సంధ్య అని చెప్పింది. వాళ్ళిద్దరికీ కాఫీలు కలిపిచ్చి—"నాకు హాస్పిటల్‌కు వెళ్ళే టయిమైంది. మీరు అన్యథా భావించవద్దు—" అన్నది.

"నీకు భూషణరావునించి ఎటువంటి ఇబ్బందీ కలగదు. కలిగితే మేము రక్షిస్తాం. అది చెప్పడానికే వచ్చాం. పెర్మనెంటు ఏర్పాటు జరిగేదాకా నిన్ను అప్పుడప్పుడూ కలుసుకుని వెడుతుంటాం—" అన్నాడు శర్మ.

మిత్రులిద్దరూ బైటకువచ్చేసరికి వారిముందు కారొకటి

ఆగింది. అందులోంచి ఇద్దరు యువకులు దిగి-"మేమెవరం అని అడగొద్దు. మీ మిత్రుడొకడు మీకోసం ఈ కారు పంపించాడు—" అన్నారు. శాస్త్రి, శర్మ తటపటాయించకుండా కారెక్కేసి—"మీరెవరూ అని మేమూ అడగం - మా మిత్రుడి దగ్గరకు తీసుకువెళ్ళండి—" అన్నారు.

కారు శరవేగంతో దూసుకుపోయి ఊరి చివర ఒక బంగళాముందు ఆగింది. కారులోనివారంతా ఆ బంగళాలో ప్రవేశించారు. అది విశాలమైన బంగళా-పది పన్నెండు దాకా గదులుండవచ్చు. దారి గజిబిజిగావుంది. ఓ గది ముందు ఆగారు. యువకులిద్దరూ కాలింగ్ బెల్ నొక్కారు. వెంటనే గది తలుపులు తెరుచుకున్నాయి. వాళ్ళు చటుక్కున శాస్త్రి, శర్మలను లోనికి తోశారు. తలుపులు మూసుకున్నాయి.

ఒక్కక్షణం పట్టింది మిత్రులిద్దరికీ - పరిస్థితి అర్థం చేసుకోవడానికి. అప్పుడు వారు గదిలో చూశారు.

గది పెద్దదే! వారికి ఎదురుగా ఓ సింహాసనంలాంటి కుర్చీవుంది. దాంట్లో భూషణరావు కూర్చుని వున్నాడు. అతణ్ని చూసి ఇద్దరూ ఉలిక్కిపడ్డారు.

"ఆ రోజునించీ మీకోసం చూస్తున్నాను. సంధ్య ఇంటి దగ్గర నా మనుషుల్ని కాపలా పెట్టాను. దానింటికి ఏదో ఒకరోజున మీరొస్తారని నాకు తెలుసు. ఇన్నాళ్లూ తప్పించుకున్నారు. ఈ రోజుతో మీకు మూడింది-" అన్నాడు భూషణరావు.

"మేమిద్దరం కలిసి తిరగడంవల్ల ఎన్ని లాభాలు. అంతా మమ్మల్ని మీరు....మీరు....అని మన్నించేవాళ్ళే! ఆఖరికి మమ్మల్ని చంపాలనుకునే నువ్వుకూడా....అందుకు

నాకెంతో ఆనందంగా వున్నది-" అన్నాడు శాస్త్రి.

"చావంటే మాకు భయంలేదు. ఎటొచ్చీ మమ్మల్ని చంపడం అంత సులభంకాదనుకుంటాను-" అన్నాడు శర్మ.

భూషణరావు చప్పట్లు కొట్టాడు. సింహాసనం వెనుక నుంచి నాలుగు వేటకుక్కలు పైకి లేచాయి. నాలుగూ సింహాసనానికి చెరో పక్కకి చేరి చెండాడేలా వున్నాయి.

"సైన్సు ఎంతగానో అభివృద్ధి చెందిన ఈ రోజుల్లో కూడా నువ్వు ఇంకా పాత పద్ధతులు మానకపోవడం నాకెంతో విచారంగా వున్నది. ఇలా అయితే శత్రువులతో ఏం వేగగలవు? ఓ రెండు లక్షలు మాకిస్తే ఓ నెల్లాళ్ళపాటు నీకు మంచి శిక్షణ ఇవ్వగలం. మాతో వస్తావా?" అన్నాడు.

భూషణరావు మళ్ళీ చప్పట్లు కొట్టాడు. నాలుగు కుక్కలూ సింహాసనం ముందుకు వచ్చాయి.

"భూషణరావూ .... కుక్కలకు మామీదకు రావడానికి ధైర్యం చాలడంలేదు. అవి పూర్తిగా మా మీదకు రావాలంటే నువ్వు అప్పుడప్పుడు చప్పట్లు కొడితే లాభంలేదు. రోజంతా భజన చేయాలి. ఏదో ఓ పేరున భజనచేయడం. నీకూ మంచిదే! చూడ్డానికి పాపాత్ముడిలాగున్నావు. అయితే భజనచేసిన నీకంటే భజన నీచేత చేయించినందుకు మాకే ఎక్కువ పుణ్యం వస్తుంది. అది మాత్రం గుర్తుంచుకో-" అని శాస్త్రి ఇంకా ఏదో అనబోతూండగా భూషణరావు మళ్ళీ చప్పట్లుకొట్టాడు. కుక్కలు ఒక్కసారిగా గాలిలోకి లేచాయి. అవి అలా గాలిలోకి లేవగానే శర్మ "య్యా-" అంటూ గట్టిగా అరిచాడు. అతడి రెండుచేతులూ మెరుపు వేగంతో కదిలాయి.

గాలిలోకి లేచిన కుక్కలు అలాగే క్రిందపడిపోయాయి.

భూషణరావు తెల్లబోయి కుర్చీలోంచి లేచాడు. అప్పటికి శాస్త్రి, శర్మ అతణ్ని సమీపించారు.

"ఏం జరిగింది?" అన్నాడు భూషణరావు నీరసంగా.

"నువ్వెప్పుడైనా బ్రూస్‌లీ సినిమాలు చూశావా? చూసివుండవు. చూస్తే మామీదకు వేటకుక్కల్ని ఉసి గొల్పివుండవు. బ్రూస్‌లీ సినిమాలో చేసిన ప్రతి పనీ మేము నిజ జీవితంలో చేయగలం. ఆ సంగతి తెలియక నాలుగు వేటకుక్కల్ని నష్టపోయావు. విషం పూసిన సూదుల్ని గురితప్పకుండా విసరగలగడం మా ప్రత్యేకత" అన్నాడు శర్మ.

భూషణరావు వాళ్ళిద్దరి వంకా భయంగా చూసి- "మీరు మనుషులుకారు...." అన్నాడు.

"మేము మనుషులమే-కానీ నువ్వు రాక్షసుడివి...." అన్నాడు శాస్త్రి.

"నా వేటకుక్కలు...." అన్నాడు భూషణరావు ఏడుపు గొంతుతో. తన శత్రువుల్ని క్రూరంగా శిక్షించి వినోదించడం భూషణరావు సరదా. ఈ వేటకుక్కల్ని ఇంతవరకూ ఎవ్వరూ ఏమీ చేయలేకపోయారు. వీటికి భయపడే ఎందరో ఆయనకు అణిగిమణిగి వుంటున్నారు. చాలా ఏళ్ళుగా అవాయన సేవలు చేస్తున్నాయి.

"వాటిని చూస్తూంటే అవే నీకు బలమనిపించింది. సాధారణంగా జంతు హత్య మాకు కిట్టదు. కానీ ప్రజా క్షేమం కోరి వాటిని చంపాల్సివచ్చింది. ఏమీ అనుకోకు" అన్నాడు శాస్త్రి.

శర్మ ఆ గదిలో వేటకుక్కలతోసహా భూషణరావును ఫోటోలు తీశాడు. గదిలో అయిదారు రహస్య బీరువా

లున్నాయి. అన్నింటినీ ఫోటోలుతీశాడు.

"నువ్వు చాలా పెద్ద స్మగ్లింగ్ కింగువి. ఈ రోజు మేమిక్కడికి రావడంవల్ల మంచిపని జరిగింది. నువ్వు మాకు మరింత గుప్పెట్లోకి వచ్చావు. ఇదీ మంచిదే.... సంధ్యను కన్న కూతురిలా చూసుకోకపోయావో - నీ బ్రతుకు బైటపడుతుంది-" అన్నాడు శర్మ.

"ఇంతకీ మనం మంచి మిత్రులంకదా - చెట్టాపట్టాలు వేసుకొని వీధిలోకి పోదాం-" అన్నాడు శాస్త్రి.

ముగ్గురూ ఒకరి భుజాలమీద ఒకరు చేతులేసుకున్నాక "నీ పాలిట వేటకుక్కలం మేము. నీకూ నీ కుక్కలగతి పట్టకూడదంటే బుద్ధిగా మమ్మల్ని వీధిలో దిగబెట్టు-" అన్నాడు శర్మ.

భూషణరావు, శాస్త్రి, శర్మ చెట్టాపట్టాలు వేసుకుని వీధిలోకి వెడుతూంటే హాల్లో వున్న యిద్దరు యువకులూ వారివంక ఆశ్చర్యంగా చూశారు.

# 8

"యాభయివేల రూపాయలు బాకీకింద, అయిదువేలు బాకీ వసూలుక్రింద వుంచుకున్నాం. ఇవిగో మీ నలభయి అయిదువేలూనూ. ఈ డబ్బు మేము పోతురాజు దగ్గర నుంచే తెచ్చాం. కానీ మీ పేరు చెప్పలేదు. అతడినుంచి మీకే ప్రమాదంలేదు-" అన్నాడు శాస్త్రి.

నరసరాజు ఆశ్చర్యంగా డబ్బు లెక్కపెట్టి- "నిజంగా అన్నంతపనీ చేశారు. మీ ఋణం ఎలా తీర్చుకోను?" అన్నాడు.

"మీకూ పోతురాజుకూ మధ్యనున్న కథేమిటో చెప్పాలి-" అన్నాడు శాస్త్రి-"అది మా చెవిని వేశారంటే రహస్యం భద్రంగా వుంటుంది...."

నరసరాజు నిట్టూర్చి-"యాభయి వేల రూపాయల్ని నాకు వసూలు చేసి పెట్టిన మీ రేదడిగినా చెప్పాలి. నేను ఒకప్పుడు అందరిలాగే బ్రతికేవాణ్ని. కానీ ఒకరోజున పోతురాజు మాయలోపడి ఓ పిల్లదానితో కక్కుర్తి పడ్డాను. వాడది ఫోటోతీసి నన్ను బ్లాక్ మెయిల్ చేసి నా దగ్గర్నుంచి అప్పుడూ అప్పుడూ చొప్పున అయి దేళ్ళలో యాభయి వేలు గుంజాడు. నేను వాడికి దణ్ణం పెట్టేశాను-ఇంక నా దగ్గర డబ్బులేదని. అప్పుడు వాడు నా ఆస్తిపాస్తులూ అవీ లెక్కవేసి - ఆఖరికో సలహా యిచ్చాడు. వాడి సలహా ప్రకారం మా యింట్లో ఓ గదిలో - ఇదివరలో మిమ్మల్ని బంధించిన కుర్చీలూ, రహస్యపు తలుపులూ ఏర్పాటు జరిగింది. పోతురాజు తన శత్రువుల్నిక్కడికి పంపుతూంటాడు. వాళ్ళను నేను తెలివిగా ఆ గదిలోకి లాక్కుపోయి శిక్షించాలి. అదీ ఏర్పాటు. అయితే అగ్రిమెంటు అంతటితో అయిపోలేదు. పోతురాజు తన దగ్గరున్న కొన్ని బ్లాక్ మెయిలింగు కేసులు నాకు అప్పగించాడు. నా డ్యూటీ ఏమిటంటే డబ్బు వసూలు చేసి పోతురాజుకివ్వడం. అంటే నేనతడి ఏజంటునన్నమాట. అయితే నేను కమిషన్ లేని ఏజంటుని. చాలా కాలంగా నాకు నచ్చనిపని చేస్తున్నాను. అప్పారావుని బ్లాక్ మెయిల్ చేసి యాభయి వేలు వసూలు చేసి పోతురాజుకిచ్చాను...."

"అప్పారావేం పాపం చేశాడు?"

"ఈ ప్రపంచంలో పట్టుబడనివాళ్ళే తప్ప పాపాలు చెయ్యనివాళ్ళు లేరు. అప్పారావు ఆస్తికోసం వీలునామా ఫోర్జరీ చేశాడు. అది పో తు రా జు కనిపెట్టాడు...." అన్నాడు నరసరాజు.

"పోతురాజు పద్ధతి నాకు నచ్చింది. పాపాత్ములని అతడు ఈ లోకంలోనే శిక్షిస్తాడు. ఆ విధంగా పాపులకు నరకంలో కొంత శిక్ష తగ్గుతుంది. సరే మీరు కమిషన్ లేని ఏజంటుగా అతడికి పని చేస్తూ వుండండి. మరి మేము సెలవు తీసుకుంటాం" అంటూ శాస్త్రి అక్కణ్నించి బైటకు దారితీశాడు.

బైటకు వచ్చేక శర్మ-"పాపం ఆ నరసరాజుని చూస్తే జాలేస్తోంది. ఆయనకు సాయపడదామా-" అన్నాడు.

శాస్త్రి శర్మవైపు చిరాగ్గా చూసి-"నీకు గుర్తుందా? మనల్ని కుర్చీల్లో కూర్చోబెట్టి హింసించినరోజున నరసరాజు ముఖం ఎలావుంది? అపురూపమైన దృశ్యం చూస్తున్న వాడిలాగుంది? మనం కళ్ళు తిరిగి మెడలు వాల్చేస్తే ఆయన ఎంతో ఆనందంగా నవ్వాడు. అదే మనిషి తన మనుమణ్ని మనం బంధించామనేసరికి ప్రపంచంలోని దీనత్వమంతా సంతరించుకున్నాడు. ఎదుటివాడి కష్టాలకు ఆనందించి, తన కష్టాలు భరించలేనివాళ్ళు మహా క్రూరులు. ఆ నరసరాజుకు పోతురాజు తగిన శిక్షే ఇస్తున్నాడు. నాకు చాలా సంతోషంగావుంది. దేవుడు ఈ ప్రపంచంలో అన్నీ బ్యాలన్సు చేస్తాడు. మనం యాభయి వేలివ్వడమే నరసరాజుకో పెద్ద ఉపకారం..." అన్నాడు.

తర్వాత ఇద్దరూ అప్పారావు ఇంటికి వెళ్ళి ఇరవై వేలూ ఇచ్చేసి-"మిగతాది మా బాకీకింద, వసూలుకింద జమ కట్టుకుంటున్నాం. మీకు అంగీకారమే కదా!" అన్నారు.

"గోడకు వేసిన వెల్ల తిరిగొస్తుందని నే నెప్పుడూ

అనుకోలేదు. మీరు మహానుభావులు. మీ చేతులమీదుగా నాకు లభించిన ఈ డబ్బు మహాప్రసాదం—...."

అన్నాడు అప్పారావు.

ఇద్దరూ రూం చేరుకుని కాసేపు నిద్రపోయారు. నిద్ర లేచాక కాసేపు జరిగిన కథంతా ఒకరికొకరు చెప్పు కున్నారు. అప్పుడు శర్మ - "అన్నట్లు నీకాకలి వేయడం లేదూ-" అన్నాడు.

"అవును. రూంలోనే భోజనం తెప్పించుకుందాం-" అన్నాడు శాస్త్రి.

మంచం పక్కనేవున్న సర్వీసింగ్ మీట నొక్కాడు శాస్త్రి. తక్షణం కాలింగ్ బెల్ మ్రోగింది.

"ఈ హోటల్లో సర్వీస్ చాలా బాగుంది. ఎప్పు డొచ్చినా ఇక్కడే దిగాలి!" అన్నాడు శర్మ. అతనే లేచివెళ్ళి తలుపుతీసి వులిక్కిపడ్డాడు.

ఎదురుగా పోతురాజు మనిషి వున్నాడు. అతను లోపలకి వచ్చి - "వడ్డీ కట్టడానికి మీకు ఇంక ఇరవై నాలుగు రోజులు మాత్రం వున్నది—" అన్నాడు శాస్త్రితో.

"నాయనా-నన్నిలా హెచ్చరించడానికి నీకు రోజుకు ఎంత ముడుతుంది?" అన్నాడు శాస్త్రి.

"టైము ఎనిమిదయింది—" అని ఆ మనిషి వెళ్ళి పోయాడు. ఆ తర్వాతనే గదిలోకి బేరర్ వచ్చాడు. మిత్రులిద్దరూ రెండు భోజనాలు ఆర్డరిచ్చారు. బేరర్ వెళ్ళిపోయాడు.

"పోతురాజు విషయం మనం సీరియస్‌గా తీసు కోవాలి-" అన్నాడు శర్మ.

"అవును. ఈ విషయమై మన మోసారి భూషణరావును కలుసుకోవాలి—" అన్నాడు శాస్త్రి సాలోచనగా.

# 9

"మనం మంచి మిత్రులం-" అన్నాడు శర్మ.

"అవును...." అన్నాడు భూషణరావు నీళ్ళు నములుతూ.

"మానుంచి మీకు ఎటువంటి అపకారమూ జరుగదు. ఎటొచ్చీ మీరు మాకిచ్చిన మాటకు కట్టుబడి వుండాలి. ఆ తర్వాత చిన్న సాయం చేయాలి-" అన్నాడు శాస్త్రి.

"సాయమా? నేను మీకు సాయమా?" అన్నాడు భూషణరావు.

"అవును. ఈ ఊళ్ళో ఓ స్నేహితుడికి ప్రతి నెలా పదివేలిస్తామని మాటిచ్చాం. మాటిచ్చామంటే ఉత్తినే ఇవ్వలేదు-మీ ధైర్యం చూసుకునే ఇచ్చాం-.." అన్నాడు శాస్త్రి.

"పదివేలా — ఇటీజ్ టూ మచ్ —" అన్నాడు భూషణరావు.

"అలాగనే మేమూ అనుకున్నాం. కానీ మా స్నేహితుడు పోతురాజు వినడంలేదు. ఇందుకో ఉపాయం కూడా వుంది. నిజానికి అతడివద్ద మేము లక్షరూపాయలు మాత్రమే తీసుకున్నాం. అతడు నెలకు పదివేలు వడ్డీ అన్నాడు. అవసరానికి లక్ష ఇచ్చిన వాడామాత్రం వడ్డీ అడగడం తప్పులేదుకదా అని ఒప్పుకున్నాం. ఏ నెలనుంచి పదివేలు ఇవ్వక్కర్లేదనుకుంటే ఆ నెలకు లక్షా పదివేలూ ఇచ్చేస్తే ఆ బాకీ శాశ్వతంగా చెల్లుబడి అయిపోతుంది....మీ యిష్టం....మీరెలా చేసినా సరే."

"పోతురాజు మీకు డబ్బిచ్చాడా? అతను డబ్బిస్తాడని ఎంతోమందికి తెలియదే?" అన్నాడు భూషణరావు ఆత్రుతగా. శాస్త్రి, శర్మ మరింత అసాధ్యులని ఆయనకు అనుమానం కలిగింది.

"పోతురాజు సంగతి మీకూ తెలుసా?" అన్నాడు శాస్త్రి.

"నాకు తెలియడమేమిటి? అతను నా మనిషే - తన దగ్గరకు వచ్చి అడిగిన ప్రతివారికీ ఎంత కావాలంటే అంత అప్పిస్తాడు పోతురాజు. వడ్డీ పదిశాతం. ఎటొచ్చీ ఏడాదికికాదు నెలకు. లాభాల్లో ఒక శాతం మాత్రమే అతనిది. అయినా ప్రతి నెలా వేలకువేలు సంపాదించుకుంటాడు. కానీ పోతురాజు గురించి సమాచారం అందరికీ తెలియదు. మీరు నిజంగా అసాధ్యులు...." అన్నాడు భూషణరావు.

"అడ్డమైనవాళ్ళకి అప్పులిస్తే బాకీ వసూలు ఎలాగౌతుంది?-" అన్నాడు శర్మ.

"వసూలుకు పోతురాజు దగ్గర ఎన్నో పద్ధతులున్నాయి-" అన్నాడు భూషణరావు.

"అతడివద్ద పద్ధతులుండొచ్చు. కానీ పుచ్చుకున్నవాడు పాపర్ అయితే—....?" అన్నాడు శర్మ.

"సైన్సు బాగా అభివృద్ధి చెందింది. గ్రేవ్ గుండె కాయను ఏ ట్రాన్స్‌ప్లాంటేషన్ ఆపరేషన్ కైనా సరఫరా చేయగలిగితే ఆదాయం లక్షల్లో వుంటుంది. మనిషి శరీరంలో కళ్ళు, ముక్కు, చెవులు, ఎముకలు, ఊపిరితిత్తులు, కాలేయం....ఒకటేమిటి? అన్ని భాగాలకూ డిమాండ్ పెరిగివున్న ఈ రోజుల్లో—మానవ శరీరంతో లక్షలు

సంపాదించడం పెద్ద కష్టంకాదు. బాకీ వసూలు మాకో సమస్యకాదు....” అని—“నా రహస్యాలు శాస్త్రి ఎక్కువగానే మీముందు బయట పెడుతున్నాను. కారణం తెలుసా?” అన్నాడు.

“మమ్మల్ని మళ్ళీ చంపాలని పథకం వేశావా?” అన్నాడు శాస్త్రి.

“అబ్బే — అలాంటిదేమీ లేదు. మిమ్మల్ని నాతో కలుపుకుందామని. మీరు నాతో చేతులు కలపకూడదా- సరదాగా — ఈ ప్రపంచాన్నే ఓ ఆట ఆడిద్దాం!” అన్నాడు భూషణరావు.

“మేము ఎవరితోనూ చేతులు కలపం. మేము చేతులు కలిపితే గట్టిగా చప్పుడవుతుంది. దొంగలు చప్పుడు చెయ్యకూడదు. నిశ్శబ్దంగా వుండాలి. కాబట్టి దొంగలు మాతో చేతులు కలపాలని అనకూడదు. కాబట్టి ఆ విషయమలా వదిలిపెట్టి—ముందు పోతురాజు సంగతి తేల్చు—” అన్నాడు శాస్త్రి.

భూషణరావు పోతురాజును రప్పించి బాకీ చెల్లుబడి చేయించేశాడు.

“పాపం మీకు లక్షరూపాయలు నష్టం—” అన్నాడు శర్మ జాలిగా.

“ఏమీ నష్టంలేదు. లక్షల విలువచేసే మీ పరిచయం లభించింది. ఏదో ఓ రోజున మనం చేతులు కలపకపోము. మీవల్ల నాకు ఇంతకింతా లాభం రాకపోదు —” అన్నాడు భూషణరావు.

# 10

ఇంటాయన మళ్ళీ మళ్ళీ లెక్కపెడుతూ—“లెక్క బాగా సరిపోయింది. అంతా సరిగ్గావుంది....” అని పది

సార్లు అన్నాడు.

శాస్త్రి, శర్మ ఆయన దగ్గర సెలవు తీసుకున్నారు.

ఇంటాయన—"ఈ కుర్రాళ్ళు అఖండుల్లాగున్నారు. పాతిక వేలంటే పాతిక వేలు బాకీ ఇట్టే వసూలు చేసుకొచ్చారు...." అన్నాడు భార్యతో.

"అవునూ — అందులో అయిదు వేలు వాళ్ళకెందుకిచ్చారు? అసలే వాళ్ళు మనకు అద్దెకూడా సరిగ్గా ఇవ్వడంలేదు. మీరు వాళ్ళకు ఎదురిస్తే ఇంకా లోకువగా ఉండదూ—అయినా డబ్బంత చేదుగా వుందా మీకు?" అంది ఇంటాయన భార్య.

"బాగుందే — ఈ కుర్రాళ్ళు దుడుకు మనుషులు. ఇంటద్దె ఇవ్వరు. వీళ్ళనెలా వదుల్చుకుందామా అని చూస్తున్నాను. విశాఖపట్నంలో అప్పారావని ఒకడున్నాడనీ — వాడు పట్టపగలు నడిబజార్లో హత్యలు చేయగలడనీ ఎవరో అంటే వాడు నాకు బాకీవున్నాడని అబద్ధం చెప్పి—లేని బాకీ వసూలుకు వీళ్ళని పంపించాను. వాడి చేతిలో వీళ్ళు ఏదో అయిపోతారనే అనుకున్నాను. కానీ వీళ్ళు నా బాకీ వసూలు చేసుకుని వచ్చారు. ఎలా వసూలు చేశారో, ఏమిటో?... ఇరవై వేల రూపాయలు... ఎన్నేళ్ళుంటే మాత్రం అద్దెకింద ఇది తీర్తుందో నువ్వే చెప్పు...." అన్నాడు ఇంటాయన.

ఇంటాయన భార్య వెర్రి ముఖంవేసుకుని—"ఇరవై వేలు....వుత్తినే వచ్చాయా?" అంది.

హుషారుగా రోడ్డుమీదకు వెళ్ళిన శాస్త్రి, శర్మ ఏదో సందేహం వచ్చి మళ్ళీ వెనక్కు వెళ్ళాలనుకుని మానేశారు. అదే మంచిదయింది. లేకుంటే ఈ సంభాష

ణంతా వాళ్ళు విని - అసలు అప్పారావు, నరసరాజుల బాకీల విషయాలు కూడా ఎంతవరకూ నిజం - అని మథనపడిపోయేవారు.

ఈ సంగతి భూషణరావుకు తెలిస్తే! వున్న బాకీలు వసూలు చేసే పోతురాజునే ఆయన ఆకాశానికెత్తేస్తున్నాడు. లేని బాకీలు వసూలు చేసే వీళ్ళ సంగతి తెలిస్తే ఆయన ఏమంటాడో?

—: అయిపోయింది :—

# సానికొంపలో స్మశానం!

ఇమంది రామారావు

సుశీల అద్దం ముందు నుంచింది.

తన రూపం వెక్కిరిస్తూ నవ్వుతుంది. మొహంమీద చిందరవందరగా తన బ్రతుకులాగా చెదిరిపోయింది జుత్తు. ప్రయత్నంమీద కళ్ళు తెరవాలనుకుంది. కాని కళ్ళు మండుతున్నై. బరువుగా మూతలు పడుతున్నై. రాత్రి తెల్లవార్లూ నిద్రలేదు. ఎవరో కాలేజీ స్టూడెంట్సట బుక్ చేసుకున్నారు. ఒక్క క్షణం ఊపిరిపీల్చుకోనివ్వలేదు.

"సుశీ!"

"ఏమ్మా....!" అంటూ తిరిగిచూసింది. ఎదురుగా సత్యవతి కిళ్ళీ నములుతూ పెదవుల్ని నాలుకతో తడుపుకొంటూ నవ్వుతూంది. సాశీల దగ్గరికి నడిచింది. సుశీల గుండె వేగంగా కొట్టుకుంటుంది. టైమ్ చూసింది. గుండాగినంత పనయింది. అయిదు గంటలయింది. మళ్ళీ డ్యూటీకి ఎటెండ్ అవ్వవలసిన సమయం దగ్గరపడింది. ఈ రోజు ఎలాంటి కాంట్రాక్టు ఒప్పుకుందో సత్యవతి.

"టిఫిను చేశావామ్మా!" అంది సత్యవతి ప్రక్కనున్న స్టూలుని లాక్కొంటూ కూర్చుంటూ.

"లేదమ్మా.... చేయాలనిపించలేదు!" అంటూ సిగముడి వేసుకుంది.

"అదేమిటి సుశీ! ఎంచక్కా జారుజడ వేసుకుని క్లిప్పులు పెట్టుకుంటే ఎంత బావుంటావు!" అంటూ మెటికలు విరిచింది.

సుశీల నవ్వింది. ఆ నవ్వులో జీవంలేదు. నిర్లిప్తంగా వుంది. విరాగిని విడిచే నిట్టూర్పులాగా వుంది.

రంగమ్మ టిఫిను తీసుకొచ్చింది. ప్లేటునిండా బ్రెడ్ రోస్టు డబుల్ ఆమ్లెట్, చికెన్ పులుసు, ఎగ్ పుడింగ్ వుంది—అమ్మవారికి మొక్కినపుడు కోడిముందు పల్లెటూర్లలో యిప్పటికీ నాలుగు పిండివంటల్తో కుంభంపెట్టి తినిపిస్తారు. తినకపోతే బలవంతంగా గొంతులో కుక్కుతారు. మరుసటి క్షణంలో ఒకే వ్రేటున గొంతు తెగకోస్తారు. యింకా అది నయమనిపించింది సుశీలకి. ఒకేసారి ప్రాణం పోతుంది. ఎందుకీ కులట బ్రతుకు? ఎంతకాలం ఛస్తూ బ్రతకాలి? మెదడు వేడెక్కిపోయింది. నరాలు చిట్లిపోతాయేమో భయంగా వుంది.

"తినమ్మా!" అంటూ సుతారంగా తల నిమిరింది సత్యవతి.

"అమ్మా! ఈ రోజు నాకు వంట్లో ఏం బాగోలేదమ్మా. పొత్తి కడుపు నెప్పిగావుంది. యిపుడు నేనేంచేయలేను!" అంది టిఫినుతోబాటు రాత్రి కూడా వదిలిపెట్టమన్న కోరిక వ్యక్తపరుస్తూ—

"డాక్టరుని పిలవమంటూవా?" అంది సత్యవతి.

"వొద్దమ్మా.... ఈ రోజు నన్ను విడిచి పెట్టెయ్....

కంటినిండా నిద్ర కరువయ్యింది. గత వారం రోజులుగా ఒంట్లో అస్సలేం బాగోలేదు. ఈ ఒక్క రోజు వదిలెయ్!" అంటూండగా సత్యవతి మొహంలో మారే రంగుల్ని చూసి ఆగిపోయింది.

"సుశీ! గోపాల్రావుగారు వస్తున్నారు! అటు పైన నీ యిష్టం. క్రిందటిసారి వచ్చినపుడు కుదరదని పంపించాము. యిపుడు ఆయనతో మనకి పనివుంది. ప్రాణంతో సమానమైన కార్యం ఆయన చేతులమీదుగా జరగాల్సివుంది. నిన్ను తప్ప యింకెవర్నీ అడగడు—ఆయన పైత్యం ఆయంది. నీ పైత్యం నీది. మీమీద వేలవేలు తగలబెట్టి చేతులు కాల్చుకొని నాశనమయిపోయాను మధ్యలో నేను" స్టూలు ఒక మూలకు వెళ్ళేలా కాలితో తన్నింది.

అదే మనిషికి తగిలితే అవుట్-సుశీల వచ్చే కోతలో తన దగ్గరవున్న అమ్మాయిలు తన మాట వినకపోతే యిలాగే తన్నేది. ఒకసారి సుశీలని కూడా తన్నింది. పొట్ట చిట్లిపోయిందేమో అనిపించింది. ప్రేవులు మెలికలు పడ్డాయి. సుశీల లేచి నిలబడింది. అలా కాలితో తన్నించుకొనే బదులు ఎవరో ఒకరి చేతుల్లో నలిగి చావడం మంచిదనుకొంది. వేడి నిట్టూర్పు విడిచింది.

## 2

"ఏం చెప్పమంటారు గోపాల్రావుగారూ! వంటినంటి పెట్టుకొని వున్న వంద తులాల బంగారం అమ్మేసి ఈ అమ్మాయిల వ్యాపారంలో దిగేను. నిండా మునిగి పోయాను. మీకు అమావస్యకి పున్నమికి తప్ప మా యిల్లు గుర్తురాదు. ఏం చెప్పమంటారు నా నరకయాతన గురించి. పోనీ యింట్లో అమ్మాయిలుంటారా.... ఒక్క పిల్ల ఆరోగ్యంగా లేదు. అందరికీ నాకంటే నీరసం

ముంచుకొచ్చింది. ఏ ముండయినా నా యింటికొచ్చినపుడు చెంగుచెంగుమంటూ ఎగురుకొస్తారు. ఈ మట్టి పారం ఏవిటో మరి. నెలరోజులు తిరక్కుండా చలాకీ, గిలాకీ అంతా పోయి ముసలిపీనుగులయిపోతారు!" తిట్టుకుంది సత్యవతి.

గోపాల్రావు త్రిబుల్ - ఫైవ్ సిగరెట్ తీసి వెలిగించాడు. గుప్పు గుప్పుమంటూ పొగలు కక్కుతూ నవ్వుతున్న కళ్ళతో అలాగే చూస్తున్నాడు.

"ఏవిటి గోపాల్రావుగారూ మాట్లాడరు. మీ ద్వారా నాకో చిన్న సహాయం కావాలి! మీరు చేయకపోతే మరునటి రోజుకి నా శవాన్నే చూస్తారు మీరు. ఆ.... మాయదారి గోల! నేను ఛస్తే ఏడ్చే దిక్కెవరంట. ఊరికి రోగం కుదిరిందని సంబరం చేసుకుంటూరు. దిక్కుమాల్నిదాన్ని. ఎందుకు బతుకుతున్నానో నాకే తెలీదు. అసలు చావంటే నాకు భయమేడిసింది. లేకపోతే ఈసరికి బాదంకాయలు నూరుకొని తాగి చచ్చేదాన్ని!" కళ్ళు అద్దుకుంది.

మరో సిగరెట్ వెలిగించాడు.

"గోపాల్రావుగారూ! అదిగో ఎదురుగా కనిపిస్తున్న నా పరువుమీద ప్రమాణంచేసి చెప్తున్నాను. మీరు నన్ను కాపాడాలి. మీరే నన్ను కాపాడగలరు!" బ్రతిమాలుతూ దగ్గరికి వచ్చింది.

సిగరెట్ సగం పారేశాడు. పొగ సత్యవతి మొహం మీద విడిచిపెట్టాడు.

సత్యవతి కళ్ళల్లోకి పొగపోయింది. కళ్ళు మంట పుడుతున్నా నవ్వుతూ "నిజంగా గోపాల్రావుగారూ యింతమందిని చూశానుగాని మీలా సిగరెట్స్ యింత

స్పీడు గా కాల్చేవారిని, యింద అందంగా పొగ వదిలే వారిని యింతవరకూ చూడలేదనుకోండి!" అంది.

"ఎంతమందిని చూశావ్!"

"అబ్బో ... వేలు... లక్షలు!"

"అంటే నీ సంపాదన కోట్లమీద వుండాలే!"

"పాయింటు పట్టేశారు గోపాల్రావుగారూ. మాట వరుసకి వందలు వేలు అంటాం నిజంగా జరుగుతుందా?" అంటూ చిలిపిగా తన తొందరపాటుకి నాలుక్కొరుచుకుంది.

"సుశీల ఎక్కడ?" మరో సిగరెట్ వెలిగింది.

"గదిలో వుంది!"

"ఏ గదిలో?"

"మేడమీద గదిలో బాబూ!"

"నేను వస్తున్నట్టు చెప్పావా!"

"లక్షసార్లు చెప్పేను!"

గోపాల్రావు ఆమె మొహంలోకి మరోసారి సూటిగా చూశాడు. "నీలాంటోళ్ళ ఇండియాలో 'సెట్టిసిక్స్' చెప్తుంది!" అన్నాడు లేస్తూ. సత్యవతి కూడా లేచింది. గోపాల్రావు పోలిస్టర్ లాల్చీ చేతుల్ని దగ్గరికి మడిచాడు. నీళ్ళు నములుతుంది సత్యవతి. మేడ మెట్లుకేసి దారి తీశాడు.

"గోపాల్రావుగారు నేను చెప్పింది వినకుండా...."

"ఉదయం చెప్పు! నీ రా మా య ణ ం" అన్నాడు కేర్ లెస్ గా.

"మరి రాత్రికి మీకు వంట చేయొద్దూ!" అంది.

జేబులోంచి రెండువందల రూపాయల నోట్లిచ్చాడు. కళ్ళ కద్దుకుంది. మరో నాలుగు మెట్లెక్కాడు.

"గోపాల్రావుగారూ! ఈ రోజు పదో తారీఖు. యింటద్దె క్రిందటి నెల పంపిస్తానన్నారు పంపించలేదు. ఈ నెల ఒకటి దాటి తొమ్మిది రోజులయింది. ఒక మూడువందలుంటే కనీసం అప్పుగానైనా సరే యిప్పించండి."

గోపాల్రావు ఒకసారి సత్యవతి మొహంలోకి చూశాడు. మరో మూడు వందరూపాయల నోట్లు తీసి యిచ్చాడు. మళ్ళా కళ్ళకద్దుకుంది. "ఈ ఊర్లో మీరు తప్ప మాకు దిక్కెవరు చెప్పండి. నీళ్ళముంచినా పాల ముంచినా మీదే భారం" అంటూ వంట గదిలోకి నడిచింది సత్యవతి అంగలేస్తూ.

# 3

రాత్రి మూడు గంటలయింది.

సిగరెట్స్ ఖాళీ అయ్యాయి.

సుశీల మగత నిద్రలోకి జారుకుంది. ఒంటిమీద నూలుపోగులేదు. గుండెలమీద తొడలమీద రక్తపు జీరలున్నై.

గోపాలం పందిరి మంచంకేసి చూస్తూ ఆలోచనల్లోకి జారుకున్నాడు.

'కెవ్వు'మంటూ కేక వినిపించడమూ, క్రింద ఏదో మోటర్ బైక్ స్టార్ట్వడమూ ఒకేసారి జరిగాయ్.

గోపాల్రావ్ తృళ్ళిపడి లేచాడు. క్రిందకి పరుగుతీశాడు.

సత్యవతి గుండె బాదుకొని ఏడుస్తోంది.

"ఏం సత్యవతీ ఏమయ్యిందీ!" గోపాల్రావు అడిగాడు.

"మన రాధమ్మ.... మన రాధమ్మ.... మన రాధమ్మ-" అంటూ మిగతా విషయం చెప్పలేకపోయింది.

సుశీలకు మెలకువ వచ్చింది. లంగా చుట్టుకొంటూ

క్రిందికి దిగింది.

"ఏం పిన్నీ....ఏమయ్యిందీ!" భుజాలు పట్టి కుదుపుతూ అడిగింది. లక్ష్మి కూజాలో మంచినీళ్ళు గ్లాసులోకి వొంపి తీసుకొచ్చి సత్యవతి మొహంమీద చల్లింది.

సత్యవతి తేరుకుంది. మళ్ళీ ఏడుపు మొదలుపెట్టింది.

"రాధమ్మని ఎవడో దొంగసచ్చినోడు చంపేశాడే తల్లీ!" అంటూ మంచినీళ్ళు గుటగుటా తాగింది.

రాధ శవాన్ని బయటికి మోసుకొచ్చారు గోపాల్రావు, లక్ష్మి తోడుపట్టుకొంటూ—

"గోపాల్రావుగారూ! మీతో ఒక ముఖ్యమైన విషయం చెప్తానన్నా నా....యిదే బాబూ! ఎవడో పనికి మాలిన సన్నాసి ఇన్స్పెక్టర్ సచ్చినోడు మా యింటికి వచ్చాడు. రాధని తనతో బయటికి పంపించమని అడిగాడు. అలా బయటికి పంపించడానికి కుదరదని చెప్పేను. పట్టుపట్టాడు. నేను వినిపించుకోలేదు. ఒకటి రెండుసార్లు వచ్చాడు. మన సుశీల దగ్గర లక్ష్మి దగ్గర, నా దగ్గర కూడా రెండు మూడుసార్లుండి వెళ్ళాడు.

యింతలో ఏం ముంచుకొచ్చిందో నా సంపాదనలో పాతిక భాగం వాడికి కావాలన్నాడు. నేను కుదరదని ఖచ్చితంగా చెప్పేశాను. పోనీ సుశీలని వుంచుకుంటా నన్నాడు. అదీ కుదరదన్నాను. పెద్ద పెద్దోరి హయాంలో వుంది. బయటోళ్ళకి తింగదన్నాను. చూడు—నిన్నేం చేస్తానో. నీ యింటిని స్మశానం చేస్తాను. నిన్ను నాశనం చేస్తానని బెదిరించాడు. అలాగే చేశాడు. నా కొంప స్మశానమయిపోయింది బాబో. యిదుగో యివ్వాళ్ళొక శవం, రేపొక శవం, ఎల్లుండొక శవం. ఈ యిల్లు స్మశానమే బాబోయ్!" అంటూ గొంతుచించుకొని ఏడు

స్తూంది.

"పిన్నీ ఊరుకో! బయట నలుగురికీ తెలిస్తే అరా తీస్తారు. పైగా ఆళ్ళు పోలీసులు. కేసుపెట్టి, మనమీదకి ఎక్కడలేని నేరాలు రుద్దుతారు. యిప్పుడు జరగవల సిందాని గురించి ఆలోచించడం మంచిది!" అంది సుశీల.

"సరే ఈ శవాన్ని ఎవరికీ కనపడనీయకుండా మా పొలంలో పాతిపెట్టండి. ఈ యింట్లో హత్య జరిగినట్లు ఎవరికీ తెలీదు. నేను మీకు యింతకంటే ఏం సహాయం చేయలేను!" అన్నాడు.

"సరే బాబూ! మా పరువు బజారుపాలుపోకుండా కడుపులో పెట్టుకో. కోర్టెక్కినోడు, గాడిదెక్కినోడు ఒకటంటారు. ఈ పరిస్థితిలో నేను కోర్టులు చుట్టూ తిరగలేను!" దణ్ణం పెట్టింది.

నిముషాలమీద గోపాలరావు పాలేర్లు వచ్చారు. తెల్లారేసరికి అంతా పూర్తయింది. ఎవరికీ ఏం తెలియనట్లు ఆరుగంటలయినా మంచాలమీదనుండి లేవకుండా నిద్ర పోతున్నారు.

# 4

"హలో" రిసీవర్ ఎత్తాడు అనదుగుల విగ్రహం.

"ఒన్ టౌను పోలీసు స్టేషనా!" అవతలి గొంతు.

"యస్ ప్లీజ్!"

"రాంప్రసాద్ గారున్నారా?"

"స్పీకింగ్!" అన్నాడు.

రాంప్రసాద్ మాట్లాడుతుంటే హెడ్ కనిస్టేబుల్ కోటిలింగం అలా మొహంలోకి చూస్తూ వుండిపోతాడు. రైటర్ విశ్వనాథం కూడా రెప్పవాల్చడు. ఒకరా యిద్దరా స్టేషనంతా కళ్ళుచేసుకొని రాంప్రసాద్ ప్రతి

చర్యనీ గమనిస్తుంది.

"నేను మీతో పర్సనల్ గా మాట్లాడాలి.... కలుసు కోవచ్చా!" ప్రశ్నించింది ఆవతలిగొంతు.

"ష్యూర్ .... ష్యూర్!"

"ఎక్కడ కలుసుకుందాం?"

"ఎక్కడయినా మీ యిష్టం!"

"మీకు రిస్ట్రిక్షన్స్ ఏం లేవుగా!"

"పోలీసు డిపార్ట్ మెంట్ లో నియమాలే వుంటె— ఒకరికి రక్షణ కల్పించడానికి ఏమైనా చేయొచ్చు!"

"మీరు నా దగ్గరికి వచ్చింది 'రక్షణ' కల్పించడానికి కాదు. పార్టీలో పార్టిసిపేట్ చేయడానికి....వస్తున్నారా?"

"నన్ను మీకు తెలుసా!"

"తెలుసు! మీరు రండి. నేను చెప్పిన విషయాలు వింటే మీరు ఎగిరి గంతేస్తారు. కౌగలించుకుంటారు. రాత్రంతా నా దగ్గరే వుంటారు. అసలు యిల్లు కదలరు. నిజం."

"సరే. యింకో అరగంటలో నా డ్యూటీ అయిపోతుంది. నేను బయలుదేరి వస్తున్నాను. ఎడ్రసు చెప్పండి" అంటూ పెన్సిలు కాగితంమీద సిద్ధంగా వుంచాడు.

"మీకు బొమ్మూర్తు తెల్సా!"

"తెలుసు!"

"గోపాలరావుగారి రెస్టు హౌస్ అంటే ఎవరయినా చెప్తారు!"

"ఓ.కే!" అంటూ ఫోను పెట్టేశాడు ఇన్స్పెక్టర్ రాంప్రసాద్.

మరో గంట తర్వాత మఫ్టీలో గోపాల్రావుగారి గెస్టు హౌస్‌కి బయలుదేరాడు.

"వెల్ మిస్టర్ రాంప్రసాద్! వెల్‌కమ్!" అంటూ సాదరంగా ఆహ్వానించాడు గోపాల్రావ్.

గెస్టు హౌస్ చాలా అందంగా వుంది. రాంప్రసాద్ రాజమండ్రిలో గత అయిదేళ్ళుగా వుంటున్నప్పటికి బొమ్మూరులో గెస్టుహౌస్‌ని చూసే అవకాశం ఒక్కసారి కూడా కలుగలేదు. ఎక్కడలేని శిల్ప సంపద, అక్కడే చోటుచేసుకుంది. రకరకాల మాడ్రన్ ఆయిలు పెయింటింగ్స్ వున్నై.

"ఏవిటి చుట్టూ పట్టిపట్టి చూస్తున్నారు. ఏం గుర్తుకు రావడంలేదా—" అన్నాడు గోపాల్రావు, కల్యాణి బీర్ ఓపెన్ చేస్తూ.

"ఊఁ చెప్పండి!" ముందుకు జరిగాడు.

"ప్చ్.... చెప్పవల్సిందేం లేదు—చేయవలసిందే! టేక్ దిస్" బీరుబాటిల్ అందించాడు.

"నో థాంక్స్!" ద్రాక్షరసం తీసుకున్నాడు.

"నేనూ మొదట్లో అంటే హయ్యర్ సెకండరీవరకూ చదూకొంటున్న రోజుల వరకూ తీసుకొనేవాడ్ని కాను. కాని భీముని పట్నంలో రాంప్రసాద్ అనే ఒక ఫ్రెండు గాడిద టెన్తు 'బి'లో తగిలాడు. కలిసింది ఒక సంవత్సరమే అయినా ఒకే ప్రాణంగా కలిసిపోయాం. ఒక రోజు అంటే అది మాకు స్కాలర్‌షిప్ వచ్చినరోజు. టెన్తు ఫస్టు క్లాసులో పేసయిన రోజు. చేతినిండా డబ్బులున్న రోజు. మనసు పట్టపగ్గాలేకుండా పరవశించి ఉరకలేస్తున్న రోజు. రెండు బీరు బాటిల్స్ కొన్నాం. నర్సింహస్వామి కొండెక్కిపోయాం చేరో బాటిలు తీసు

కున్నాం. ఒకరి పేరు మరొకరు స్మరిస్తూ అరనిముషంలో బాటిలు గడగడా లేదనిపించాం.

తర్వాత ఆ అడ్డగాడిద రాంగాడు నానుండి వేరయి పోయాడు.

వాళ్ళ నాన్నగార్కి ట్రాన్స్ఫర్ అయిందని తెలిసింది. వెళ్ళిన ఒకటి రెండు నెలలు వుత్తరాలు రాశాడు. తరువాత వాడి అంతు చిక్కలేదు. నాకు పెళ్ళయింది. ఆ వెధవకి పెళ్ళయిందో, లేదో?

ఒరేయ్, నన్నింకా గుర్తించలేదట్రా! నేను గోపిని! నీ గోపినిరా!" అంటూ గుండెకేసి హత్తుకున్నాడు. రాంప్రసాద్ కళ్ళనిండా గతం నిండిపోయింది. ఏదో అనూహ్యమయిన అనుభూతి.

"గోపీ!" అంటూ నుదురు ముద్దుపెట్టుకున్నాడు.

గోపాల్రావ్ డ్రస్సింగ్ టేబుల్ దగ్గరున్న ఒక బజర్ నొక్కాడు. ఒక సర్వెంట్ వచ్చాడు. యాష్ ట్రేలు రెండు, రెండు ట్రిబుల్ ఫయివ్ సిగరెట్ పేకెట్స్ తెచ్చాడు. క్షణంలో రెండు సిగరెట్స్ గుప్ మంటూ వెలిగాయి.

రెండో బజర్ నొక్కాడు.

అయిదు నిముషాలు ఏ విధమయినటువంటి రెస్పాన్స్ లేదు.

రాంప్రసాద్కిదంతా ఆశ్చర్యంగా కనిపించింది.

"నువ్వేం బిజినెస్ చేస్తున్నావ్రా!"

"అడిగేవ్రా. పోలీసులకు అభిమానాలకంటే అను మానమే ముందు పుడుతుందంటారు అందుకేరా. ఏనీవే నాకు చాలా మంచి బిజినెస్ వుంది. ముందు నువ్వు ఏ బిజినెస్ చేస్తున్నావో చెప్పు!" అనడిగాడు గోపి.

"నేను బిజినెస్ చేయడమేంట్రా! ఐయామ్ ఎ పోలీస్ ఆఫీసర్! నేనొక ఇన్స్పెక్టర్ని!"

"ఆ విషయం తెలుసులేవోయ్. ఈనాడు దోపిడీలు, దొంగతనాలు, దారికాపులూ, రేప్‌లూ ఇలాంటి అత్యాచారులు చేయాలంటే ఈ ప్రపంచం మొత్తానికి ఒక పోలీసు మెన్‌కి తప్ప మరొకరికి దమ్ములేవు. ప్రపంచంలో నడుపబడుతున్న వ్యభిచార కొంపలు అత్యధికంగా పోలీసు అధికార వర్గం యాజమాన్యంతో నడపబడుతున్న వే— తప్పులేదు.

సైడు బిజినెస్‌గా ఏదో వొకటి లేకపోతే వచ్చే వెయ్యి పదిహేనువందల్తో మెంటయిన్ అవ్వొద్దూ. అవున్రా. నీకెందరు పిల్లలు!" వర్షం వచ్చినట్లు మాట్లాడాడు.

గోపి సహజంగా ఎక్కువగా మాట్లాడే మనిషి కాడు. యింత చనువుగా మాట్లాడే మనిషి కాడు. ఎంత మారిపోయాడు.

"అరేయ్ గోపీ! నేను 'హేపీగా' వున్నాను. నాకీ వుద్యోగం ద్వారా వచ్చిన డబ్బుతో నా ఫేమిలీ పోషించుకోలేకపోతే, ఈ వుద్యోగాన్ని రిజైన్ చేసి మరో లాభసాటి వ్యాపారాన్ని చూసుకుంటాను. ఆ తెలివి తేటలు నాకున్నాయి. అయినా నాకు పదిమంది పిల్లలేరు. నేనూ, నా మదర్, నా మిస్సెస్, బాబు యింతే. నలుగురికీ యింటద్దెతో వెయ్యి రూపాయలు చాలు! నాకు ఇతర అలవాట్లు లేవు. ఒకవేళ అలాంటి అరికపరమైన సమస్యల్లోనే వున్నావు కదరా అప్తమిత్రుడివి. నిన్నే అడుగుతాను! సరేనా!" అన్నాడు ప్రామిస్ చేస్తూ.

గోపాల్రావ్ ముఖంలో రంగులు మారాయి.

"రాం...నువ్వు నా 'రాం' వేరా! పోలీసాఫీసరువై నా నువ్వు ఏమాత్రం మారలేదు. స్నేహం కోసం ప్రాణా లివ్వడానికైనా సిద్ధపడతావని మరోసారి రుజువుచేశావు. రాంప్రసాద్! స్నేహంకోసం చెబుతున్నాను. నువ్వు ఈ వూర్లో ఉండకు! ట్రాన్స్ఫర్ చేయించుకో! నీకు అవసర మనిపిస్తే హైద్రాబాద్ ట్రాన్స్ఫర్ అయ్యేలా చూస్తాను. నువ్వు మాత్రం ఎంత వేగిరం షిఫ్ట్ అయితే అంత మంచిది నీకూ, నాకూ!" అన్నాడు మరో ట్రిబుల్ ఫైవ్ వెలిగిస్తూ.

"ఎందుకని?"

"ఏమిటి? ఎందుకూ? అని ప్రశ్నించకు. నామీద నీకే మాత్రమైన ప్రేమవుంటే నేను చెప్పినట్లు చెయ్యి!" అన్నాడు గోపి సిగరెట్ రెండు దమ్ములులాగి యాష్ ట్రేలో విడిచిపెడుతూ.

"ఇట్సాల్ రైట్ - యింకేవిట్రా కబుర్లు!" అంటూ వీపుమీద ముద్దుగా చరిచాడు రాంప్రసాద్. అలా ఒక ర్నొకరు పసిపిల్లాల్లా కొట్టుకొని ఎన్నాళ్ళయిందో.

"నువ్వే చెప్పాలి. ఈ వారంలో ఎన్ని హత్యలు జరిగాయో!" గోపి మరో సిగరెట్ ముట్టించాడు. రాంప్రసాద్ కూడా కంపెనీ ఇచ్చాడు.

"గోపీ! నువ్వు ఘంఉడుగా రమ్మన్నావు. నువ్వెంత ఘండుడు అన్నది నీ దగ్గరకొచ్చాక, నీ కథంతా తెలుసు కున్నతర్వాత తెలిసింది. లెటజ్ డిస్పర్స్ హాపిలీ. వస్తాను!" అంటూ లేచాడు.

"నో....నో....రోమా వుంది. ఈ రోజే వచ్చింది పెద్దాపురంనుండి. భలే ఖుషీగా మాట్లాడుతుంది. నీ

గురించే తెప్పించాను. ఎంజాయ్...."

"నో....థాంక్స్!" అని బయటికి నడిచాడు రాంప్రసాద్.

గోపాల్రావుకు నోట మాట పెగల్లేదు.

## 5

మర్నాడు లక్ష్మి హత్య చేయబడింది ఆ ఇంట్లో-పెద్దగా ఏడ్చింది సత్యవతి.

సుశీలకి దుఃఖం ఆగింది కాదు.

"అమ్మా!" అంటూ సత్యవతి గుండెల్లో చోటు చేసుకుంది. ఉదయం ఏడు గంటలు. బయట జన సందోహం తిరుగుతున్నారు.

"అమ్మా సుశీలా! మన గోపాల్రావుగారికి ఫోను చెయ్యమ్మా.... ఆయనొస్తేగాని మనకి ఏ విషయమూ తెలీదు!" అంటూ తనే ఫోను దగ్గరికెళ్ళి స్వయంగా డయల్ చేసింది.

గోపాల్రావు లేడు. వారం రోజులు తరువాత వస్తాడని తేలింది.

"సూర్యం!" అంటూ గట్టిగా అరిచింది. పెరటి గుమ్మంలో గుర్రుపెట్టి నిద్రపోతున్న సూర్యం త్రుళ్ళిపడి లేచాడు. పరుగున వచ్చాడు.

"రాత్రి నువ్వు మెలకువగా వున్నావా?"

"వున్నానమ్మగోరూ!"

"ఎంతవరకూ?"

"తెల్లవార్లూ!"

"మనింట్లోకి ఎవరెవరు వచ్చారు?"

"అమ్మో.... వేలు ... లక్షలు!"

"ఛీఛీ వెధవ, ఎవరొచ్చారో చెప్పు!"

"పేర్లు తెలుస్తాయేటండీ — ఆ పొడుగాటాయన వొచ్చాడండి మోటర్ బైక్ మీద. యింకెవరో అంబాసిడర్ కారులో మార్వాడీ అనుకుంటానండీ ఆయన నొచ్చారండీ. అంతేనండీ!" అన్నాడు యాసగా.

"పుష్పా!" అని పిలిచింది.

పుష్ప ఓ మూలనుండి పరుగు పరుగున వచ్చింది.

"ఏమ్మా!" అంది భయంగా.

"లక్ష్మి గదిలోకి వెళ్ళింది ఎవరో చూశావా?"

"చూశానక్కా. పేరు తెలీదు. పొడుగ్గా, ఎర్రగా మంచి పర్సనాలిటీగా వుంటాడు. 'టక్' చేశాడు" అంది పోలికల్ని నెమరువేసుకుంటూ.

"టక్.... చేసుకున్నాడా? ఏ బెల్టు కట్టాడు?"

"ఆర్! అనే ఇంగ్లీషు లెటరువుంది. నల్లటి వెడల్పాటి బెల్టు!"

"రాంప్రసాద్ కదూ!"

"కరెక్టు....కరెక్టు! చాలా సేపు నవ్వులు వినిపించాయి. 'రాం' 'రాం' అని లక్ష్మి రెండు మూడుసార్లు అనడం చూశాను."

"మరెలా చనిపోయిందని తెలిసింది!" కంగారుగా అడిగింది.

"నాకు రెండో ఆట సినిమా విడిచిపెట్టాక బేరం వొచ్చింది. గది అవసరమయింది. ఎంత సేపటికీ తలుపు తియ్యాదు. తలుపు తట్టాను. అయినా తలుపు తియ్యలేదు. ప్రాణం విసిగిపోయింది. కిటికీలోంచి చూశాను. పెరడు వేపు తలుపులు తీసివున్నై. లక్ష్మి వొంటిమీద చీరలేదు. నేలమీద స్పృహలేకుండా పడిపోయివుంది. పట్టి

కుదిపాను. లక్ష్మి చనిపోయిందని తెలిసింది!" అంటూ మళ్ళీ బావురుమంది పుష్ప.

సుశీల గుండె ఝల్లుమంది.

"ఏమిటి-లక్ష్మికి పాంతకుడికీ మధ్య చనువుగా పిలుచుకొనేంత పరిచయం వుందా?" ఆశ్చర్యపోయింది.

## 6

"నమస్కారమండీ!" అంది సత్యవతి.

డి.యస్.పి. వరప్రసాదరావు సత్యవతి మొహంలోకి ఆశ్చర్యంగా చూశాడు.

"నేను రాజమండ్రిలోనే వుంటున్నానండీ. తమరు కోప్పడకుండా వింటానంటే కొన్ని విషయాలు మనవి చేసుకోవాలని వచ్చానండీ" అంది చేతులు కట్టుకుంటూ వినయంగా.

"ఒ.క.... చెప్పు!" అన్నాడు తాపీగా గాలి విడిచి.

"ఇన్స్పెక్టర్ రాంప్రసాద్ బాబు మీకు తెలుసాండీ!"

వరప్రసాదరావు భ్రుకుటి ముడిపడింది.

"ఏమిటి విషయం చెప్పు!"

"ఆయన మా ఇంటికి వస్తూంటారు" నేల చూపులు చూస్తూ అంది.

"ఏం.... మీ యింటికి ఎవరూ రాకూడదా?" చిరుకోపంతో ప్రశ్నించాడు.

"తమరు అలా కోప్పడితే మిగతా వివరాలు చెపుతానండీ. నేను నలుగురు అమ్మాయిల్ని పెట్టుకొని సంపాదించుకుంటున్నాను. నా పొట్టగడవక నేను యిలాంటి నీచవృత్తి చేస్తున్నాను. నాకు తెలుసు సంఘంలో నాలాంటి వాళ్ళకు గౌరవం వుండదనీ, అసహ్యించు

కుంటారని - మాకు ఈ ప్రపంచంలో బద్ద విరోధులు పోలీసులు ....”

వరప్రసాదరావు క్షణం అచేతనంగా వుండిపోయాడు. నిజాన్ని ఎంత నిర్భయంగా చెబుతుంది. ఆమెపట్ల ఆమె నిజాయితీపట్ల నమ్మకం కలుగుతోంది.

“ఊ....” అంటూ చెప్పమన్నట్లు ముందుకు జరిగాడు.

“ఒక ఇన్స్పెక్టరయివుండి మా యింటికొచ్చి మా ఇంట్లోవున్న అమ్మాయిల్తో సంబంధం పెట్టుకున్నాడు- ఫోనీ ఏదో కక్కుర్తిపడ్డారు. అతనూ అందరిలాంటి మగవాడేకదా అనుకున్నాను. వయసులోవున్న అందమయిన అమ్మాయిల్ని వాడుకున్నంతకాలం వాడుకొని పీకపిసికి చంపేస్తున్నాడు. ఇలా రెండు హత్యలు చేశాడు. ఇక ముందు ముందు ఏం చేస్తాడో భయంగా వుంది” అంది సత్యవతి.

వరప్రసాదరావుకి ఏం అర్థంకాలేదు.

“ఎవర్ని గురించి మీరు చెబుతున్నారు?” అడిగాడు.

“ఇంకెవరు బాబూ .... మీ ఇన్స్పెక్టర్ రాంప్రసాద్‌గార్ని గురించే” అంది-

షాక్ తిన్నాడు వరప్రసాదరావు! స్పేసు తల క్రిందులుగా గిర్రున తిరుగుతున్నట్లనిపించింది.

“నువు చెప్పిందానికి సరైన సాక్ష్యాలూ, ఆధారాలూ వున్నాయా? నిజం రుజువు చేయగలవా?” గద్దించి అడిగాడు.

“మా ఇంటికి రండి అయ్యగారు. నిజం ఏమిటో తెలుస్తుంది.”

“ఈ విషయంలో ఏమాత్రం తేడా వచ్చినా నిన్ను అరెస్టు చేయడమేకాకుండా, కఠినంగా శిక్షించవలసిన

పరిస్థితి ఏర్పడుతుంది” అని హెచ్చరించాడు.

“నా తల తీయించండి-ఇకముందు నా ఇంట్లో మరో 'హత్య' జరక్కుండా కాపాడితే చాలు. అదే పదివేలు!” అంది.

“సరే పద!” అంటూ ఓ జీపులో కూర్చున్నాడు డి.ఎస్.పి.

## 7

“ఇదుగో బాబూ! ఈ అమ్మాయి సునంద, ఈ అమ్మాయి పుష్ప. ఈ అమ్మాయి సుశీల. ఇదుగో! ఈ అమ్మాయి విషయంలోనే పేచీ పెట్టుకున్నారు రాం ప్రసాద్ గారు. ఆయన కోరినపుడు ఈ అమ్మాయికి వీలుకాక ఒప్పుకోలేదని శపథం చేశాడు ఇల్లు స్మశానం చేస్తానని-అందుకే మొదటిసారి రాధమ్మను చంపేడు. రెండోసారి లక్ష్మిని చంపేడు. మూడవసారి నేనే మిగిలి పోయాను” అంది జీరబోయిన గొంతుతో.

“మీ ఇంట్లో హత్య జరిగినట్లు పోలీసులకి ఎందుకు తెలియపర్చలేదు?”

“భయపడి!”

“ఎవరికి భయపడి?”

“పోలీసు డిపార్టుమెంటుకి భయపడి.”

“ఇపుడెందుకు రిపోర్టు చేశావ్!”

“మాకు రక్షణ కావాలి! అందుకోసం-మీకు రిపోర్టు చేయకపోవడం మా నేరం. ఒప్పుకుంటున్నాం. కాని ఆయనగారి 'గురి'నుండి మమ్మల్ని తప్పించాలి!” ప్రాధేయ పడుతూ కాళ్ళు పట్టుకోబోయింది.

“ఈ రెండు హత్యలు జరిగినపుడు ఎవరెవరు దగ్గ రున్నారు?”

"నేనే బాబూ.... నాతో బాటు రెండవ హత్య జరిగినపుడు పుష్ప కూడా దగ్గరుంది. ఏమేవ్" అంది.

అవునన్నట్లు తలూపింది పుష్ప. సునంద కూడా తలూపింది.

"రాంప్రసాద్ తరచూ మీ ఇంటికి వస్తుంటాడా?"

"ఆ..." అంది సుశీల కల్పించుకొని.

"నీకూ రాంప్రసాద్ కి బాగా చనువుందా?"

"చనువని మెల్లగా అడుగుతారేం బాబూ. ఈ ఇంట్లో రెండు శాల్తీలు పోవడానికి కారణం ఈ...." తిట్టాలనుకొని ఆపుచేసుకుంది. సుశీల తల దించుకుంది.

"నిన్ను ప్రేమించానని చెప్పేవాడా?"

"లేదు. నేనంటే ఇష్టమని తెలుసు?"

"హత్య జరిగినపుడు నువ్వెక్కడున్నావ్?"

"కావాలనే అడుగుతున్నారా డి. యస్. పి. గారు బజారు మనుషులు ఎక్కడుంటారు. బజారులో వుంటారు" అంది బాధగా.

వరప్రసాదరావు సుశీల ముఖంలోకి పరీక్షగా చూశాడు. సుశీల కళ్ళలో గిర్రున నీరు తిరిగింది. బొట బొట రాలిపోయింది. ప్రయత్నంమీద దుఃఖాన్ని ఆపుకొంటుంది.

"రాంప్రసాద్ ఎలా వుంటాడు పోలికలు చెప్పండి."

"పోలికలు సరిగ్గా చెప్పలేను. నాకు మొదటిరోజు పరిచయమైనపుడు నన్ను కావాలని కోరుకున్నపుడు నాకో లెటరు రాశారు. అందులో ఫోటో జతచేసి పంపించారు. వుండండి చూపిస్తాను!" బీరువా తలుపులు తీసి అడుగునవున్న కవరు తీసి అందించింది.

ఫోటో చూశాడు వరప్రసాదరావు.

గుండె ఆగినంత పనయింది.

"రాం.....ప్రసాద్!" స్వగతంగా అనుకున్నాడు. లెటరు చదివేడు మనసులో.

"సుశీలా!

నువ్వు నచ్చావు. నిన్ను అనుభవించాలను కున్నాను. ఆ అవకాశం ఇవ్వలేదు. ఆల్ రైట్ జీవితంలో కళ్ళకు కనిపించిన అందాలన్ని నా స్వంతం చేసుకోవాలనే దీక్ష నాది! నన్ను తప్పించుకోలేవు. మనసుపడి నాతో వుంటే జీవితాంతం కలిసి కమ్మని జీవితం గడుపుదాం. లేదా - నువ్వూ, ఆ సత్యవతి, నీతోబాటు వున్న ఊరకుక్కలు అందరూ చస్తారు! జాగ్రత్త!

—రాంప్రసాద్."

అని సంతకంచేసి వుంది. సంతకం రాంప్రసాద్ దే. ఉత్తరం మరోసారి చదివేడు. ఫోటో మరిమరీ చూశాడు వరప్రసాదరావు. డిఫరెన్స్ లేదు. రాంప్రసాద్.

రాంప్రసాద్ హత్యలు చేశాడా? బాధ్యతగల ఒక ఇన్స్పెక్టరాఫ్ పోలీస్ హత్యలు చేశాడా? ప్రభుత్వం రాంప్రసాద్ సేవలను మెచ్చుకొని త్వరలో డి. యస్. పి. గా ప్రమోట్ చేయాలనుకొంటున్న ఆ రాంప్రసాద్ ఈ హత్యలు చేశాడా?

# 8

వేశ్యగృహంలో ఇన్స్పెక్టర్ రాంప్రసాద్ ఇద్దర్ని హత్యచేసిన వైనం తాటికాయంతలేని అక్షరాల్తో దిన పత్రికలన్నిటిలో కనిపించింది.

రాంప్రసాద్ కాఫీ తాగుతూ పేపర్లో వార్త చదివి, పాలమారాడు. కాఫీ గొంతుదిగలేదు.

"విజ్జీ!" అంటూ కేకేశాడు.

విజయ వచ్చింది. మంచినీళ్ళన్నట్లు సైగచేశాడు. మంచినీళ్ళు తీసుకొచ్చింది. గడగడా తాగాడు.

"చూశావా!" అంటూ పేపరు చూపించాడు. విజయ పేపరు చదివింది. తన కళ్ళను తనే నమ్మలేకపోయింది. రాంప్రసాద్ ఫోటో అందులో వుంది. రాంప్రసాద్! వ్యత్యాసంలేదు.

"ఏమండీ, ఏమిటిది?"

రాంప్రసాద్ గుండె రాయి చేసుకున్నాడు. చిన్నగా పెదవులమీదుగా సన్నటి నవ్వు దొర్లిపోయింది. పేపరు మళ్ళీ ఒకసారి చదివేడు. నిజం! పేపర్లో స్వయంగా రాసివుంది తన ఫోటోతో సైతం.

ఫోన్ మ్రోగింది.

"హలో ...." ఫోనెత్తాడు రాంప్రసాద్.

"నేనూ వరప్రసాద్ని."

"నమస్తే సార్!"

"సారీ రాంప్రసాద్ ....నీ సిన్సియారిటీ నాకు తెలుసు. కాని ఎందుకిలా జరిగిందో నాకు అర్థంకాలేదు. ఇప్పటికీ పజిల్గానే వుంది. ఎవరో మినిష్టర్ లెవెల్లో ఇన్ఫ్లుయెన్స్ చేయించి ఈ ఫోటో, ఈ వార్త పత్రికల్లో వచ్చినట్లు నాకందిన వార్త! సత్యవతి వేశ్యాగృహంలో హత్యచేయబడ్డ ఇద్దర్ని నువ్వే చంపినట్లు తగిన ఆధారాలు, సాక్ష్యాలూ వున్నాయి. ఎనీవే డోంట్ వర్రీ—ఇలాంటి సమయాల్లోనే ధైర్యంగా వుండాలి!" ధైర్యంచెప్పేడు డి.యస్.పి.

"ఓ. కే. సార్!" అంటూ ఫోను పెట్టేశాడు. భారంగా నిట్టూర్చాడు. మొహం చెమట్లు పడుతుంది,

ఒకప్పుడు యిదే డి.యస్.పి. తనని గురించి ఉపన్యసిస్తూ "రాంప్రసాద్‌లాంటి యువకుడు సబ్ ఇన్స్పెక్టరుగా రావడం మన పోలీసు డిపార్టుమెంట్ కే గర్వకారణం!" అని పొగిడిన సంఘటన కళ్ళముందు మెరిసింది.

మళ్ళీ ఫోను మ్రోగింది.

"హలో" చిరాగ్గా అడిగాడు రాంప్రసాద్.

"హలో ఫ్రెండ్. నేనూ గోపాల్రావుని, నీ క్లాస్ మేట్‌ని" క్షణం ఆగాడు రాంప్రసాద్.

"హలో....ఏమిటి విషయం!" తాపీగానే అడిగాడు.

"నేను పేపర్లో చూసింది నిజమేనా?"

"నీకు తెలీదా?"

"నా కెలా తెలుస్తుంది!"

"మీకు మినిష్టర్ రికమండేషన్సు, పరపతి పుష్టిగా వున్నాయని మీరే చెప్పేవుకదా. యిలాంటి విషయాలు ముందుగా తెలిసేవి మినిష్టర్ బంధువులకే!"

"హ....హ....హ....భలే జోక్ జోస్తున్నావయ్యా బాబూ" గలగల నవ్వాడు గోపాల్రావు. ప్రయత్నంమీద భరించాడు రాంప్రసాద్.

"సరేగాని, నువ్వు వెంటనే బయలుదేరి రావాలి!" అన్నాడు గోపాల్రావ్.

"ఎక్కడికి?"

"నా గెస్ట్ హౌస్ కి."

"ఎక్కడ గెస్టుహౌస్ కి."

"మొన్న రాలేదూ. బొమ్మూరులో వున్న గెస్టు హౌస్ కి. నీతో ముఖ్యమయిన విషయం మాట్లాడాలి."

"..........."

"తప్పదు. నేనే నీతో ముఖ్యమయిన విషయం మాట్లాడాలి" అన్నాడు.

అరగంట తర్వాత రాజ్ మాత బొమ్మారు గెస్టు హౌస్ ముందు ఆగింది.

గోపాల్రావు గ్లాస్కో లుంగీ చుట్టుకున్నాడు. గ్లాస్కో లాల్చీ లోపల్నించి వంద రూపాయిల నోట్లు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"హల్లో రాం కమాన్!" అంటూ చేతులు చాచి రిసీవ్ చేసుకున్నాడు.

"ఏమిటి విషయం!" గంభీరంగా అడిగాడు రాంప్రసాద్.

"అటూ—ఏవిటోయ్. పవరు లేకపోయి గొంతు కఠినంగానే వుంది—" గోపాల్రావు జోక్.

రాంప్రసాద్ కళ్ళు ఎదురుగా వున్న అమ్మాయిమీద పడ్డాయి.

"ఎవరీమె?" అడిగాడు.

"సుశీల నీకు తెలీదా?" నవ్వుతూ అడిగాడు గోపాల్రావ్, రాంప్రసాద్ని.

"నాకు తెలీదు. యింతకుముందెప్పుడూ చూడలేదు." కంగుతిన్నాడు గోపాల్రావు.

"పోనీ నువ్వింతకుముందు చూశావా?" అడిగాడు సుశీలని. సుశీల క్షణం రాంప్రసాద్ని పరీక్షగా చూసింది.

"చూశాను!" అంది తలదించుకొని.

రాంప్రసాద్ షాక్ ఫీలయ్యాడు. గోపాల్రావు నోరావులించాడు.

"వాటీజ్ దిస్?" అని అరిచాడు.

"సుశీలా! నన్ను నీకు తెలుసా?" కళ్ళలోకి చూస్తూ అడిగాడు.

"తెలుసు!" అంది అలాగే చూస్తూ.

"ఎప్పుడు తెలుసు. ఎలా తెలుసు? నువ్వు నాటకమాడుతున్నావ్!" అరిచాడు రాంప్రసాద్.

"లేదండీ! మీరు మొదటిసారి మా యింటికి వచ్చినపుడు మీరు నేను కావాలని పట్టుబట్టారు గుర్తుందా! నాకు వీలుపడలేదు. మండిపడ్డారు. ఆ తరువాత ఒక వుత్తరం కూడా రాశారు. మీ ఫోటో జతచేసి ఫైనల్ వార్నింగ్ యిస్తూ...."

"ఆ లెటరూ, ఫోటో నీ దగ్గరుందా?"

"వుంది!" వ్యానిటీ బాగ్ లోంచి తీసి యిచ్చింది.

రాంప్రసాద్ ఫోటో చూశాడు.

"ఈ ఫోటో.... ఈ ఫోటో నీకెలా వచ్చింది?"

"మీరే యిచ్చారు!"

"నో. యిది నా పర్సనల్ ఫోటో. బాలాజీ ఫోటో స్టూడియోలో తీయించాను రీసెంట్ గా. యిది మీకెలా వచ్చిందో కనిపెట్టడం నాకంత కష్టమయింది కాదు!" అంటూ లెటరు చదవడం పూర్తి చేశాడు.

"రాం. కొంచెం ప్రశాంతంగా ఆలోచించరా. ఏమిటి దుడుకుతనం, యిపుడేం మునిగిపోయిందని? మనం స్నేహితులం. ఇలాంటి ఆపద సమయాల్లోనే ఒకరికొకరు ధైర్యం చెప్పుకోవాలి—"

"యు ఇడియట్—నా ఫ్రెండునని చెప్పుకొని మోసం చేసి, నాటకమాడి నీకు సానికొంపలకు సంబంధం పెట్టుకొని హత్యలుచేస్తావా? నీ ఇన్ ఫ్లుయెన్స్ ఉపయోగించి నా పేరు పేపర్లో వేయిస్తావా! నా ఫోటో

తీయిస్తావా! చూడు నిన్నేం చేస్తానో" అంటూ గొంతు పిసికి చంపబోయాడు.

సుశీల అడ్డంపడింది.

బలవంతంగా విడదీసింది.

"ఏవండీ! ఉద్రేకపడకండి! మీకీ విషయంలో నా నుండి పరిపూర్ణమైన సహకారం లభిస్తుంది!" అంటూ ప్రాధేయపడింది.

సుశీల రాంప్రసాద్‌ని చూసినప్పటినుండి గమనిసుంది. మాటలు—చూపులు—ప్రవర్తన అన్నిటిలోనూ తేడా కనిపిస్తుంది. సమ్‌థింగ్ మోసం జరిగివుంటుందని గ్రహించింది.

రాంప్రసాద్ సుశీల మొహంలోకి చూశాడు.

సుశీల దీనంగా చూసింది.

"సుశీలా! ఏంటి—ఏమిటి నువు నాకు సహకరించాలనుకున్నది. టెల్ మీ!" అరిచాడు. రాంప్రసాద్ భయంకరంగా కనిపించసాగాడు. కళ్ళు చింతనిప్పుల్లా మెరిశాయి.

"మీరు నాతో మా యింటికి రండి! కొన్ని ఆధారాలు దొరుకుతాయి" అంది ఆశగా.

"అవును....రాంప్రసాద్! నేనూ నీ ఫ్రండునేరా. నాకే పాపం తెలీదురా! పత్రికల్లో పేరు ఎలా వచ్చిందో, ఫోటో ఎలా అచ్చయిందో వివరాలు సత్యవతిని అడిగితే తెలుస్తాయి. పదరా, నీ విషయంలో ఎన్ని లక్షలు ఖర్చయినా లెక్కపెట్టను. నువ్వు నిర్దోషివని నిరూపించుకోవాలి!" అన్నాడు కంటతడిపెట్టి—

సత్యవతి యింటికేసి రాజ్‌దూత్ పరుగుతీసింది.

ఆ వెనుక సుశీల, గోపాల్రావ్ జీపులో దూసుకు వెళ్ళారు.

# 9

"ఏమయినాసరే యిది మన పోలీసు డిపార్టుమెంటుకే భరించరాని అవమానం!" అన్నాడు డి. యస్. పి. సూర్యప్రకాశరావు.

"నోనో మిస్టర్ సూర్యం. రాంప్రసాద్ హంతకుడు కాడు. రాంప్రసాద్‌కి అతి త్వరలో డి.యస్.పి.గా ప్రమోట్ అయ్యే అవకాశాలున్నాయి. ఈ వార్త చాలామంది బిజినెస్ మాగ్నెట్‌లకు తెలుసు. రాంప్రసాద్ వాళ్ళ ఆటలు సాగనివ్వడని, ఎవ్వరో ఈ దారుణానికి తలపడ్డారు. రాంప్రసాద్ అలవాట్లు, సిన్సియారిటీ మనకు తెలియంది కాదు! ఈ విషయంలో— రాంప్రసాద్ నిర్దోషి అని నిరూపించడం విషయంలో మీరందరూ పూనుకోవాలి! మళ్ళీ రాంప్రసాద్ యూనిఫామ్‌లో మనకగ్పించాలి. ఏమంటారు రఘునాధరావు గారు" అని సీనియర్ ఇన్స్పెక్టర్ని అడిగాడు వరప్రసాదరావు.

"ఏమో సర్! రాంప్రసాద్ మీద అంత మంచి రిపోర్టు నా దగ్గర లేదు. ఆయనకీ అలవాట్లున్నాయనీ బిజినెస్ మెన్‌తో టచెస్ వున్నాయనీ, డిబేచింగ్ హౌసెస్‌తో అండర్‌స్టేండింగ్ వుందనీ నాలుగయిదుసార్లు మన స్టాఫ్ అనుకుంటుండగా విన్నాను. ఏమండి సూర్యం గారు చెప్పరేం!"

"అవున్సార్! మీరు మంచివాళ్ళు. మీకు అందరూ మంచిగానే కనిపించవచ్చు. కాని రాంప్రసాద్ నిజ స్వరూపం మీకు తెలీదు. ఆయనకో ఫ్రెండున్నారు,

గోపాల్రావని లక్షాధికారి. అన్యాయాలు, అత్యాచారాలకు పెట్టింది పేరు. ఆయనకి రాంప్రసాద్ అండ-అలాగే స్మగ్లర్ మూర్తి దొరగారికి ఆరో ప్రాణం ఈ రాంప్రసాద్. అయితే తెలివిగా ఈ విషయాల్ని తొక్కిపెట్టి 'సిన్సియర్' అన్న పేరు తెచ్చుకున్నాడు. రాంప్రసాద్ మంచి నటుడు. ఎప్పుడు, ఎవరి దగ్గర.... ఎలా నటించాలో బాగా తెలుసు. మన స్టాఫ్‌లోనే కాదు, కొంతమంది బిజినెస్ మెన్ దృష్టిలోనూ 'రాం'కి చాలా బేడ్ నేమ్ వుంది!" అన్నాడు సూర్యం.

వెంటనే శేఠ్ చందన్‌లాల్‌కి ఫోన్ చేశాడు డి.యస్.పి.

"హలో....చందన్‌లాల్ గారా! రాంప్రసాద్ మిమ్మల్ని ఈ మధ్య కలిశారా!"

"కలవలేదండీ. రెండు వారాల క్రితం కలిశారు. అర్జంటుగా యాభయ్ వేలు కావాలన్నారు. ఇచ్చాను. తర్వాత కలవలేదు!"

"యాభయ్ వేలా! ఎందుకండీ!"

"ఎందుకంటారేవిటండీ— పేరున్న పోలీసధికారులు మాలాంటోళ్ళ దగ్గర డబ్బు ఎందుకడుగుతారండీ!" కిలకిలా నవ్వాడు.

వరప్రసాద్ గుండెను దొలిచేసింది ఆ నవ్వు.

"ఏమంటారు సార్ చందన్‌లాల్ గారు!" అని అడిగాడు సూర్యప్రకాశ్. వరప్రసాద్ మాట్లాడలేదు. మౌనంగా తలదించాడు.

"ఎనీవే దిసీజ్ కాన్ఫిడెన్షియల్! ఒకే వృత్తిలో మనమందరమూ వుంటున్నాం. ఈ రోజు రాంప్రసాద్ కావచ్చు. రేపు సూర్యప్రకాశ్ కావచ్చు. ఎల్లుండి

రఘునాథన్ లేదా, నేనే కావొచ్చు. మనకి ఒకరిపట్ల ఒకరికి విశ్వాసం వుండాలి. ఒకరిలో వున్న మంచి మరొకరు పంచుకోవాలి!" అంటూ కళ్ళు అద్దుకున్నాడు.

# 10

రాంప్రసాద్‌ని చూడగానే సత్యవతికి గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. ప్రళయకాలరుద్రుడ్ని చూసినట్లనిపించింది.

"ఎ .... ఎ .... ఎవరు మీరు?" అంది సత్యవతి వొణుకుతూ.

"నీ....నీకు — తెలీదూ...."

"నాకు తెలీదు!" వెన్నులోంచి వొణుకు పుట్టుకొస్తుంది సత్యవతికి.

"నే నే.... నే నే రాంప్రసాద్‌ని!" అడుగులో అడుగు ముందుకేసుకొంటూ నడిచాడు. బెల్టు విప్పేడు. సత్యవతి కళ్ళు చాకల్లా తిరుగుతున్నై.

"నువ్వు రాంప్రసాద్‌వి కాదు!"

"ఏమన్నావ్!"

"నువ్వు రాంప్రసాద్‌వి కాదు. రౌడీవి! ఆడు పంపించిన రౌడీవి! రాంప్రసాద్ యిలా వుండడు. యింత భయంకరంగా వుండడు!" అంది తడబడుతూ.

"మరెలా డి.యస్.పి.గారికి రిపోర్టు చేశావ్."

"ప్రాణ భయంతో."

"యిపుడు మాత్రం నీ ప్రాణాలు దక్కుతాయా!"

"మమ్మల్ని చంపకు! వాడు వేరు. మీరు వేరు!" బ్రతిమాలుకుంది. రాంప్రసాద్ కళ్ళు నిప్పులు కురిపిస్తున్నాయి. గోపాలరావుకి గుండె మండింది.

"ఏయ్ రాక్షసీ! అన్యాయంగా ఒకరి నిందు జీవి

తంతో ఆడుకుంటావా!" గొంతు పిసికి చంపబోయాడు. రాంప్రసాద్ అడ్డుకున్నాడు.

"గోపీ! దాన్ని చంపకూడదు. యిదే సాక్ష్యం చెప్పాలి. ఎవరు....ఎవరు రాంప్రసాద్‌ని....మీ ఇంటికి వచ్చిన ఆ రాంప్రసాద్‌ని ప్రత్యక్షంగా చూసింది ఎవరు?" రాంప్రసాద్ మాట్లాడుతుంటే అందరికీ గుండె దడదడలాడింది. పెదవులు తడబడ్డాయ్.

"నేను...." అంటూ ముందుకొచ్చింది పుష్ప.

"నాలాగే వుంటాడా?" పుష్పని ఆపాదమస్తకం చూస్తూ ప్రశ్నించాడు.

"అవును!"

"ఆయన అలవాట్లు ఏవిటి? నువ్వు గమనించిన అలవాట్లు చెప్పగలవా?"

"నేను చెబుతాను!" అంటూ సుశీల ముందుకు వచ్చింది.

"చెప్పు! స్పష్టంగా చెప్పగలిగితేనే చెప్పు!" అని సుశీల కళ్ళల్లోకి తీక్షణంగా చూడసాగాడు.

సుశీలకి కంపనం బయలుదేరింది.

"ఆయన మీలా తీక్షణంగా చూడలేదు. క్షణక్షణానికి చూపులు మారుతూంటాయి. పాసింగ్ షో సిగరెట్ కాలుస్తాడు. పొగ పీల్చడు. ఏదయినా మాట్లాడేముందు, మాట్లాడిన తరువాత స్టయిల్‌గా ముక్కుతో గాలి పీలుస్తాడు. ఒడ్డూపొడుగూ అచ్చు మీలాగే వుంటాడు. ఆయనకి ఎడమ కంటిలో పట్టి చూస్తే పుట్టుమచ్చ వుంటుంది. కాని రింగులాగా నుదురుమీదకి ఓ కర్ల్ వస్తుంది" అంది రాంప్రసాద్, సుశీల మొహంలోకి చూశాడు స్పష్టంగా.

అనుమానంలేదు. నిర్భయంగా తను అతనిలో చూసింది చెబుతుంది. ఆ వర్ణన మదన్‌కి సరిపోతుంది.

కళ్ళు మూసుకున్నాడు.

గతం తళుక్కుమంది.

• • •

"మీకు పదిలక్షలు యిస్తాను. ఈసారికి విడిచిపెట్టండి. యికముందు యిలాంటి పనులు చేయను."

మదన్ కాళ్ళమీద పడ్డాడు.

చుట్టూ పదిమంది అమ్మాయిలు—దీనంగా చూస్తున్నారు.

ఆ అమ్మాయిల్ని నేపాల్ పంపించడానికి సిద్ధంగా వున్న మదన్ 'రాం'కి దొరికిపోయాడు.

"టు నాట్ సెవెన్, త్రీ జీరో సిక్స్ వాళ్ళను సేఫ్‌గా మన స్టేషనులో విడిచిపెట్టి డి.యస్.పి.గారికి రిపోర్టు యివ్వండి!" అన్నాడు.

కానిస్టేబుల్స్ పదిమంది సుందరాంగుల్ని తీసుకెళ్ళారు. మదన్ అలే చూస్తూ వుండిపోయాడు. వేన్ కదిలి పోయింది.

"ఇన్స్‌పెక్టర్! వీళ్ళని అయిదు సంవత్సరాల క్రితం కొన్నాను. వీళ్ళమీద లక్షలు ఖర్చుచేశాను. అవతల ఈ రోజే పంపిస్తానని మాట యిచ్చాను. డబ్బు కూడా తీసుకున్నాను. పోనీ ఈ పాతిక లక్షలు నువ్వే తీసుకో! ఆ పిల్లల్ని నాకు వొదిలెయ్. ఈ రోజు 'హంసగీతి' షిప్‌లో వీళ్ళని పంపించేందుకు హెల్ప్‌చెయ్! ప్లీజ్! అంటూ కాళ్ళమీద పడ్డాడు—మదన్.

"ఛీ ఛీ! రాస్కెల్!" అంటూ తన్నాడు.

మదన్ దెబ్బతిన్న పులిలా తిరగబడ్డాడు.

మొహంమీద ఓ గుద్దు గుద్దాడు. మదన్ ముక్కు

చిదిగిపోయి నెత్తురు కారుతోంది.

ఎగిరి గుండెలమీద తన్నబోయాడు మదన్. అలాగే కాళ్ళు వెనక్కి విరిచాడు. కాళ్ళతో మెడకు సంకెళ్ళు వేశాడు. నేలమీద మదన్ ఒక్కడే గిలగిలా కొట్టుకుంటున్నాడు.

రాంప్రసాద్ బయటికి నడిచాడు గర్వంగా.

"రేయ్.... నిన్నూ నీ జీవితాన్ని సర్వనాశనం చేస్తాను! అలా చేయకపోతే నా పేరు మదన్ కాదు!" అన్నాడు సంకెళ్ళు విడదీసుకుంటూ.

## 11

"హల్లో! 'హనీమూన్' హోటలా అది!" రాంప్రసాద్ ఫోన్ చేశాడు.

"అవునండీ!"

"రాంప్రసాద్ మీ హోటల్‌కి వచ్చాడా!"

"యిప్పుడే తన ఫ్రెండ్స్‌తో వచ్చి యస్. వి. తీసుకెళ్ళారండి!"

"దేనిలో వచ్చారు!"

"అంబాసిడర్ కార్లోనండి!"

"కారు నెంబరు చెప్పగలరా!"

"ఆయన సిన్సియర్ పోలీసాఫీసరండి బాబూ! ఆయన మీద మీకెందుకు ఆరాలు!" అంటూ ఫోను పెట్టేశాడు నారాయణరాజు. మళ్ళీ డయల్ చేశాడు చందన్‌లాల్‌కి.

"హల్లో చందన్‌లాల్ గారా!"

"అవునండీ!"

"రాంప్రసాద్ వచ్చాడా!"

"యిపుడే వచ్చి వెళ్ళారండీ!"

"ఎందుకూ!"

"ఎందుకేమిటి బాబూ. మా ప్రాణం తీసేస్తున్నాడాయన. వారానికో పదివేలు వసూళ్ళు మొదలుపెట్టి నెలరోజులైంది!"

"ఎలా వచ్చారు!"

"వైట్ అంబాసిడర్‌లో."

"నెంబరు తెలుసా?"

"యం. యస్. వి. ఒకటి సున్న మూడు తొమ్మిది."

"థాంక్యూ!" ఫోను పెట్టేశాడు రాంప్రసాద్.

ఆఖరికి నెంబరుని కూడా డూప్ చేశాడన్న మాట. తన రాజ్‌దూత్ నెంబరు అదే—రాంప్రసాద్ పేరు చెప్పి యిలా యింకెన్ని మోసాలు చేశాడో. ఎన్ని అన్యాయాలు చేశాడో—

"గోపీ .... నాకు మెంటల్ వేకరింగ్ వుంది. నువు డ్రైవ్ చెయ్. హోటల్ హనీమూన్‌కి పద!" అన్నాడు రాంప్రసాద్ కారెక్కుతూ.

'హనీమూన్' ముందు కారాగింది.

కారులోనుండి రాంప్రసాద్, గోపాల్రావ్ దిగేరు.

పార్కింగ్ ప్లేస్‌లో యం. ఎస్. వి. 1039 వైట్ అంబాసిడర్ వుంది.

బార్ సెక్షన్‌లో కాబరే డాన్సు జరుగుతుంది.

రాంప్రసాద్ కళ్ళు 'మదన్'ని గురించి వెదుకుతున్నై.

ఒక మూలనుండి పాసింగ్ షో సిగరెట్ గుప్పుగుప్పుమంటూ పొగలు....ఆ పొగలమధ్య ఓ జత కళ్ళు లైట్ల వెలుగులో తళతళ మెరుస్తూ చాకుల్లా తిరుగుతున్నై. ఎడమ కంటిలో పుట్టుమచ్చ.

చుట్టు పదిమంది గర్ల్ ఫ్రెండ్స్.

నుదురుమీద వంకీల జుత్తు—

"మదన్!" అంటూ అరిచాడు రాంప్రసాద్.

డాన్స్ ఆగిపోయింది.

సింహంలా మదన్‌మీదకి దూకాడు.

గోపి తలుపులు మూసి, ఎవర్ని బయటికి పోనివ్వకుండా చేశాడు.

రాంప్రసాద్ వేషంలో వున్న మదన్ గుండెలమీద కూర్చున్నాడు, రాంప్రసాద్. మదన్ తడబడుతున్నాడు. తప్పించుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. రాంప్రసాద్ మదన్ జుత్తు పీకాడు. విగ్గు వూడిపోయింది.

"నువ్వెవరో చెప్పరా!" చెంపలమీద ఒకటిచ్చాడు రాంప్రసాద్.

"రాం" అని ఏదో చెప్పబోయాడు.

అంతే గోపీ డొక్కలో ఒకటిచ్చాడు. "ఆ పేరు.... ఆ పేరు చెప్పడానికి కూడా నీకు అర్హత లేదురా!" అన్నాడు.

మదన్ పెదవులమీదుగా రక్తం ప్రవహిస్తోంది. రెండు పళ్ళు రాలిపోయాయి.

"చెప్పు! ఎందుకీ నాటకం ఆడుతున్నావో చెప్పు! నా పేరు చెప్పుకొని ఎన్ని హత్యలు చేశావో ఎన్ని అన్యాయాలు చేశావో చెప్పు!" కుదిపి గుంజుతూ అడిగాడు.

మదన్ నోరు విప్పలేదు.

రాంప్రసాద్ నుదురుమీద ఒకటిచ్చాడు. మదన్ నుదురు చిట్లిపోయింది. డొక్కలో తన్నాడు. గింగుర్లు తిరిగిపోయాడు. గుండెల్లో పిడిగుద్దు గుద్దాడు.

రాంప్రసాద్ కాళ్ళమీద పడిపోయాడు.

"రాంప్రసాద్ గారూ! నన్ను క్షమించండి!" అంటూ.

# 12

"చెప్పు....నిజం ఏమిటో వివరంగా చెప్పు!" డి. యస్. పి. ముందు పడేశాడు, మదన్—మదన్ ప్రయోగించిన విగ్గుని టేబుల్ మీద వుంచాడు రాంప్రసాద్.

అందరి చూపు మదన్ మీదనే వుంది.

"సార్! నన్ను క్షమించండి. నేను మోసం చేశాను. అమ్మాయిల్ని తార్చాను. హత్యలు చేశాను. అమ్మకం సాగించాను. యివన్నీ నేను కావాలని చేయలేదు. నా వెనుక ఒక వ్యక్తి వున్నాడు. అతడే వీటన్నిటికి బాస్. ఆయన చేయమంటే చేశాను!" అన్నాడు రొప్పుతూ.

"ఎవరు ఆయన?"

"ఇన్స్పెక్టర్ సూర్య...." అంటుండగా కర్టెన్ చాటున రివాల్వర్ పేలింది. మదన్ గుండెల్లో దూసుకుపోయింది.

వెంటనే పిస్తోలు సౌండ్ వచ్చినకేసి పేల్చాడు రాంప్రసాద్.

"అమ్మా" అంటూ అవతలి వ్యక్తి పడిపోయాడు.

అతడు ఇన్స్పెక్టర్ సూర్యప్రకాశ్. చెయ్యికి గాయమయింది. రివాల్వర్ అల్లంతదూరంలో పడింది. ధారాపాతంగా రక్తం ప్రవహిస్తోంది. వరప్రసాదరావు రివాల్వర్ అందుకున్నాడు.

"యూ....యూ....యూ.. మిస్టర్ సూర్యప్రకాశ్! యు హావ్ డన్ ది జాబ్" అన్నాడు.

"క్షమించండి సార్! నేనే చేశాను. రాంప్రసాద్

మొదట్నుంచీ నాకు అన్నివిధాలా అడ్డు తగులుతూనే వున్నాడు. నా కళ్ళముందు ట్రైనింగయ్యాడు. నా కళ్ళ ముందు సబ్ ఇన్స్పెక్టరయ్యాడు. నా కళ్ళముందే రేపు డి.యస్.పి. కాబోతున్నాడు. వాడికి నేను సెల్యూట్ పెట్టే దురదృష్టం కలక్కూడదు. అందుకే....అందుకే, వాడి అంతం చూడాలని కంకణం కట్టుకున్నాను. బాడ్ లక్. బ్రతికిపోయాడు!" భారంగా నిట్టూర్చాడు సూర్యప్రకాశ్. కళ్ళల్లో విషజ్వాలలు కురుస్తున్నాయి.

డి. యస్. పి. వరప్రసాద్ క్షణం స్తబ్ధతగా వుండి పోయాడు. సూర్యప్రకాశ్ లేచి నిలబడ్డాడు.

"కమాన్ నన్ను అరెస్టు చేయండి!" అంటూ చేతు లందించాడు.

సూర్యప్రకాశ్ కి సంకెళ్ళు వేశారు.

—:ఐ పో యి ం ది:—

# మాయమైన మొసలి పాము

## ఎమ్.వి.వి. సత్యనారాయణ

మౌంట్ రోడ్డు మీద కారు నున్నగా జారిపోతోంది. శంకరరాజన్ స్టీరింగ్ వీల్ వద్ద కూర్చున్నాడు. విండ్ స్క్రీన్‌లోంచి ముందుకు చూస్తూ వీల్ త్రిప్పు తున్నాడు. కుడిచేతిలో త్రిబుల్ ఫైవ్ సిగరెట్టు వెలుగు తోంది. గుండెల నిండుగా పొగ పీల్చుకున్నాడు. ఆలో చనల్లో ఉన్నాడు.

దక్షిణ భారత చిత్రపరిశ్రమలో తాను మకుటం వున్న మహారాజు. తన చిత్రం అంటే డిస్ట్రిబ్యూటర్ కళ్ళు మూసుకుని కొనుక్కుంటాడు. తన చిత్రం ఆంధ్రాలో విడుదలవుతోందంటే మిగతా చిత్రాలవాళ్ళు కళ్ళు విచ్చుకు చూస్తారు. తనకంటే వాళ్ళకే మొదటి రోజు ప్రేక్షకుల మాట ముందుగా తెలుస్తుంది. చిత్రం ఫ్లాప్ అవు తుందేమోనని వాళ్ళ దురాశ!

చిత్ర నిర్మాణాలో తాను తీసుకునే జాగ్రత్తలు వాళ్ళకు తెలియక కాదు. వాళ్ళు వాంచి చిత్రం తీయలేక!

కో త్తదనాన్ని ఆహ్వానించలేక! తన చిత్రం అంటే పేరున్న తారలు కూడా కాళ్ళు తొక్కుకుని మరీ కాల్ షీట్స్ యిస్తారు.

ధనమూలం ఇదం జగత్.

తను పని చేయించుకుంటున్న తన కళాకారుల కెన్నడూ అన్యాయం చేయడు. అదే తన విజయానికి మూలసూత్రం.

శంకరరాజన్ కారు మలుపు త్రిప్పాడు.

ఇప్పుడు తాను ఒక చిత్రం తీయాలి. ఆంధ్రదేశం అట్టుడికి పోవాలి. కలెక్షన్స్ రికార్డులను బ్రద్దలుకొట్టాలి. తన చిత్రంలో అన్ని స్థాయిలలోని ప్రేక్షకులకు కావల సిన మసాలాలు కావలసిన మోతాదులో ఉంటాయి. ఇప్పుడు తాను తీయబోయే చిత్రం సోష్యల్ చిత్రం. ఫ్యూజి కలర్ లో తీయాలి. ముడి ఫిలిం సిద్ధంగా వుంది.

కథ సిద్ధంగా వుంది. పాత్రలకు చాలవరకూ తారలు ఎన్నికయారు. తన వాహిరా స్టూడియోలో సెట్స్ నిర్మి స్తున్నారు.

షూటింగ్ మొదలు పెట్టాలి. ఇప్పుడే చిన్న ఆటంకం వచ్చి పడేలాగా వుంది.

అసంకల్పితంగా ఆయన చేతులు బ్రేకులు మీద పడ్డాయి.

రోడ్డుకి ప్రక్కగా వాహిరా స్టూడియో.

వాచ్ మాన్ నిలబడి తన కారునే చూస్తున్నాడు. కారుకు సలాంకొట్టి గేటు తెరిచాడు.

కారు గేటులోంచి లోపలకు వెళ్ళింది.

పోర్టికోలో ఆగింది. శంకరరాజన్ కారు దిగాడు. స్టూడియో మెయిన్ హాల్ లో తారలూ, టెక్నిషియన్లు కూర్చుండి ఉన్నారు.

హాస్యనటుడు వాళ్ళకు కాలక్షేపం కలిగిస్తున్నాడు.

శంకరరాజన్‌ని చూడగానే వాళ్ళు నవ్వుతూ చూశారు.

శంకరరాజన్ ఆశ్చర్యంగా చూశాడు. "ఇంతమంది తారలు ఒకేసారి నా స్టూడియోలో కబురూ కాకరకాయ లేకుండా....." నవ్వాడు శంకరరాజన్.

ఆయన తీయబోయే వర్ణచిత్రంలోని హీరో గొంతు సవరించుకున్నాడు.

"ఆంధ్ర దేశంలో తుపాన్ భీభత్సం గురించి ఈ రోజు వార్తలలో వినేవుంటారు" అన్నాడు హీరో.

"అవును. కోస్తా ప్రాంతాలు బాగా దెబ్బతిన్నాయి. లక్షల ప్రజలకు ఆశ్రయం పోయిందిట!" అన్నాడు శంకరరాజన్.

హీరోతో పాటు మిగతా తారలు విచారంగా చూశారు.

"ఆంధ్రదేశంలోని ముఖ్య కేంద్రాలు సందర్శించాలనీ తుపాను బాధితులకు కొంత నిధిని పోగుచేయాలనీ మన వాళ్ళు నిర్ణయించుకుంటున్నారు."

"మంచిదే! మన చిత్రాలకు పోషకులు వాళ్ళే! వాళ్ళను ఇటువంటి సమయాల్లోనే ఆదుకోవాలి!"

"కాని మన స్కోప్ చిత్రానికి ఈ నెలలో ఇక్కడ ఉన్నవాళ్ళంతా ఎప్పుడో ఒకప్పుడు కాల్ షీట్స్ యిచ్చినవాళ్ళే....."

"ఆంధ్ర దేశంలో ఎంతకాలం పర్యటించాలని....."

"పది రోజులు."

"ఆల్ రైట్....ఆ కాలంలోని కాల్ షీట్సు కాన్సిల్ చేసుకుందాం."

"చిత్ర నిర్మాణంలో మీకు ఇబ్బంది కలుగుతుంది."

"నా స్టూడియో.... నా చిత్రం.... నా తారలు....నష్ట పోయేదిలేదు. ఈ లోపుగా నేను కొన్ని సీన్స్ షూట్ చేసుకుంటాను."

"తారలు ఎవరూ ఉండరు."

శంకరరాజన్ నవ్వి, "చిత్ర పరిశ్రమ బయలుదేరి వెళ్ళాలి....ప్రజలను ఆదుకోవాలి. నా విరాళం లక్ష రూపాయలు. కాని...." ఆగాడు.

"థాంక్యూ సార్....కాని....సీన్స్ ఎలా షూట్ చేస్తారు?"

"తారలు కానివాళ్ళతో...."

"సస్పెన్సా?"

"కాదు. నగరంలోకి రష్యన్ సర్కస్ వచ్చింది. మన చిత్రంలోకి కొన్ని సీన్స్ షూట్ చేస్తాను."

తారలు చప్పట్లు కొట్టారు.

"మరో 'మేరానామ్ జోకర్....' తీస్తారన్నమాట!" అన్నాడు హాస్యనటుడు.

"కాదు. 'మేరానామ్ జోకర్' లాగా తీయను."

"సర్కస్ సీన్స్ ఎప్పటివరకూ షూట్ చేస్తారు?" అడిగాడు హీరో.

"మీ పర్యటనా కార్యక్రమాలు ముగిసేలోపున!"

"ఆల్ రైట్! ఇంత సేపూ కాల్ షీట్స్ రద్దయినందుకు అందరమూ బాధపడ్డాం. ఆ వ్యవధిలో చిత్ర నిర్మాణం కుంటుపడదు!"

శంకరరాజన్ తలూపి, "రష్యన్ సర్కస్ అధినేత ఇల్యనోవ్ మీలో ఎవరికి తెలుసు?" అన్నాడు.

హాస్యనటుడు లేచి మెల్లగా టెలిఫోన్ వున్న బల్లను

సమీపించాడు.

"ఆయన నాకు తెలుసు సార్! ఫోన్ చేద్దామా?" అన్నాడు.

"నీకు ఆయనతో పరిచయం ఎలా అయింది?" అడిగాడు శంకరరాజన్.

"సర్కస్ ఈ నగరానికి రాకముందు బెంగుళూరులో ఆడేది. హాస్యగాళ్ళకోసం ఆయన ఇంటర్వ్యూ పెట్టారు. నేనూ వెళ్ళాను. నేను ఎన్నిక కాలేదు" హాస్యనటుడు రిసీవర్ ఎత్తి నంబర్ డయిల్ చేశాడు.

హాస్య నటుడు తనని ఫోన్‌లో పరిచయం చేసు కున్నాడు.

ఫోన్ ఎత్తింది ఇల్యనోవ్.

హాస్య నటుడు రిసీవర్‌ని శంకరరాజన్‌కి అందించాడు.

"గుడ్ డే మిస్టర్ ఇల్యనోవ్! మీతో ఒక అర గంట మాట్లాడాలి. ఎప్పుడు రమ్మంటారు?"

"వెరీ గుడ్ డే.... నేనే మిమ్మల్ని కలవాలనుకుం టున్నాను" స్వచ్ఛమైన ఇంగ్లీషు. రష్యన్ యాస దానికి కోటింగ్ యిస్తోంది.

"ఎందుకోసమో చెబుతారా?"

"ఇండియాలో మా ట్రూపు కొత్త అంశాలు నేర్చు కుంది. వాటిని మీవంటి చెయ్యి తిరిగిన దర్శకులు షూట్ చేయించగలరు."

"ఆ ఫిలిం ఏం చేస్తారు?"

"మాస్కోలోని టి. వి. కేంద్రంలో ప్రసారం చేస్తారు!"

"అలాగే...తప్పకుండా షూట్ చేస్తాను. నా పని కూడా సులువవుతుంది!"

"మీ పనా? చెప్పండి!"

"నేనో పిక్చర్ స్కోప్‌లో తీస్తున్నాను. ఆ చిత్రం కోసం కొన్ని సర్కస్ ఫీట్స్ కావాలి!"

ఇల్యనోవ్ కిచకిచ నవ్వాడు. "సినిమా తీయడమే పెద్ద సర్కస్ ఫీట్!"

"నిజమే!" శంకరరాజన్ కూడా నవ్వాడు. "జీవితానికీ, సర్కస్ జీవితానికీ పోలికలున్నాయి. సర్కస్ ఫీట్స్‌ను సింబాలిక్‌గా చిత్రంలో వాడుకుంటాను."

"బాగుంటుంది. ప్రదర్శన జరిగేటప్పుడు షూట్ చేస్తారా? షూటింగ్‌కి ప్రత్యేక ప్రదర్శన యివ్వాలా?"

"నేను వేయించిన సెట్స్‌లోనో, ప్రకృతి మధ్యనో షూట్ చేయాలనుకుంటున్నాను."

"ఐసీ...సర్కస్ టెంట్ బాక్‌గ్రౌండుగా వుండదు!"

"కరెక్టు!"

"అయితే ఒక సర్దుబాటు. మీరు ప్రదర్శనలో షూట్ చేసిన సీన్స్ నాకూ, ప్రత్యేక ప్రదర్శనలో షూట్ చేసుకున్నవి మీకూ....ఓ....కె...."

"మీకు గుడ్‌విల్...."

"గుడ్‌విల్ ప్రసక్తిలేదు. నా సీన్స్‌కి నేను ఏమీ యివ్వను!"

"ఆల్‌రైట్...."

"ఎప్పుడు స్టార్టు చేస్తారు?"

"రేపు రాత్రి.... మొదటి ఆటలో...."

"గుడ్. మొదటి ఆట సాయంకాలం 6—30కి ప్రారంభం."

"థాంక్యూ....మిగతా వివరాలు సమక్షంలో...." శంకరరాజన్ ఫోన్ పెట్టేశాడు.

# 2

"టైం ఎంత?" అడిగాడు అతడు.

రెండోవాడు వాచీ చూసుకున్నాడు. "ఒంటిగంటా పది నిముషాలు!" అన్నాడు.

మొదటివాడు చుట్టూ చూశాడు. అర్ధ రాత్రి చీకట్లు అక్కడక్కడా తారాడుతున్నాయి. వాటిని కూడా పారద్రోలడానికి నియోన్ లైట్లు వ్యర్థ ప్రయత్నం చేస్తున్నాయి. ఇద్దరూ రోడ్డు వదిలిపెట్టి చీకట్లో నడవసాగారు.

"మనం ఆలస్యం చేశాం!" అన్నాడు మొదటివాడు.

"ఇప్పటికయినా మించిపోయిందిలేదు" అన్నాడు రెండోవాడు.

ఇద్దరూ సందులోపడి నడుస్తున్నారు.

ఎక్కడో తీతువు అరుస్తోంది. ఉండిఉండీ రోడ్డు మీద ఏదో వాహనం వెళ్తోంది.

మొదటివాడు సందు చివరలో ఆగాడు.

రెండోవాడు తన భుజాన వున్న సంచి తడుముకున్నాడు. ముడులు వేసిన తాడు. దాని చివర కొక్కెం!

"మ్యూజియం కనిపిస్తోందా?"

"ఆఁ! అదిగో రోజ్‌లాండ్ హోటల్. రెండో అంతస్తులో వున్నదే మ్యూజియం."

"వాచ్‌మన్‌లు ఇద్దరా?"

"అవును. ఒకడు ఇటునుండి, రెండోవాడు అటునుండి హోటల్‌కు ప్రదక్షిణం చేస్తారు."

"ఇద్దరూ ఎక్కడ కలుసుకుంటారు?"

"హోటల్ మెయిన్ గేటు దగ్గర. అచ్చగా వెనక ప్రక్క కూడా ఒక నిర్ణీత స్థలం దగ్గర."

"అయితే వెనక ప్రక్కకి చేరుకుందామా?"

"వద్దు ఇక్కడ అయితే నేకెళ్ళి కొట్లు అడ్డం ఉన్నాయి."

ఇద్దరూ హోటలువైపు చూశారు.

వాచ్‌మన్‌లు కలుసుకుని అప్పుడే విడిపోతున్నారు.

"వాళ్లు మరుగులోకి వెళ్ళగానే మనం కిళ్ళీ కొట్టు వెనక చేరుకోవాలి."

"రైట్!"

ఒక నిమిషం తర్వాత ఇద్దరూ కిళ్ళీ కొట్టు వెనుక చేరుకున్నారు. ఇప్పుడు వాళ్ళ చేతుల్లో చెరో కత్తి తళతళలాడుతోంది.

మొదటివాడు మెయిన్ గేటునుండి తాము నిలబడిన స్థలం అంచనా వేసుకున్నాడు.

"ముప్ఫయి అడుగులు .... మన ఇద్దరి కత్తులూ లక్ష్యాన్ని ఛేదించాలి."

"అవును."

క్షణాలు గడుస్తున్నాయి.

అటు వెళ్ళిన వాచ్‌మాన్ ఇటూ, ఇటు వెళ్ళిన వాచ్‌మాన్ అటూ వస్తున్నారు.

దాక్కున్న వాళ్లు కత్తులను పిడి దగ్గర పట్టుకున్నారు. కత్తులు దూసుకుపోవడానికి పొజిషన్‌లో ఉన్నాయి.

వాచ్‌మన్‌లు దగ్గరపడుతున్నారు.

ఇద్దరికీ మధ్య దూరం తగ్గుతోంది. ఇద్దరూ ఎదురెదురుగా ఆగారు. ఒకడు జేబులోంచి బీడీ తీశాడు. రెండోవాడు తన నోటిలోని బీడీతీసి అందించాడు.

కత్తులు గాల్లోకి లేచాయి. గాల్లో సర్రమని శబ్దం చేశాయి.

మరుక్షణంలో ఇద్దరు వాచ్‌మన్‌లూ నేలకూలారు. ఒకడికి ఎడంప్రక్క ఛాతీలోకి, రెండోవాడికి కుడి ప్రక్క ఛాతీలోకీ కత్తులు దూసుకుపోయాయి.

చిన్న మూలుగు తప్ప, ఇద్దరూ ఎలాంటి శబ్దమూ చేయలేదు. క్షణంలో నేలకొరిగిపోయారు.

దాక్కున్న వాళ్ళిద్దరూ చుట్టూ చూసుకున్నారు.

తామిద్దరూ... అక్కడ నేలమీద రెండు శవాలూ... తప్ప నిర్మానుష్యం.

"మ్యూజియంలో ఎలక్ట్రికల్ అలారం!" రెండో వాడు గుసగుసలాడాడు.

మొదటివాడు తన జేబులోంచి పిస్తోలు తీశాడు. రెండో జేబులోంచి పొడవుపాటి వైర్ తీశాడు. పిస్తోలు గొట్టంలో వైర్ చివర వున్న బటన్‌ని ఫిట్ చేశాడు.

హోటల్‌కి ఇవతల ట్రాన్స్‌ఫార్మర్. హోటల్‌లోకి వెళ్తోన్న ఎలక్ట్రికల్ తీగెలను ఇద్దరూ గుర్తించారు. మొదటివాడు వాటికి తిన్నగా వెళ్ళి నిలబడ్డాడు.

తీగెతోబాటు పిస్తోలును పైకి గురిపెట్టాడు. ట్రిగ్గర్ నొక్కాడు. తీగె పైకి ఎగిరింది. చేపలాగా డైవ్ చేసింది. హోటల్‌కి వెళుతోన్న రెండు తీగెలమీద అడ్డంగా పడింది.

తీగెలలో మెరుపులు. మరుక్షణంలో హోటలులో కరెంటు ఫెయిలయింది.

"క్విక్!" అన్నాడు రెండోవాడు.

మొదటివాడు అతడివద్దనుండి త్రాడు తీసుకున్నాడు. రెండో అంతస్తుకి పిట్ట గోడ వుంది. పిట్టగోడ అంచుకు తగిలేలాగా త్రాడు విసిరాడు. కొక్కెం పట్టుపట్టింది.

ఇద్దరూ పిట్టగోడ మీదకు చేరుకున్నారు.

తాళాలు పగులగొట్టారు.

మొదటివాడు పెన్ టార్చి తీశాడు.

ఇద్దరూ మ్యూజియం లోపలకు నడిచారు.

ప్రాచీన కళాఖండాలూ, చిత్తరువులూ, నాణాలూ, పూర్వకాలం ప్రసిద్ధ వ్యక్తులు వాడిన వస్తుసముదాయమూ లేఖలూ గాజు అద్దాల షో కేసులో అమర్చారు.

ఇద్దరూ లోపలి గదుల్లోకి నడిచారు.

ఖరీదయిన రాళ్ళూ, నగలూ, కలాలూ ఉన్నాయి.

"నార్త స్టార్ ఎక్కడ?" అడిగాడు మొదటివాడు.

"ఇక్కడే షో కేసులో చూశాను" రెండోవాడు వెదుకుతున్నాడు. చీకట్లో యిద్దరూ చెమటలు కక్కుతున్నారు.

పావుగంట ప్రయత్నం తర్వాత నార్త స్టార్ వజ్రం దొరికింది.

"ఇది నిజంగా ఆరు లక్షల రూపాయిల విలువ చేస్తుందా?"

"ఏమో! మన బాస్ మనకి ఆ సొమ్ము ఇస్తాడు. చాలదా?"

"ఇంత విలువైన వజ్రాన్ని ఇంత తక్కువ రక్షణ ఏర్పాట్లలో వుంచారా?"

"ఎక్కువ కట్టుదిట్టాలయితే లేనిపోని ప్రచారం అవుతుందనేమో!"

ఇద్దరూ నార్త స్టార్‌తో క్రిందకు దిగారు.

వాచ్ మన్‌లు అలాగే పడివున్నారు.

"రోజ్ లాండ్ హోటల్ పాడుపడి ఉండటం మన అదృష్టం!"

"అవును."

ఇద్దరూ శవాల మీదుగా వొంగి కత్తులు లాక్కున్నారు. శవాల యూనిఫారాలకు వాటిని తుడిచారు.

నడుస్తోనే డ్రయినేజీ హోల్ లోకి వాటిని విసిరేశారు.

చీకట్లోపడి నడుస్తోన్నారు.

రోడ్డుమీద కారు హెడ్ లైట్ల కాంతి పడుతోంది.

ఇద్దరూ పరుగెత్తారు.

రోజ్ లాండ్ ముందు ఒక టాక్సీ ఆగింది.

## 3

ఇల్యానోవ్ ప్రక్కమీద యిటు వో తిరిగాడు.

టెలిఫోన్ గణగణలాడుతోంది. ఇల్యానోవ్ చెయ్యి చాపి రిసీవర్ అందుకున్నాడు.

"ఇటీజ్ గ్రేట్ రష్యన్ సర్కస్!" అన్నాడు ఇల్యానోవ్.

"గుడ్ మార్నింగ్ మిస్టర్ ఇల్యానోవ్! శంకరరాజన్ని మాట్లాడుతోన్నాను."

"గుడ్ మార్నింగ్!"

"నిన్న మనం షూట్ చేసిన సీన్స్ బాగా వచ్చాయి."

"థాంక్యూ!"

"క్రీడాకారిణుల మొహాలు క్లోజప్ లో తీయాలి. మధ్యలో ఎడిట్ చేసి వాటిని పాచ్ వర్క్ చేయాలి!"

"రైట్! ఎప్పుడు అరేంజ్ చేయాలి?"

"ఇప్పుడే! టెంట్ బ్యాక్ గ్రౌండ్ లోనే!"

"ఒక గంటలో వాళ్ళు సిద్ధమవుతారు."

"థాంక్యూ!" అవతల క్లిక్ మన్నది.

ఇల్యానోవ్ రిసీవర్ను క్రెడిల్ చేశాడు.

సర్వెంట్ మెయిడ్ గుడారంలోకి పరుగెత్తుకు

వచ్చింది.

మెయిడ్ వైపు ప్రశ్నార్థకంగా చూశాడు ఇల్యానోవ్.

"అమ్మగారు గొడవ పెడుతున్నారు! తమరిని రమ్మని!" అంది ఆమె.

"ఏం? ఎందుకు?" అడిగాడు ఇల్యానోవ్.

"స్వీటీని ఎవరో దొంగిలించారు!"

"స్వీటీనా? పామునా? ముసలి పామునా? ఎందుకు?"

"ఏమో, నాకు ఏం తెలుస్తుంది? హెలీనా అమ్మగారు చాల గొడవ పెడుతున్నారు. టెంటు పీకి పందిరి వేస్తున్నారు!"

నైట్ గౌను సర్దుకుంటూ ఇల్యానోవ్ బయటకు నడిచాడు.

హెలీనా టెంటులో గందరగోళంగా వుంది. హెలీనా పాముల తొట్టెవద్ద నిలబడి వుంది. ఆమె తమ్ముడు ఫెర్డినాండ్‌తో బాటు ఇతర క్రీడాకారులూ, క్రీడాకారిణులూ తొట్టె చుట్టూ మూగారు.

ఇల్యానోవ్ వాళ్ళను తప్పించుకుంటూ తొట్టెవద్దకు చేరుకున్నాడు.

గాజు తొట్టె ఒక ప్రక్క పగిలివుంది. స్వీటీ తప్ప మిగతా పాములున్నాయి.

మట్టి నేలమీద జోడు ముద్రలు వున్నాయి. వాటిని ఎవరూ తొక్కకుండా ఫెర్డినాండ్ శ్రద్ధ తీసుకుంటున్నాడు.

"జాఫర్!" పిలిచాడు ఇల్యానోవ్.

జాఫర్ ముందుకు వచ్చాడు.

"కెమెరా తీసుకురా. ఈ జోడు ముద్రలు ఫోటో

తీద్దాం!" అన్నాడు ఫెర్డినాండ్.

జాఫర్ వురుకులు పరుగులమీద వెళ్ళిపోయాడు.

హెలీనా కళ్ళు ఎర్రగా వున్నాయి. బుగ్గలమీద కన్నీటి చారికలు! ఏడ్చి ఏడ్చి శ్వాస అందక రొప్పుతోంది.

"హెలీనా! ప్లీజ్ .... ఏడవక!" అన్నాడు ఇల్యానోవ్.

హెలీనా అతడి చేతిని విసిరికొట్టింది.

"ఇదంతా నీ పనే!" అరచింది హెలీనా.

"నా పనా?" తెల్లబోయాడు ఇల్యానోవ్.

"ఆ జోడు ముద్రలు చూడు! అవి నీ స్లిప్పర్స్వే!"

"నాన్సెన్స్! పామును నే నేం చేసుకుంటాను."

"చంపి ఎక్కడో పారవేసివుంటావు!"

"ఎందుకు?"

"సర్కస్లో వస్తోన్న లాభాలు నా పాములు తింటోన్నాయని!"

"మరి మిగత పాములు...."

"నా స్వీటీ పోయాక వాటిని నేనే వదిలిపెడతానని నీ నమ్మకం!"

"హెలీనా! నీకు మతిపోయింది!"

"అవును. మతిపోయింది. కాబట్టే నీ వెంటపడి వచ్చాను!"

"నీకు కావలసింది ఏడుప్! చేస్తాను. నన్ను అపరాధిగా చిత్రించితే నీకు ప్రయోజనం ఏమిటి?"

హెలీనా ఏడుపు ఆపింది.

"నా ట్రూపుముందు నన్ను ఫూల్ని చేయక! చర్మం వొలుస్తాను. తెలుసా?"

"మరి నీ జోడు ముద్ర ఎలా వచ్చింది?"

"నా జోళ్ళు వేసుకుని ఎవరో పామును దొంగి లించారు!"

"నా పాముతో వాళ్ళకేం పని?"

"మనిద్దరి సాన్నిహిత్యం పాడుచేయాలని!"

"అందువల్ల ఎవరికి లాభం?"

"ఆ విషయం తెలుసుకుందాం!"

హెలీనా కుతుటపడింది.

"గుడ్లుపెట్టే ప్లాస్టిక్ బుట్ట కూడా మాయమయింది!" అంది హెలీనా.

ఇల్యానోవ్ కళ్ళు మెరిశాయి. "అంటే పామును చంపరు!"

"స్వీటీ....నీవు ఎన్ని కష్టాలు?" హెలీనా తిరిగి ఏడ వడం మొదలుపెట్టింది.

జాఫర్ లోపలకు పరుగెత్తుకు వచ్చాడు. అతడి భుజాన కెమెరా వ్రేలాడుతోంది.

"మన కల్నల్ ది హాండ్ స్టిక్ పోయిందట సార్!" అన్నాడు జాఫర్.

హెలీనా కెవ్వుమన్నది. "హాండ్ స్టిక్ ఒక చివర J (జె)లాగా ఉంటుందికదా! దానితోనే నా స్వీటీని."

"గుడ్....నా జోళ్ళు వేసుకున్నారు. కల్నల్ గాడి స్టిక్ తో పామును ఒడిసిపట్టుకున్నారు. చిత్రం!"

టెంటులోకి గుసగుసలాడుతూ కల్నల్ వచ్చాడు.

కల్నల్ మూడు అడుగులకంటె ఎత్తు వుండడు. నలభై ఏళ్ళ వయసు. దాగని వయసు అతడి శరీరం మీద ముడతల్లో ప్రత్యక్షమవుతోంది. కండరాలూ ఎముకలూ సంకోచించినట్టూ, స్థలంలేక పైకి ఉబికినట్టూ అక్కడక్కడా బుడిపెలూ....బండ పెదిమలూ.గుబురు జుత్తూ.

"ఇల్యానోవ్ సాబ్! నా స్టిక్.... అదృష్టవంతమైన స్టిక్ పోయింది. ఎవడో దుర్మార్గుడు నా అదృష్టాన్ని నాశనం చేయాలని...." వెక్కుతున్నాడు కల్నల్.

"పోతేపోనిద్దూ .... వెధవ స్టిక్ .... మరొకటి కొని ఇస్తాసులే" అన్నాడు ఇల్యానోవ్.

"ఆః! వెధవ స్టిక్! నేను మీ సర్కస్‌లోకి రావడానికి అదే కారణం! ఇంతకాలమూ నాకు కాలం సౌఖ్యవంతంగా గడుస్తోందంటే ఆ స్టిక్ వల్లనే అని చెప్పుకోవాలి!"

"హాలీనాది అపురూపమైన పాము, నీ స్టిక్ ఎలా మాయమయాయో పరిశోధించమని ఎవరైనా నియోగిస్తాను!" అన్నాడు ఇల్యానోవ్.

"పాముకోసం, కర్రకోసం పరిశోధనా?" అన్నాడు జాఫర్.

కల్నల్ అతడిని కోపంగా చూశాడు.

"జాఫర్! శంకరరాజన్ గారి స్టూడియోకి వెళ్దాం పద! ఇంట్లో గోల! మనశ్శాంతి ఉండదు."

జాఫర్ తలాడించాడు.

జీపు బయలుదేరతీశాడు.

టి.నగర్ లో పార్క్ ఎదుట బంగళాముందు ఆగింది జీపు.

ఇల్యానోవ్ జీపు దిగాడు. జాఫర్ జీపులోనే ఉండిపోయాడు. ఇల్యానోవ్ బంగళాలోకి నడిచాడు.

శంకరరాజన్ బయలుదేరే మూడ్‌లో వున్నాడు.

ఇల్యానోవ్ అతడికి విషయం విడమరచి చెప్పాడు.

శంకరరాజన్ ఆశ్చర్యపోయాడు. "దొంగ మీ స్లిప్పర్స్‌లో బయలుదేరాడు. కల్నల్‌కి సంబంధించిన

కర్రతో పామును లాగాడు. గ్రుడ్లు పెట్టుకునే ప్లాస్టిక్ బుట్టముందు.... ఈ సంగతి చెప్పండి. బుట్టలో గ్రుడ్లు ఉన్నాయా?"

"ఆఁ! బుట్ట యెప్పుడూ ఉడక బెట్టిన గ్రుడ్లతో ఉంటుంది."

"ఎన్ని గ్రుడ్లు ఉంటాయి సాధారణంగా?"

"పదిహేనూ—ఇరవై...."

"రైట్....ఇప్పుడు మీ ఉద్దేశ్యం ఏమిటి?"

"పోలీస్ రిపోర్టు యిస్తే యెలా ఉంటుంది?"

"లేనిపోని రభస!"

"అయితే మీకు తెలిసిన ప్రయివేట్ ఇన్వెస్టిగేటింగ్ ఏజెన్సీ ఉంటే చెప్పండి."

"మీ దేశంలోలాగా ఇక్కడ ఏజన్సీలుండవు. వృత్తి పరంగా కొంతమంది డిటెక్టివ్ లుంటారు."

"పోనీ....వాళ్ళలో మీకు తెలిసిన డిటెక్టివ్ యెవరయినా సరే!"

శంకరరాజన్ తలూపి, విశాఖపట్నం ట్రంకాల్ బుక్ చేశాడు.

## 4

హోటల్ నయాగరా.

ప్లిమత్ కారు హోటల్ ముందు ఆగింది. కారులోంచి డిటెక్టివ్ శరీష్ దిగాడు. కారులో వున్న స్నేహితుడికి వీడ్కోలు చెప్పాడు. బూట్లు టకటకలాడించుకుంటూ హోటల్ ఆవరణలోకి నడిచాడు.

కౌంటర్ ముందు ఆగాడు.

"రూం నెంబర్ 30 కి మెసేజ్ ఉందా?" అడిగాడు శరీష్.

కౌంటర్ లోని వ్యక్తి కవర్ అందించాడు.

శంకరరాజన్ పంపిన కవర్. మెయిన్ హాలులో కూర్చొండి కవర్ విప్పాడు శిరీష్. రోజ్ కలర్ కాగితం బయట పడింది.

"మిస్టర్ శిరీష్,

నమస్తే. మీ కోసం వైజాగ్ ట్రంక్ కాల్ చేశాను. మీరు నయాగారా 30లో ఉన్నట్టు సునీత చెప్పారు. రూంకి వచ్చాను. మీరు లేరు. మీరు త్వరగా "గ్రేట్ రష్యన్ సర్కస్" గుడారానికి రావలసింది.

కృతజ్ఞతలతో

—శంకరరాజన్"

డిటెక్టివ్ శిరీష్ హోటల్ లోంచి బయటకు నడిచాడు. ఖాళీ టాక్సీ మాట్లాడుకున్నాడు.

అరగంటలో సర్కస్ గుడారంలో వున్నాడు. ఇల్యనోవ్ గుడారంలో శంకరరాజన్ దొరికాడు. శిరీష్‌కి సర్కస్ మనుషులు పరిచయమయారు.

"ఇల్యనోవ్ గారూ! శిరీష్‌గారికి విషయం చెప్పండి!" అన్నాడు శంకరరాజన్.

ఇల్యనోవ్ దొంగతనాల గురించి చెప్పాడు.

"చివరగా తెలిసిన దొంగతనం నాకు సంబంధించినదే."

"ఏమిటది?"

"పాగాకు పీల్చుకునే పైపు. పూర్తిగా దంతంతో చేసింది!"

"పైపు పోయినట్టు ఎప్పుడు తెలిసింది?"

"శంకరరాజన్ గారితో విషయం చెప్పాలని వెళ్లాను.

ఇద్దరమూ కలసి హోటల్ నయాగరాకి వచ్చాం. అక్కడ మీరు లేరు.... టెంటుకి వచ్చాం. బయటనుండి రాగానే నాకు పైపు పీల్చడం అలవాటు! పైపు పోయినట్లు నిర్ధారణ అయింది."

శరీఫ్ కళ్ళు మూసుకున్నాడు.

"ఈ దొంగతనాలలో ఒకదానికి మరోదానికీ పోలిక గానీ సంబంధంగానీ లేదు!"

ఇల్యనోవ్ దగ్గాడు. "కల్నల్ కి సంబంధించిన స్టిక్ తో పామును దొంగిలించి ఉండాలి" అన్నాడు.

"అది కేవలం మన వూహ. మరేరకంగా అయినా పాములను దొంగిలించవచ్చును. మిగతా దొంగతనాల్లాగా స్టిక్ ను కూడా దొంగిలించారు."

ఉన్నట్టుండి జాఫర్ కెవ్వుమన్నాడు.

"నా జేబురుమాలు!" అరిచాడు జాఫర్.

"జేబు రుమాలా? అదీ పోయిందా!" అన్నాడు ఇల్యనోవ్.

"అవును సార్! అది ఎప్పుడూ నా జేబులోనే వుంటుంది. ప్రదర్శన సమయంలో వ్రేలికి తగిలించుకుంటాను. అద్దాల జేబురుమాలు."

శరీఫ్ కళ్ళు విచిత్రంగా మెరిశాయి.

"శరీఫ్‌గారూ!" ఇల్యనోవ్ కంఠం పూడుకుపోయింది.

"నా ఆర్టిస్టులను మానసికంగా క్రుంగదీయాలని ఎవరో ఈ దొంగతనాలు చేశారు. నా సర్కస్ ట్రూపు ప్రపంచ వ్యాప్తంగా పేరు పొందినది. ఇలా యెన్నడూ యెక్కడా జరగలేదు" అన్నాడు ఇల్యనోవ్.

"ఈ దొంగతనాలు చేసింది పై వ్యక్తి కాదు. మీ ట్రూపులోని వ్యక్తే!" అన్నాడు శరీఫ్.

"అయినా సరే నేను శిక్షించక వదలను."

"నా జేబురుమాలు! అచ్చివచ్చిన జేబురుమాలు!" అన్నాడు జాఫర్.

అతడి గొంతు ఏడవడానికి సిద్ధంగా వుంది.

# 5

క్రైంబ్రాంచ్ ఇన్స్పెక్టర్ బాలన్ తలెత్తి చూశాడు.

డిటెక్టివ్ శరీఫ్ తన చేతిలో ఉన్న ఫోటోలను తదేకంగా చూస్తోన్నాడు.

మొదటి ఫోటోలో నేలమీద ఇద్దరి శవాలు పడి వున్నాయి. రెండో ఫోటోలో ఒక్కడి శవమూ, మూడో ఫోటోలో రెండో శవమూ క్లోజప్ లో ఉన్నాయి. గాయాలు స్పష్టంగా ఉన్నాయి.

"నారు స్టార్ వజ్రం ఏ మాత్రం విలువ చేస్తుంది?" అడిగాడు శరీఫ్.

"ముడివజ్రం. దాన్ని సానబెడితే కాని విలువ తెలియదు" అన్నాడు బాలన్.

"ముడిపజ్రం విలువ ఏ మాత్రం వుండవచ్చును?"

"నాలుగు లక్షల రూపాయిలలోపు."

"ఇంకేం! విలువయిన వజ్రమే! సానబెట్టాక యెనిమిది లక్షలకు పైగానే విలువచేస్తుంది!"

"కావచ్చును. వజ్రాన్ని దొంగిలించినవాళ్లు నేర్పరులు. యెలక్ట్రికల్ అలారం మ్రోగకుండా చేశారు. లాఘవంగా మేడ యెక్కారు. చేతులకు గ్లోవ్స్ వాడారు."

"శవాలను మొదటిసారిగా యెవరు చూశారు?"

"టాక్సీ డ్రయివర్. ఖాళీగా వెళుతోన్న టాక్సీలో వచ్చాడు. శవాలను చూచి దగ్గరలో వున్న పోలీస్

స్టేషన్‌లో రిపోర్టు చేశాడు."

"హత్యలకు ఉపయోగించిన ఆయుధంగానీ, ఆయుధాలుగానీ దొరికాయా?"

"లేదు."

"పోస్టుమార్టం రిపోర్టు ఏమిటి?"

"ఒకడికి రిబ్స్ కట్ అయి ఊపిరితిత్తి తెగింది. రెండోవాడికి రిబ్స్ కట్ అయి సరాసరి గుండె గాయపడింది. చాల నేర్పుగా ఆయుధాలు ప్రయోగించారు."

"నేర్పుగా.... అంటే."

"రిబ్స్ ప్రాంతంలో ఆయుధాలు తగిలి ప్రాణాలు పోవడం అరుదు. ప్రక్క యెముకలు చాలవరకు గుండెనూ ఊపిరితిత్తులనూ దెబ్బలనుండి రక్షిస్తాయి. పదునైన ఆయుధాలు! వాడిన వ్యక్తులు బలిష్ఠులయి వుండాలి. వాళ్ళ చేతుల్లో అంతులేని నేర్పు!"

శిరీష్ మెదడులో ఏదో దీపం మిణుకు మిణుకు మంటోంది.

"టాక్సీ డ్రయివర్‌ను పిలుస్తారా?"

"వై నాట్? పోలీస్ కమీషనర్ మీకు ఈ కేసు ఒప్పచెప్పారు. మీకు అన్నిరకాలా సహాకారం ఇవ్వడం నా బాధ్యత!" బాలన్ వెనక్కి వాలాడు. యెవరికో ఫోన్ చేశాడు.

అరగంటలో టాక్సీ డ్రయివర్ వచ్చాడు.

"శవాలను చూడగానే ఏం చేశావు?" అడిగాడు శిరీష్.

"భయపడలేదు సార్! నగరంలో ఏదో మూల ఏదో హత్యో మానభంగమో జరిగినట్టు రోజూ వింటున్నాను. పోలీసులకు తెలియపర్చాను" అన్నాడు టాక్సీ డ్రయివర్.

"ఆ సమయంలో రోజ్ లాండ్ హోటల్ ప్రాంతాల్లో యెవరినయినా చూశావా?"

"నా టాక్సీ ఆగకముందు హెడ్ లైట్స్ కాంతిలో యెవరో ఇద్దరు కనిపించారు సార్! మరుక్షణంలో వాళ్లు సందులోకి మాయమయ్యారు."

"వాళ్ళకీ హత్యలకీ సంబంధం ఉన్నట్లు నీకు తోచిందా?"

"చెప్పలేను సార్!"

"ఏం?"

"నా టాక్సీ ఆ ప్రాంతాలకు వచ్చేసరికి ఒకటి ముప్ఫయి దాటుతోంది. ఆ రోడ్డులో మూడు సినిమా హాళ్లున్నాయి. తమిళం పిక్చర్లు వదలిపెట్టే వేళ! హత్యలూ దొంగతనాలూ చేసేవాడు ఆ సమయం వరకూ కాచుకోడు."

"వాళ్ళను నువ్వు స్పష్టంగా చూడలేదు కదూ!"

"అవున్సార్! వెనకనుండి చూశాను. అదీ కొన్ని క్షణాలపాటే!"

"వాళ్ళు ఏ సందులోకి మాయమయ్యారు?"

"హోటల్ కి యెదుటి సందు!"

"మనం ఇద్దరమూ వెళ్దాం. చూపిస్తావా?"

"తప్పకుండా సార్!"

బాలన్ వద్ద సెలవు తీసుకుని ఇద్దరూ బయలుదేరారు. రోజ్ లాండ్ హోటల్ ముందు పోలీసు బందోబస్తువుంది.

మ్యూజియంను తాత్కాలికంగా మూసివేశారు.

మున్సిపల్ కార్పొరేషన్ వారి సహకారంతో తాత్కాలికంగా ఏర్పాటుచేసిన మ్యూజియం కావడంతో పెద్ద యిబ్బంది కలగలేదు.

సందు మొదట్లో టాక్సీ ఆపాడు డ్రయివర్.

సందులో టాక్సీ వెళ్ళదు. సందుకి అటూ ఇటూ వున్న యిళ్ళ గోడలు! పెద్దగా ఉపయోగంలేని సందు కావడంతో చెత్తాచెదారం పడివుంది.

డ్రయివరూ, శిరీష్ సందులో నడవసాగారు.

శిరీష్ ప్రక్కలకూ క్రిందకూ చూడసాగాడు. ఇద్దరూ సందుచివరకు వచ్చారు.

శిరీష్ కళ్ళు నేలమీద అతుక్కుపోయాయి.

నేలమీద అంటుకుపోయిన గుడ్డముక్క. దానిమీద చింతపిక్క రంగు చుక్కలు మూడు.

శిరీష్ వొంగి చూశాడు. సందేహంలేదు. అవి రక్తం చుక్కలు. గుడ్డముక్కను పదిలంగా కట్ చేశాడు శిరీష్.

దారి ప్రక్కగా దొరికిన సిగరెట్ పెట్టెలో గుడ్డముక్కను పదిలపరిచాడు.

ఇద్దరూ నడవసాగారు.

రోడ్డుకి అటూయిటూ నియోన్ లైట్ల స్తంభాలు.

శిరీష్ దూరంగా చూసి వులిక్కిపడ్డాడు.

చారల చారల సర్కస్ టెంట్!

"టాక్సీని అటు రోడ్లోంచి నడిపించు. నే నా సర్కస్ గుడారంలో ఉంటాను" అన్నాడు శిరీష్.

డ్రయివర్ తలూపి తిరిగి సందులోకి తిరిగాడు.

శిరీష్ రోడ్డుమీద నడిచి సర్కస్ గ్రౌండ్‌లోకి దిగాడు.

గుడారంలో ప్రవేశిస్తూ వాచీ చూసుకున్నాడు.

ఉదయం పదిగంటలు.

రింగులో కొంతమంది ఆర్టిస్టులు ప్రాక్టీసు చేసుకుంటున్నారు. మూడు సీసాలమీద నాలుగు కాళ్ళ

స్టూలు నిలబెట్టారు. పదేళ్ళమ్మాయి స్టూలుమీద నిలబడింది. ఆ అమ్మాయి చేతిలో పొడవుపాటి కర్రరాట వున్నది. ఆ రాట చివర అయిదేళ్ళ అబ్బాయి విలాసంగా కూర్చున్నాడు.

స్టూలుకి అవతలగా అజయ్ నిలబడి వున్నాడు. అతడి భుజంమీద ఆరడుగుల హెండాలియం సిలిండర్ వుంది. దాని చివర అజయ్ తలక్రిందులుగా వ్రేలాడి విన్యాసాలు చేస్తున్నాడు. బాలెన్స్ తప్పకుండా విన్యాసాలకు అనుగుణంగా అజయ్ నేలమీద అడుగులు వేస్తున్నాడు.

జాఫర్ వాళ్ళ ఫీట్సును పరిశీలిస్తూ అటూ యిటూ కదులుతోన్నాడు.

శరీఫ్ రింగును సమీపించాడు.

అజయ్ పైకి చూస్తున్నాడు. విజయ్ తలక్రిందులుగా వున్న వాడల్లా నిటారుగా కదిలాడు.

సిలిండర్ బాలెన్స్ తప్పింది.

'దడ్ డ్....' సిలిండర్ ప్రక్కవాటుగా కార్పెట్ మీద పడింది. విజయ్ గావుకేక పెట్టి సిలిండర్ మీద పడ్డాడు.

అజయ్ తేరుకున్నాడు. చటుక్కున వొంగి విజయ్‌ను లేవదీశాడు.

ఇద్దరూ సిలిండర్‌ను మోసుకుంటూ లోపలకు వెళ్ళిపోయారు.

శరీఫ్ కదిలాడు.

డ్రయివర్ గుడారం లోపలకు వచ్చాడు.

ఇద్దరూ కలసి ఇల్యనోవ్ గుడారం వైపు నడిచారు.

ఇల్యనోవ్ తలపట్టుకు కూర్చున్నాడు.

శరీఫ్‌ను చూడగానే తేరుకున్నవాడల్లే చూశాడు.

"శరీఫ్‌గారూ! ఈ దొంగతనాలకు అంతం లేకపోతే నేను కొత్త ఆర్టిస్టులను తర్ఫీదు ఇచ్చి చేర్చుకోవలసిందే!" అన్నాడు ఇల్యానోవ్.

శరీఫ్ తాను ఓ కుర్చీలో కూర్చుంటూ డ్రయివర్‌కి సీటు చూపించాడు.

"కొత్తగా దొంగతనాలు ఏం జరిగాయి?" అడిగాడు శరీఫ్.

"ఫెర్డినాండ్‌ది 'వైట్ హార్స్ విస్కీ' పోయింది"

ఇల్యానోవ్ మొహంలో చెమటలు.

శరీఫ్ నవ్వాపోయి ఆగాడు.

"ఎత్తుకుపోయిన కోడిగ్రుడ్లు విస్కీలో నంజుకున్నారేమో!"

"ప్లీజ్ .... టేకిట్ సీరియస్ .... ఆ గ్రుడ్లు స్వీటీ కోసం అని హెలీనా సరిపెట్టుకుంటోంది."

శరీఫ్ మెల్లగా నవ్వాడు.

"మీకు ప్రత్యర్థి సర్కస్ బృందం ఏదయినా వుందా?" అడిగాడు శరీఫ్.

"వుంది. కాని ఆ బృందం తాలూకు వాళ్ళంతా కెనడాలో పర్యటిస్తున్నారు."

"మీ బృందంలో వున్న వాళ్ళలో ఎవరయినా ఆ బృందం తాలూకు వాళ్ళు వున్నారేమో!"

"లేరండీ. అందరినీ ఎంచే తీసుకున్నాము!"

టెలిఫోన్ గణగణలాడింది.

ఇల్యానోవ్ రిసీవర్ అందుకున్నాడు.

టెలిఫోన్‌లో వినిపిస్తోంది విని ఇల్యానోవ్ మొహంలో రంగులు మారసాగాయి.

# 6

శంకరరాజన్ కెమెరా ముసుగులోంచి యివతలకు వచ్చాడు. కెమెరా ముందుకు చూశాడు.

అటూ యిటూ రాడ్స్ పాతి మధ్యలో వైర్ కట్టాడు. ఫరీదున్నీసా వైర్ కింద నిలబడింది. ఆమె భర్త కృపారావు అటుప్రక్క నిలబడి ఏర్పాట్లు పరిశీలించసాగాడు.

ఫరీదున్నీసాను సమీపించాడు శంకరరాజన్.

తాను షూట్ చేయబోయే దృశ్యాన్ని ఆమెకు వివరించసాగాడు శంకరరాజన్. ఆమె తనకు తెలియని విషయాన్ని మరల మరల అడిగి తెలుసుకుంటోంది.

"రెడీ...." అడిగాడు శంకరరాజన్.

"క్లోజప్ షాట్స్ తరువాత తీస్తారా?" అడిగాడు కృపారావు.

"ఫరీద్ సరైన మూడ్‌లో లేదు. క్లోజప్‌లో తర్వాత తీస్తాను."

కృపారావు భార్యవైపు చూశాడు.

ఫరీద్ మొహంలో కళ తగ్గివుంది.

"అలా వున్నావేం?" అడిగాడు కృపారావు.

ఫరీద్ మాట్లాడకుండా నిచ్చెన ఎక్కింది. తీగకు ఇవతలగా వున్న చెక్కమీద నిలబడింది. కృపారావు ఆమెకు చిన్న గొడుగు అందించాడు.

"త్రీగ మధ్యకు వెళ్ళాక గొడుగు విప్పు!" అన్నాడు శంకరరాజన్.

ఫరీద్ తలూపింది.

శంకరరాజన్ తన అసిస్టెంట్ వైపు చూశాడు. అసిస్టెంటు కెమెరాను సమీపించాడు. వ్యూఫైండర్‌లోంచి

ఫరీద్‌ను చూశాడు.

తల పైకెత్తాడు. తృప్తిగా చూశాడు.

శంకరరాజన్ కదిలాడు. వ్యూఫైండర్‌లోంచి చూశాడు.

అసిస్టెంట్ క్లాప్ కొట్టాడు.

"రెడీ!" అరిచాడు శంకరరాజన్.

ఫరీద్ తీగెలమీద నడవసాగింది. ఆమె చేతిలో గొడుగు వ్రేలాడుతోంది.

తీగె మధ్యకు వెళ్ళింది ఫరీద్.

గొడుగును పైకెత్తి బటన్ నొక్కింది. గొడుగు పర్‌మంటూ వెనక్కి విరుచుకుపోయింది.

ఫరీద్ వణికింది. గొడుగు విరుచుకుపోయిన వూపులో బాలన్స్ తప్పింది. కెవ్వున అరచి క్రిందకు పడిపోయింది.

శంకరరాజన్, కృపారావూ, అసిస్టెంటూ ఆమె వద్దకు పరుగెత్తారు.

ఫరీద్‌కి స్పృహ తప్పింది.

శంకరరాజన్ వెంటనే డాక్టర్‌కీ, పనిలో పనిగా ఇల్యనోవ్‌కీ ఫోన్ చేశాడు.

డాక్టర్ పరిచర్యలయాక ఫరీద్‌కి స్పృహ వచ్చింది.

ఇల్యనోవ్ తనవెంట డిటెక్టివ్ శిరీష్‌ను తీసుకువచ్చాడు.

"గొడుగును ఎవరు పాడుచేశారు?" అడిగాడు శిరీష్.

"తెలియదు" అంది ఫరీద్.

"అసలు ఉదయంనుండీ ఈమె మొహంలో 'మూడ్' లేదు" అన్నాడు శంకరరాజన్.

ఫరీద్ పేలవంగా చూసింది.

"రెండువందల రూపాయలున్న మనీపర్స్ పోయింది" అంది ఫరీద్.

"రెండువందల రూపాయలా? ఎవరు తీశారు?"

"ఏమో! తీసుకున్నవాళ్ళు పర్స్—పట్టి పర్స్ ఇచ్చినా చాలును!"

"పర్స్ నీకు అచ్చి వచ్చిందా?" శిరీష్ చురుకుగా చూశాడు.

"అవును."

"ఏం పర్స్ అది?"

"పాము చర్మంతో చేసింది! నాకు మా మదర్ చచ్చిపోతూ యిచ్చిన పర్స్ అది!"

శిరీష్ పెదిమలు బిగించాడు.

దొంగిలించిన వారికి తాము దొంగిలించిన వస్తువులు విలువైనవి కావు. కాని పోగొట్టుకున్న వాళ్ళకి మాత్రం అవి అపురూపం! అయినా వస్తువులు పోయినంతమాత్రాన వాళ్ళు తమ ప్రదర్శనలో భంగపడటం ఏమిటి? ఆర్టిస్టులు నటిస్తున్నారా? అయితే వాళ్ళలో బాటే వున్న దొంగ(లూ) నటిస్తున్నట్టనుకోవాలా?

ఈ చిన్న దొంగతనాలవలన లాభం ఏమిటి?

శిరీష్ మెదడులో చురుక్కుమంది. ఈ అప్రధానమైన దొంగతనాల మధ్య ఏదో ముఖ్యమైన దొంగతనం వుంది.

నారు స్టార్!

ఇన్స్పెక్టర్ బాలన్ మాటలు చెవుల్లో గింగురు మంటున్నాయి.

ఆయుధాలను లాఘవంగా వుపయోగించి వాచ్ మన్‌లను హత్యచేశారు.

శిరీష్ వులిక్కిపడ్డాడు.

సర్కస్‌లో కత్తులు విసిరేవాడు ఈ నేరంలో వున్నాడేమో....

ఇల్యానోవ్ వైపు సాభిప్రాయంగా చూశాడు.

"మీ సర్కస్‌లో కత్తులు విసిరే ఫీటు వుందా?" అడిగాడు శిరీష్.

"లేదు."

"ఏం."

"అతడు ఒక ప్రమాదంలో చనిపోయాడు. అటు తర్వాత నాకు తగిన ఆర్టిస్టు దొరకలేదు."

"అతడు వాడిన కత్తులున్నాయా?"

"వుండాలి. స్టోర్ రూంలో వుంటాయి."

"ఒకసారి వాటిని వెతికించండి."

"అలాగే.... కాని.... నేను మరల ఇదే ఆర్టిస్టులతో మరో నగరంలో ప్రదర్శనలు యివ్వగలనా!" అడిగాడు ఇల్యానోవ్.

"కరెక్టు.... మీ ఆర్టిస్టులతో నేను స్టాక్ షాట్స్ తీయగలనా?" నివ్వెరపోయాడు శంకరరాజన్.

"సర్కస్ గుడారాలు వెతికించారా? పోయిన వస్తువులు దొరకవచ్చు" అన్నాడు శిరీష్.

"అంగుళం అంగుళం గాలించాం. ఫలితం లేక పోయింది."

శిరీష్ తల విదిలించాడు.

వస్తువులు దొంగిలించింది సర్కస్ మనుషులు!

నార్త్ స్టార్‌ను అపహరించిందీ వాళ్లే!

వాచ్‌మన్‌లను చంపింది వాళ్ళే!!

అయితే వాళ్ళు వస్తువులను దొంగిలించి ఎక్కడ దాచినట్టు? దొంగలు సర్కస్‌ను వదలిపెట్టి వెళ్ళిపోలేదు,

అందుకు సాక్ష్యంగానే ఇంకా దొంగతనాలు జరుగుతోనే వున్నాయి.

## 7

శంకరరాజన్ స్టూడియోలో ప్రవేశించాడు. స్టోర్ రూంలో అడుగు పెట్టాడు. అసిస్టెంట్ తెల్లమొహంవేసి చూస్తున్నాడు.

"ఫిలింబాక్స్ తీసుకురమ్మంటే ఏం చేస్తున్నావు?" గద్దించాడు శంకరరాజన్.

అసిస్టెంట్ భయపడ్డట్టు చూస్తున్నాడు. "సార్! ఈ అరలోనే ముడి ఫిలిం వున్న బాక్స్ పెట్టాను. కనిపించడం లేదు!" అన్నాడు.

శంకరరాజన్ నుదురు చిట్లించాడు. "ఫిలిం కరగి మాయమయిందా? నాన్సెన్స్! గుర్తు తెచ్చుకో...."

"లేదు సార్! సర్కస్ సీన్స్ షూట్ చేయడానికి కేటాయించిన ఫిలిం ఇక్కడే అరలో వుంచాను!"

"నువు తప్ప ఎవరూ ఈ స్టోర్ రూంలో ప్రవేశించరు!"

"సార్! నా గురించి తమకి బాగా తెలుసు సార్!"

"ఫిలిం ఎంత ఖరీదయిందో తెలుసా?"

"నిజమే సార్! నాదో అనుమానం! సర్కస్‌లో జరుగుతోన్న దొంగతనాల్లాగా మన స్టూడియోలో కూడా...."

"నాన్సెన్స్ .... వాళ్ళ సర్కస్‌లో వాళ్ళు ఏదో ఏడ్చుకుంటారు!"

"వాళ్ళు నటించే సీన్స్ మనం తీస్తున్నాం కదా సార్!"

తేలుకుట్టినవాడల్లే చూశాడు శంకరరాజన్. "అవును,

ఈ సాయంకాలం హిందాలియం సిలిండర్ మీద అజయ్‌విజయ్‌ల ఫీట్స్ తీయాలనుకున్నాను. ఊయలమీద సీన్స్ కూడా ఈ రాత్రికి తీయమన్నాడు ఇల్యనోవ్."

అసిస్టెంట్ మాట్లాడలేదు.

"నయాగరా హోటల్‌కి ఫోన్ చేయి. డిటెక్టివ్ శరీష్ ఉన్నారేమో తెలుసుకో" అన్నాడు శంకరరాజన్.

అసిస్టెంట్ బయటికి నడిచాడు.

రెండు నిమిషాలలో తిరిగి గదిలోకి వచ్చాడు.

"ఆయన రష్యన్ సర్కస్ గుడారంలో ఉన్నారట సార్!"

"ఆల్ రైట్! కారు బయలుదేరతీయి!"

వాహిరా స్టూడియో పోర్టికోలోంచి కారు బయలు దేరింది.

సర్కస్ గుడారంలో కలకలంగా వుంది. శంకర రాజన్ అయోమయంగా చూస్తున్నాడు.

శంకరరాజన్ అటుగా పోతోన్న కల్నల్ ను ఆపాడు.

"సిలిండరుమీద ఫీటు చేస్తాడు....విజయ్ అని అతడి ఇత్తడి బొత్తాలు పోయాయి!" అన్నాడు మరుగుజ్జు కల్నల్.

"ఇత్తడి బొత్తాలా? బంగారపు బొత్తాలు పోయినట్టు" విసుక్కున్నాడు శంకరరాజన్.

"వాటితోనే అతడు సిలిండర్ మీద మూడువందల ప్రదర్శన లిచ్చాడట! ఇకమీదట సర్కస్‌లో పని చేయడట!"

"నిజమా!"

"ఆఁ! లోపలకు రండి. మీకే తెలుస్తుంది" కల్నల్

దారితీశాడు.

ఇల్యానోవ్ గదిలో శిరీష్, హెలీనా విజయ్ వున్నారు. శంకరరాజన్‌ని చూచి ముగ్గురూ విష్ చేశారు. ఇల్యానోవ్ తన తలకు పట్టు వేసుకున్నాడు.

"ఈ దొంగతనాలతో ఆయనకి తల వేడెక్కి పోతోంది" అంది హెలీనా.

"హెలీనా! మీరు రండి. స్టోర్ రూంలో కత్తులు వెతుకుదాం!" అన్నాడు శిరీష్.

హెలీనా బయలుదేరింది.

శిరీష్ ఆమె వెనుక స్టోర్ రూంలో ప్రవేశించాడు.

స్టోర్ రూం చిన్న సైజు ప్రపంచంలాగా వుంది. కార్పెట్లూ, నిచ్చెనలూ, ఊయలగా వాడే బొమ్మలూ, బార్, గుండ్రటి రాటలూ, చిరిగిన డేరా గుడ్డలూ, డబ్బాలూ, సీసాలూ....

అక్కడ కాని సామాను అంటూ లేదు.

డేరాకి ప్రక్కగా ఇనుప రేకుల పెట్టెలు ఉన్నాయి. హెలీనా ఆ పెట్టెలను ఎంచుతూ ఒక పెట్టె తెరిచింది. ఆ పెట్టెనిండా డజన్లకొద్దీ కత్తులున్నాయి.

హెలీనా లెక్కపెట్టింది. ఒకటి రెండుసార్లు లెక్క పెట్టాక ఆమె నుదురు ముడతలు పడింది.

"రెండు కత్తులు తక్కువయ్యాయి. నన్ను చెక్కకు ఆన్చి నిలబెట్టే యూసఫ్ కత్తులు విసిరేవాడు. బెంగ ళూరులో చచ్చిపోయాడు" అంది హెలీనా.

"రెండు కత్తులు తక్కువయ్యాయి" శిరీష్ గొణిగాడు.

హెలీనాను అడిగి ఒక కత్తి తీసుకున్నాడు.

హెలీనా పెట్టె సర్దింది. అక్కడనుండి కదల బోయింది. నేలమీద ఉబ్బెత్తుగా తగిలింది. కాలు జరిపి

చూసింది.

నేలమీద మట్టి త్రవ్వి కప్పిపెట్టినట్టుగా వుంది.

శిరీష్ ఆమె చూపులు అర్థం చేసుకున్నాడు. దగ్గరలో ఉన్న గునపం అందుకున్నాడు. నేల త్రవ్వసాగాడు. అతడు త్రవ్వుతోండగా అక్కడకు అజయ్, విజయ్, ఇల్యనోవ్, శంకరరాజన్, అతడి అసిస్టెంటూ వచ్చారు.

అందరూ నోరావులించి శిరీష్‌ను చూడసాగారు.

శిరీష్ త్రవ్విన గోతిలోంచి చెక్కపెట్టె బయట పడింది.

"అరె! ఆ పెట్టె నాది!" అరిచాడు ఇల్యనోవ్.

"పెట్టెకు తాళం పెట్టిలేదు" అన్నాడు అజయ్.

డిటెక్టివ్ శిరీష్ పెట్టెమూత ఎత్తిపట్టాడు.

అందరూ తెల్లబోయి చూడసాగారు. పెట్టెలో రకరకాల వస్తువులున్నాయి.

వైట్ హార్స్ బ్రాందీసీసా, ఇత్తడి బటన్సూ హాండ్ స్టిక్, అద్దాలు కుట్టిన జేబు రుమాలు, పాము చర్మంతో కుట్టిన పర్సూ, ముడి ఫిలిం బాక్సూ, దంతంలో చేసిన పెన్నూ, గ్రుడ్లు పెట్టుకునే ప్లాస్టిక్ బుట్టా పోయిన వస్తువులు అన్నీ వున్నాయి, పాము తప్ప.

హెలీనా పిచ్చెత్తినట్టుగా వస్తువులను తిరగవేస్తోంది.

"స్వీటీ.... నా స్వీటీ...." ఏడుస్తోంది. "అందరికీ పోయిన వస్తువులు దొరికాయి. నాది.... నా ప్రాణం.... నా స్వీటీ...."

నిట్టూర్చి ఒక్కొక్కరు స్టోర్ రూంలోంచి జారుకుంటున్నారు.

శిరీష్ బయటకు వచ్చి నిలబడ్డాడు.

హీలియం సిలిండర్ మోసుకుంటూ అజయ్

వెళ్తున్నాడు. విజయ్ సణుగుతూ నడుస్తున్నాడు. సిలిండర్ బరువుకు వంగి కూడా వంగలేనట్టుగా నడుస్తున్నాడు అజయ్.

శిరీష్ కణతలు రుద్దుకున్నాడు.

ఆలోచనలు కొసలు అందినట్టే అంది మాయమవుతోన్నాయి.

హెలీనా అతడిని సమీపించింది.

"అందరివీ అన్ని వస్తువులు దొరికాయి. నా స్వీటీ తప్ప....ప్లీజ్ ....శిరీష్‌గారూ! నేను పిడిగా ఫీజు యిచ్చుకుంటాను. నా స్వీటీని ప్రాణాలతో నాకు ఇవ్వగలరా?"

శిరీష్ ఆమెను జాలిగా చూశాడు.

పాము మాయమై నాలుగు రోజులయింది. దాన్ని ఇంతకాలం ప్రాణాలతో వుంచరు. పైగా మాయమైన వస్తువులు నేలలో కప్పిపెట్టి దొరికాయి. పెట్టెపళ్ళంగా ఎక్కడయినా బాహాటంగానే వదలవచ్చును వాళ్ళు. అయినా నేలలో ఎందుకు దాచినట్టు?

నేలలోనే దాచినట్టు తెలిసేలాగా ఎందుకు చేశారు?

పామును కూడా అలాగే భూమి అడుగున....

హెలీనా భుజంమీద చెయ్యివేశాడు శిరీష్. అతడి కళ్ళు ఎర్రబడివున్నాయి.

# 8

ఫోకస్ లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. వాటి కాంతి రింగులో పడుతోంది. అన్ని కోణాల్లోంచి కాంతి పడుతోండటంతో రింగు పట్టపగల్లాగా వుంది.

"ప్రదర్శన అత్యద్భుతంగా వుంది!" అన్నాడు పోలీస్ కమీషనర్. హెలీనా, ఇల్యనోవ్, శిరీష్, పోలీస్ కమీషనర్, ఇతర పోలీస్ వున్నతాధికారులు రింగుకు

దగ్గరగా కూర్చుండి వున్నారు. దాదాపు నాలుగురోజులు డిస్టర్బన్స్ తర్వాత ప్రదర్శన కావడంతో ఆర్టిస్టులలో కొత్త ఉత్సాహం వెల్లుబుకుతోంది.

హారిజాంటల్ బార్ మీద పన్నెండు మంది కళాకారులు ఒకేసారి ఫీట్సు చేశారు.

తర్వాత జంతువులు రావడం మొదలుపెట్టాయి. ఏనుగు కొబ్బరికాయ కొట్టింది. హైందవుల ఆచారంలాగా పూజ చేసింది.

ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు.

గుర్రాలూ, ఒంటెలూ, చారల గాడిదలూ రింగులో తెలివి వున్న మనుషుల మాదిరిగా ప్రవర్తించాయి.

రెండు గుర్రాల మీద ఒక కళాకారిణి స్వారీ చేసింది. ఆమె తలమీద పెట్టుకున్న మంచినీళ్ళ గ్లాసులోంచి ఒక్క నీటిచుక్క కూడా తొణకలేదు.

అజయ్ విజయ్‌లు హిండాలియం సిలిండర్ ను మోసుకువచ్చారు.

డిటెక్టివ్ శరీష్ సుదురు చిట్లించాడు.

ప్రదర్శనలో ఎక్కడో తేడా వుంది. ఏమిటా తేడా?

తాను చాలా సర్కసు బృందాలను చూశాడు. వాటికీ ఈ రష్యన్ సర్కస్ బృందానికీ వున్న తేడా ఏమిటి?

అంత ఎందుకు?

ఇంతవరకూ జరిగిన అద్భుతమైన ఫీట్లు ఒకదారి....

అజయ్ విజయ్‌లు ఒక్కసారిగా హిండాలియం సిలిండర్‌ను నేలమీద పెట్టారు. అభివాదపూర్వకంగా ముందుకు ఒంగారు.

తర్వాత అజయ్‌తో విజయ్ కలసి సిలిండర్ అజయ్

భుజంమీద పెట్టడానికి సహకరించాడు.

ఆరడుగుల ఎత్తులో వున్న సిలిండర్ చిద్విలాసంగా ప్రేక్షకులను పలకరిస్తోంది. ఫోకస్ లైట్ల కాంతి తెల్లటి లోహం మీద పడుతోంది. సిలిండర్ బయట గోడ తళ తళలాడుతోంది.

అజయ్ బాలన్స్ కాచుకుంటూనే మోకాలు వంచాడు.

చెట్టు ఎక్కేవాడల్లే విజయ్ అతడి మోకాలిమీద కాలువేశాడు. రెండో కాలు భుజంమీద వేసి మొదటి కాలు తీసి గాల్లో ఉంచాడు. తర్వాత గాల్లో ఉంచిన కాలు అజయ్ తలమీద పెట్టాడు.

అజయ్ తన రెండు చేతులతో సిలిండర్‌ను పట్టుకున్నాడు.

విజయ్ ఒడుపుగా సిలిండర్‌ను పట్టుకున్నాడు. పైకి జంప్ చేశాడు. ప్రేక్షకులు కళ్ళుమూసి తెరిచేలోగా విజయ్ సిలిండర్ మీద నిలబడ్డాడు. అజయ్ నిశ్చింతగా బాలెన్స్ కాచుకుంటున్నాడు. నాలుగు అంగుళాలు వ్యాసం వున్న సిలిండర్! ప్రేక్షకులు ఊపిరి బిగబెట్టి చూస్తున్నారు.

విజయ్ మెల్లగా వొంగాడు. ప్రతి కదలికలోనూ గరిమనాభి తిన్నగా సిలిండర్ నిలువు కోతకు మధ్యగా పడేలాగా జాగ్రత్తపడుతున్నాడు.

సిలిండర్‌ను రెండు చేతులతో వదలి కాళ్ళతో లంకె వేశాడు విజయ్. నిరాధారంగా దానికి వ్రేలాడుతున్నాడు.

సిలిండర్‌నూ, విజయ్‌నూ చూస్తో అటూ ఇటూ అడుగులు వేస్తున్నాడు అజయ్.

విజయ్ తలక్రిందులుగా సిలిండర్ మీద ప్రాకుతున్నాడు.

"హెలీనా!" పిలిచాడు శిరీష్.

హెలీనా తలెత్తి చూసింది.

అజయ్ రింగులో చుట్టూ తిరుగుతున్నాడు.

"నువు ఆట చూడటం లేదా?"

"లేదు!"

"స్వీటీ ఎంత లావు ఉంటుంది?"

"పొడవు అయిదడుగుల పదకొండంగుళాలు. పొట్ట దగ్గర అడ్డ కొలత మూడున్నర అంగుళాలు!"

"రోజుకు ఎన్ని గ్రుడ్లు తినేది."

"పదిహేనూ — ఇరవై."

"తర్వాత గ్రుడ్లు మాయమవడం జరిగిందా?"

"లేదు!"

"స్వీటీకి ఏమైందో.... కాని ఏం జరిగినా సహించగలవా?"

హెలీనా చిగురుటాకులాగా వణుకుతోంది.

"ఏమయింది?" అడిగింది.

"అం!" కెవ్వుమన్నాడు విజయ్.

శిరీష్ తలెత్తి చూశాడు. సిలిండర్ మీద విజయ్ పట్టు సడలింది. తలక్రిందులుగా జారి అజయ్ మీద పడ్డాడు. బుర్రలు రెండూ ఖంగుమన్నాయి. విజయ్ క్రిందకు జారాడు.

బ్యాలెన్స్ తప్పింది సిలిండర్. గాల్లోకి వాలింది.

"దఢ్ఢ్ ...."

శిరీష్ మస్తిష్కంమీద విద్యుద్ఘాతంలాగా తగిలింది.

సిలిండర్ దఢ్ఢ్ మంటోంది. ఎందుకు?

డిటెక్టివ్ శిరీష్ చటుక్కున రింగులోకి దూకాడు.

విజయ్ క్రిందపడ్డవాడు చటుక్కున లేచాడు. సిలిండర్ ఈడ్చుతూ లోపలకు పరుగెత్తపోయాడు. అజయ్ లేచి సిలిండర్ రెండో చివర పట్టుకోబోయాడు.

శిరీష్ ఎగిరి అజయ్ డొక్కలో తన్నాడు.

అజయ్ ఎగిరి అవతలకు పడ్డాడు.

విజయ్ వెనక్కి చూడదల్చుకోలేదు.

ప్రేక్షకులు హాహాకారాలు చేస్తున్నారు.

శిరీష్ పరుగెత్తుకు వెళ్ళి విజయ్‌ను మెడ ఒడిసి పట్టుకున్నాడు. అప్పటికి అజయ్ లేచి శిరీష్ మీదకు దూకాడు.

పోలీస్ కమీషనర్, ఇల్యానోవ్ రింగులోకి వెళ్ళారు. బాలన్ విజిల్ వూదాడు. పోలీసులు రింగులోకి పరుగెత్తారు.

అప్పటికి శిరీష్ వాళ్ళిద్దరినీ మెడలు వొంచి తలలు ఢీకొట్టాడు.

ఇద్దరూ నేలమీద కూర్చుండిపోయారు.

రింగులో సిలిండర్ దొర్లుతోంది.

"వాచ్‌మన్‌లను చంపింది వీళ్ళే!" అరిచాడు శిరీష్.

ఇల్యానోవ్ నిర్ఘాంతపోయాడు.

"అయితే నారు స్టార్ వీళ్ళ దగ్గరే దొరకాలి!" పోలీస్ కమీషనర్ వాళ్ళను సమీపించాడు.

## 9

రింగులో ఏం జరుగుతోందో ప్రేక్షకులకు అంతు పట్టడం లేదు.

డిటెక్టివ్ శిరీష్ సిలిండర్‌ను సమీపించాడు. రెండు చేతులతో ఎత్తాడు.

"హిందాలియం సిలిండర్! అది అంత బరువు ఉండకూడదు!" అరిచాడు ఇల్యనోవ్.

ప్రేక్షకులు గ్యాలరీలోంచి లేవసాగారు. అలజడిగా దిగుతున్నారు.

పోలీస్ కమీషనర్ పిస్తోలు తీశాడు. గాల్లోకి ప్రేల్చాడు. ఎక్కడి ప్రేక్షకులు అక్కడ బిగ్గర బిగుసుకుపోయారు. అందరినీ నిశ్శబ్దంగా కూర్చోమని ఆజ్ఞాపించాడు.

రింగులో చెడు వాసనా, కర్పూరపు వుండల వాసనా వ్యాపించాయి.

శరీఫ్ సిలిండర్‌ను మధ్యలో పట్టుకుని ఏటవాలుగా పెట్టాడు. సిలిండర్‌లోంచి మెల్లగా పాము వస్తోంది.

"స్వీటీ...." అరుస్తోంది హెలీనా.

ఆమె పరుగెత్తుకు వచ్చేసరికి పాము శరీరం రింగులో వుంది. శవం ఎక్కడపడితే అక్కడ చెడిపోయివుంది.

"మై గుడ్ నెస్! పామును సిలిండర్‌లో దాచారు."

అజయ్ విజయ్‌లకు కలిపి అరదండాలు తొడిగాడు పోలీస్ కమీషనర్.

"నారు స్టార్ వజ్రం ఎక్కడ దాచార్రా రాస్కెల్స్!" పోలీస్ కమీషనర్ తమిళంలో తిడుతోన్నాడు.

శరీఫ్ ఆయన వైపు నవ్వుతో చూశాడు.

"నేను చెబుతాను!" అన్నాడు శరీఫ్.

బలంగా శ్వాస పీల్చుకుని, "పాములకు అమోఘమైన జీర్ణశక్తి ఉంటుంది. ఆ విషయం వీళ్ళు తెలుసుకున్నారు. సర్కస్ కత్తులు సంపాదించారు. మ్యూజియంలో నారు స్టార్‌ను దొంగిలించాలనుకున్నారు. వాచ్‌మన్‌లను

చంపారు.

వాళ్ళ శవాలు పడివున్న తీరూ, బలమైన గాయాలు తగిలిన తీరూ విడ్డూరంగా వున్నాయి. అంత నేర్పుగా ఆయుధాలను ప్రయోగించాలంటే ఏళ్ళ తరబడి సాధన వున్నవాళ్ళు కావాలి. తాళాలు పగలగొట్టడం, ఎలక్ట్రికల్ అలారం మోగకుండా చేయడం, రెండో అంతస్తుకి చేరుకోవడం—యివన్నీ అతి లాఘవంగా చేసిన పనులు!

టాక్సీడ్రయివర్‌తోబాటు నేను ప్రమాద స్థలాన్ని చూశాను. సందు చివర గుడ్డముక్కమీద రక్తంచుక్కలు దొరికాయి. అది మనిషి రక్తమే అని తర్వాత పరిశోధనలో తెలిసింది. చనిపోయిన వాచ్‌మన్‌ల రక్తంతో పోల్చితే ఒక హంతుడి రక్తం గ్రూపుతో సరిపోతుంది.

అంటే హంతకులు ఆ సందులోంచే పారిపోయారు. వాళ్ళ వెనక భాగాలు మాత్రమే టాక్సీడ్రయివర్ చూడ గలిగాడు.

సర్కస్ ట్రూపులో వింత దొంగతనాలు ప్రారంభమయ్యాయి. వస్తువులన్నిటినీ జాబితా వేశాను.

హెలీనా —స్వీటీ అనే పాము, గుడ్లు, తొట్టె.
ఇల్యానోవ్ —దంతం పైపు.
ఫెర్డినాండ్ —వైట్‌హార్స్ విస్కీ.
విజయ్, అజయ్—ఒక్కడివే ఇత్తడి బొత్తాలు.
కల్నల్ —హాండ్‌స్టిక్.
జాఫర్ —జేబురుమాలు
ఫరీదున్నిసా —పాముతోలుతో చేసిన మనీపర్స్.
శంకరరాజన్ —ముడి ఫిలింబాక్స్.
మ్యాజియం —నార్త్ స్టార్.

వీటితో దేనికీ సంబంధం లేదనుకున్నాను మొదట. కాని సర్కస్‌వాళ్లే ఎవరో వాచ్‌మన్‌లను హత్య చేసినట్టు అనుమానం వచ్చాక నా ఉద్దేశ్యంలో మార్పు వచ్చింది. నార్త్ స్టార్ వజ్రం దొంగతనం బయటపడకుండా పనికిమాలిన దొంగతనాలు చేశారు. వీటన్నింటిలోనూ పనికివచ్చే దొంగతనం స్వీటిని ఎత్తుకుపోవడం ఒక్కటే...." శిరీష్ ఆగాడు.

హెలీనా పాము దగ్గర కూలబడింది.

శిరీష్ ఆమెను చురుకుగా చూశాడు.

"పాముతోబాటు గ్రుడ్లు ఎత్తుకుపోయారు దొంగలు. ఎందుకు? పాముమీద దయతలచి కాదు. నార్త్‌స్టార్‌ను ఒక గ్రుడ్డులో జొనిపారు. ఉడికిన గ్రుడ్డు! దాన్ని పాము చేత మ్రింగించారు. పామును ఎక్కడ దాచాలి? ఎక్కడ దాచినా దొరికిపోతారు. హెలీనా పిచ్చెత్తినట్టు పాము కోసం వెతుకులోంది కదా!

తాము రోజూ ట్రిక్ చేసే హిండాలియం సిలిండర్‌లో దాచారు. మూతపెట్టారు. పాము ఉక్కిరిబిక్కిరయింది. చనిపోయింది. అందుకే యిద్దరూ నెర్వస్‌గా ఫీలవుతూ వచ్చారు. చివరకు వాళ్ళు పోగొట్టుకున్న ఇత్తడి బటన్స్ దొరికిప్పటికీ వాళ్ళకు నెర్వస్‌నెస్ తగ్గలేదు. అంటే వాళ్ళ నెర్వస్‌నెస్‌కి ఇత్తడి బటన్స్ పోవడం కారణం కాదు.

మరో విచిత్రం!

హిండాలియం సిలిండర్ మొట్టమొదటిసారిగా నేల మీద పడింది. దడ్ డ్ మంటూ శబ్దం చేసింది. ఖాళీ సిలిండర్ గుల్లగా శబ్దం చేయాలి. పైగా వాళ్ళ ఫీట్ ఫెయిలు కావడానికి అప్పటికింకా వాళ్ళకి సంబంధించిన

'అచ్చి వచ్చిన వస్తువులు' ఏమీ పోలేదు. వాళ్ళు సిలిండర్‌ను వదలి ఒక్క క్షణం కూడా వుండటంలేదు. అంతే కాదు!

సర్కస్‌లో ఫీట్ చేసినవాళ్ళు వస్తువును అక్కడే వుంచి వెళ్ళిపోతారు. అజయ్ విజయ్ మాత్రం వాళ్ళ సిలిండర్‌ను వాళ్ళే మోసుకుపోతున్నారు. ఒక్కడు మోసుకు వెళ్ళగలిగిన సిలిండర్‌ను యిద్దరు కలిసి ఎందుకు మోసుకుపోతున్నారు?

ఏటవాలు పొజిషన్‌లో పాము బరువైన శరీరం మూత తొలగించుకుని బయటపడుతుందేమో! అందుకే ట్రిక్ చేసేటప్పుడు మూసిన భాగం క్రిందకూ మూతవున్న భాగం పైకీ వచ్చేలాగా జాగ్రత్తపడుతోన్నారు.

అంటే వజ్రాన్ని బయటకు తీయగలిగి కూడా ఎందుకు తీయలేకపోతున్నారు!

వజ్రాన్ని వాళ్లు తమకోసం దొంగిలించలేదు.

దొంగిలించమని పురమాయించిన వ్యక్తి యింతవరకూ రాలేదు.

ఫిలిం పోయిన రోజునే అజయ్ విజయ్ షూటింగులో పాల్గొన్నారు. స్టూడియోకి వచ్చారు. పనిలో పనిగా ముడిఫిలిం దొంగిలించారు.

ఈ కేసులో అనవసరమయిన పాత్రలు చాలా వున్నాయి.

వాళ్ళను అనుమానించవలసిన సంఘటనలు చాలా జరిగాయి.

ముఖ్యంగా ఫరీదున్నీసా బాలెన్స్ తప్పడం!

ఆమె గొడుగును కావాలనే దొంగలలో ఒకడు పాడుచేశాడు. అనుమానం ఫెర్డినాండ్ మీదకు వెళ్లాలని

కాబోలు!

నేను అందరినీ యించుమించుగా వెంటాడాను. దొంగలు యిద్దరూ గుడారంలో నే ప్రాక్టీసు చేసుకుంటూ మిగిలిపోయేవారు!"

ఆగాడు శిరీష్.

పోలీస్ కమీషనర్ శిరీష్‌ను అభినందనపూర్వకంగా చూశాడు.

ఇల్యానోవ్ దొంగలవైపూ, శిరీష్‌వైపూ మార్చి మార్చి చూశాడు. పామును కట్ చేయించాడు.

"స్వీటీ....స్వీటీ.... ...." హెలీనా పిచ్చిగా అరుస్తోంది.

చీల్చిన పాము శరీరం మధ్య గ్రుడ్డూ....దాని చీలికలో నార్తు స్టార్....

—:ఐ పో యి ం ది:—

# ఐదు లక్షలు

## టెంపోరావ్

సైకిల్ రిక్షాలో రమ ఒంటరిగా కూర్చుంది. రిక్షావాడు మెల్లగా తొక్కుతున్నాడు. ఏదో కారు రిక్షాను దాటి వెళ్ళిపోయింది. సడన్ బ్రేకుతో రిక్షా ముందు కారు ఆగింది.

స్టీరింగ్ వీల్ వెనుక కూర్చున్న వ్యక్తి ఆగమని రిక్షావాడికి సౌజ్ఞ చేశాడు.

"ఆ అమ్మాయిని కారులో ఎక్కించు. నేను ఇంటికి తీసుకుపోతాను," అన్నాడతను.

రిక్షావాడు అతడివైపు పరీక్షగా చూశాడు.

"మీరెవరో నాకు తెలియదు సార్. నేనే తీసుకెళ్ళి యింట్లో వదిలేస్తాను," అన్నాడతను.

తటాలున తలుపు తెరిచి డ్రయివింగ్ సీటులో వున్న తను కిందకు దిగాడు. రిక్షా వెనక్కు వెళ్ళి రమను ఎత్తుకున్నాడు. ఆమె గాభరాగా అతడివైపు చూస్తోంది. ఏడుస్తోంది.

"సార్. మీరెవరు?" అడిగాడు రిక్షావాడు.

"నోరు మూయి!" అని అతడు గబగబా వెళ్ళి రమను ముందు సీటుమీద కూర్చోబెట్టి, కారులో యెక్కి తలుపు మూశాడు.

కారు కిటికీ దగ్గరకు వచ్చిన రిక్షావాడిని బలంగా చేత్తో తోసి, కారును ముందుకు పోనిచ్చాడు.

రోడ్డుమీద పడిన రిక్షావాడు లేచి దూసుకుపోతున్న కారువైపు చూశాడు. రిక్షాను రమ యింటివైపు వేగంగా పోనిచ్చాడు. పది నిమిషాల్లో యింటిముందు రిక్షా ఆపి అతడు బెల్ కొట్టాడు. కాస్సేపట్లో కమల ముందు వరండామీదకు వచ్చి గేటు బయిటనున్న రిక్షా వైపు చూసింది.

రిక్షావాడు జంకుతూ ఆమె ముందుకొచ్చాడు.

"అమ్మాయి ఏదీ?" అడిగిందామె, అతడు ఏదేనా చెప్పేలోపలే.

"ఇంటికి రాలేదూ?" ప్రశ్నించాడతను.

"ఎలా వస్తుందనుకున్నావు?"

అతడు తల వాల్చుకుని నుంచుండిపోయాడు.

"ఏమైంది రమ?" అడిగిందామె గాభరాగా.

"అయ్యనెవరో కార్లో వచ్చారమ్మా. నే వద్దంటే వినకుండా, నన్ను కొట్టి పిల్లను కార్లో ఎక్కించి తీసుకుపోయారు. ఇంటికి తీసుకెళ్తా నన్నారు. ఎందుకేనా కనుక్కోడం మంచిదని యిలా వచ్చాను."

"ఎవరతను?"

"అయ్యనెవరో నాకు తెలియదమ్మా."

"అటువంటి వాడికి పిల్లను యెందుకు అప్పగించావు?"

"నేను అప్పగించలేదమ్మా. ఆయనే పిల్లను ఎత్తుకు తీసుకుపోయారు. పాపం, బిడ్డ ఏడ్చింది. ఆయన్ని ఆప బోయాను. నన్ను గట్టిగా తోసేసి కారును పోనిచ్చా రాయన."

"కారు నంబరు చూశావా?"

"సరిగ్గా కనిపించలేదమ్మా."

కోపంతో ఆమె అతడివంక చూసింది.

"నీలాంటి దద్దమ్మను నమ్మికొని పిల్లని స్కూలుకు పంపడం నేను చేసిన తప్పు!" అరిచిందామె.

రిక్షావాడు మౌనం దాల్చాడు. జరిగినదానికి అతడు బాధ పడుతున్నాడు. కాని కారులోంచి దిగిన వ్యక్తిని ఆపే బలం అతడికి లేదు!

కమల వేగంగా లోపలకు వెళ్ళింది. రిసీవర్ ఎత్తి ఆఫీసు నంబరు తిప్పింది.

"భారత్ యెంటర్ ప్రైసెస్!" అందొక యువతి కంఠం.

"అర్జంట్ గా దినకర్ గారితో మాట్లాడాలి!"

"మీరా! ఆయన ఆఫీసులో లేరు. ఎక్కడికో వెళ్ళారు."

"రాగానే యింటికి ఫోన్ చెయ్యమను," అని ఆమె రిసీవర్ పెట్టేసింది.

ఏదో ఆలోచన తట్టి ఆమె బయటకు పరుగెత్తింది. గేటు దగ్గర రిక్షావాడు నిలబడి వున్నాడు.

"నీకు అయ్యగారు తెలుసుగా?"

"తెలుసండమ్మా."

"పిల్లను తీసుకెళ్ళింది ఆయన కాదుగా?"

"ఆయనైతే అమ్మాయి ఎందుకేడుస్తుందమ్మా? ఆయ

నై తే నేను అడ్డు పడేవాడిని కాను," అన్నాడు రిక్షా వాడు.

ఇప్పుడేం చెయ్యాలి? ఆమె గుండె వేగంగా కొట్టుకుంటోంది. పోలీస్ రిపోర్టు యివ్వాలి! పోలీసులు రిక్షా వాడితో మాట్లాడా లనొచ్చు!

"నీ అడ్రెసు ఏమిటి?"

"జాన్ డిసౌజా స్కూల్ పక్కనే సందు వుంటుందమ్మా. ఆ సందులోని ఐదో గుడిసె. అయ్మగం అంటే ఎవరేనా చెప్తారు."

కాలు కాలిన పిల్లిలా ఆమె వరండామీద తిరుగుతోంది.

"అమ్మా, నే వెళ్తానమ్మా," అన్నాడు రిక్షావాడు.

జవాబివ్వకుండా అతడివైపు చూసిందామె. ప్రతి రోజూ సాయంకాలం సైకిల్ బెల్ వినగానే ఆమె ముందు వరండామీదకు వెళ్ళేది. రమ నవ్వుతూ లోపలకు వచ్చేది. రమ ఏమైందో!

రిక్షా ఆమె ముందునుంచి కదిలిపోయింది. ఫోన్ మ్రోగడం విని ఆమె లోపలకు వెళ్ళింది. రిసీవర్ యెత్తింది.

"హలో!" అంది.

"కమలా, నువ్వు ఫోన్ చేశావటగా!" అడిగాడు దినకర్.

ఫోన్లోంచి ఆమె ఏడుపు అతడికి వినపడింది.

"ఏమైంది?" ఆత్రంగా అడిగాడతను.

"రమ యింటికి రాలేదు. రిక్షాలో వుండగా ఎవరో కారులో వచ్చి దాన్ని ఎత్తుపోయారు...."

అటువైపునుంచి శబ్దం లేదు.

"షాకింగ్!" అర్చాడతను కొన్ని నిమిషాల తర్వాత.

"నాకు చాలా భయంగా వుంది!"

"కమలా, నేను వెంటనే బయల్దేరి వస్తున్నాను! భయపడకు!" అని అతను రిసీవర్ పెట్టేశాడు.

హాల్లోని సోఫాలో ఆమె వాలిపోయింది. ఆమె మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. రమ వయస్సు ఏడేళ్ళు! అందమైన ఆడపిల్లలను ఎత్తుకుపోయి, వాళ్ళను వేశ్యాగృహాలకు అమ్మివేస్తారని ఆమె చదివింది. ఆమె గుండె దడదడ కొట్టుకుంది. ఆమె ఒళ్ళు వణికింది. అమాంతంగా మొహాన్ని చేతుల్లో కప్పేసుకుని ఆమె వెక్కి-వెక్కి ఏడ్వసాగింది!

## 2

హాల్లోని ఫ్లోరసెంట్ లైటు ప్రకాశవంతంగా వెల్గుతోంది. దినకర్ ఆమెను బలంగా పట్టుకున్నాడు.

"కమలా, ప్లీజ్! నువ్వు ఏడిస్తే రమ యింటికి రాదు! నేను ఆఫీసునుంచి ఇన్‌స్పెక్టర్ రామన్‌తో మాట్లాడాను. అతడికి పూర్తి వివరాలు కావాలి. ఏం జరిగిందో చెప్పు!"

కమల అంతా చెప్పింది. రిక్షావాడు తనతో అన్నదంతా భర్తతో చెప్పింది. దినకర్ క్షణకాలం ఆలోచిస్తూ వుండిపోయాడు. టెలిఫోన్ దగ్గరకెళ్ళి, రిసీవరెత్తి, నంబరు తిప్పి జరిగిందంతా ఇన్‌స్పెక్టర్ రామన్‌కు చెప్పాడు. రిక్షావాడి అడ్రెస్ యిచ్చాడు.

"మిస్టర్ దినకర్, డోంట్ బాదర్! మీ అమ్మాయి యీ పట్నంలో యెక్కడో వుంటుంది. మీరిచ్చిన ఫోటో కాపీలు తీయిస్తున్నాను. అన్నిచోట్లా ఆ పిల్ల కోసం వెతుకుతాం," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"థాంక్స్, ఇన్‌స్పెక్టర్!"

"రిక్షావాడిని మేం కలుసుకుంటాం. రమను ఎత్తుకు పోయిన వ్యక్తిని గురించి కొన్ని వివరాలు చెప్పొచ్చు."

"త్వరగా ఏదో చేయండి."

"ఒకవేళ మీకు ఆ వ్యక్తినుంచి ఫోన్‌కాల్ వస్తే వెంటనే మాకు తెలపండి. ఇది బ్లాక్‌మెయిల్ కేసు కావచ్చు."

"వెంటనే మీకు చెప్తాను," అని దినకర్ రిసీవర్ని పెట్టేశాడు.

కమల పక్కనే అతడు కూర్చున్నాడు. ఆమె అతడి వంక ప్రశ్నార్థకంగా చూసింది.

"నా పర్సులో వున్న రమ ఫోటో ఇన్‌స్పెక్టర్ రామన్‌కి యిచ్చాను. ఈ పట్నమంతా మనమ్మాయికోసం వాళ్ళు గాలిస్తారు. ఎక్కడో రమ మనకు దొరుకుతుంది," అన్నాడతను.

భర్త వేపు ఆమె విచారవదనంతో చూసింది.

"మనం డిటెక్టివ్ పరశురామ్‌గార్ని చూడ్డం మంచిదేమో!"

"ఇది చిన్న కేసు. పరశురామ్‌గారు చిన్న కేసుల్ని చేపట్టరు," అన్నాడతను.

ఆమె కళ్ళు నీళ్ళతో నిండాయి. దినకర్ ఆమెకు ధైర్యాన్నివ్వడానికి ప్రయత్నిస్తున్నాడు.

"చూడండి, రమ మన ఒక్కగా నొక్క కూతురు. నాకిక పిల్లలు పుట్టరు. ట్యూబెక్టమీ చేయించుకున్నాను గా. దానికోసం మనం అన్ని విధాలా పాటు పడాలి. పరశురామ్‌గార్ని బ్రతిమాలితే ఆయన పరిశోధించి రమను మనకు అందజేస్తారు. ఆయనమీద నాకు నమ్మకం

యెక్కువ," అందామె.

"నీ యిష్టం, అలాగే చేద్దాం," అన్నాడు దినకర్.

ఆమె సోఫాలోంచి లేచింది. దినకర్ ఆలోచిస్తూ సిగరెట్ వెలిగించాడు. పొగ వదుల్తూ భార్యవంక చూశాడు. వాళ్ళ పెళ్ళయి తొమ్మిదేళ్ళయింది. కమల ప్రఖ్యాత పారిశ్రామికవేత్త సుబ్బారావు కూతురు. ఆమె బి. ఎ. పాసయింది. తన మామలా లక్షలు గడించక పోయినా ఏ లోటూ లేకుండా దినకర్ జీవితాన్ని సాగిస్తున్నాడు.

"పదండి వెళ్దాం!" అంది కమల.

"ఎవరేనా ఫోన్ చేస్తే?"

"ఎవరు చేస్తారు?"

"కమలా, రమను యెందుకు యెత్తుకుపోయారో మన కింకా తెలియదు. బ్లాక్ మెయిల్ వుద్దేశమైతే వాళ్లు మనింటికి ఫోన్ చేస్తారు."

"ఎవరూ యింట్లో లేకపోతే వాళ్ళు మళ్ళా ఫోన్ చేస్తారు," అందామె.

ఇద్దరూ బయిటకు నడిచారు. అతడు ముందు తలుపు మూసి తాళం వేశాడు. కాంపౌండ్‌లో వున్న ఫియెట్ కారులో ఆమె కూర్చుంది. అతడామె పక్కనే సర్దుకుని తలుపు మూశాడు.

"కమలా, ఎవరో కారులో వచ్చి రమను యెత్తుకు పోయారని మనం యెలా నమ్మగలం? అమ్మగం నాటకం ఆడుతున్నాడేమో! వాడు తాగుబోతు. ఎన్నిసార్లో నన్నడిగితే వాడికి డబ్బిచ్చాను. అమ్మాయి నెక్కడో దాచి రిక్షావాడు నాటకం ఆడొచ్చు!"

"అదంతా పరశురామ్‌గారు కనుక్కొంటారు. ఏ దేశ్ల

అమాయకపు పిల్లను యెవరో యెత్తుకుపోయారు. అదెలా జరిగిందో పరశురామ్‌గారు కనుక్కొంటారు," అందామె.

"ఆల్ రైట్," అని అతను కారును స్టార్టు చేశాడు. గేటు దాటి కారు రోడ్డుమ్మట దూసుకుపోయింది.

## 3

ఇంటి ముందున్న ట్యూబ్ లైట్ కాంతిలో ఫియెట్ కారు స్పష్టంగా కనిపిస్తోంది. ఎవరో వచ్చుంటారు. ఫియెట్ వెనకనే డాడ్జి కారాపి దిగాను. గబగబా మెట్లెక్కి ఏర్ కండిషండ్ హాల్లోకి వెళ్ళాను.

పార్వతి, ఆమె యెదురుగా కూర్చున్న ఇద్దరు వ్యక్తులు నన్ను చూసి లేచారు.

"వీళ్ళు మీకోసం గంట పైగా వేచి వున్నారు," అంది పార్వతి.

సోఫాలో వాళ్ళ కెదురుగా కూర్చుని ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించాను. వాళ్ళిద్దరివైపూ చూశాను. ఆమె వయస్సు యిరవై యెనిమిది వుండొచ్చు. ఏదో బాధ ఆమె మొహంలో గోచరిస్తోంది. ఆమె పక్క నున్నతడి వయసు ముప్ఫయి ఐదుండొచ్చు. అతడిలో ఏదో ఆకర్షణ వుంది.

"నా పేరు దినకర్. ఈమె నా భార్య కమల. సిమెంట్, షుగర్ కింగ్ సుబ్బారావుగారి పేరు మీరు వినే వుంటారు. ఆయన కూతురు!"

ఆమెవైపు మళ్ళా చూశాను. సుబ్బారావు నాకు బాగా తెలుసు! ఎడారిలో వదిలేసినా అక్కడ ఏదో పరిశ్రమ ప్రారంభించి విజయాన్ని సాధిస్తాడని సుబ్బారావును గురించి చెప్పుకుంటూ వుంటారు!

"పరశురామ్‌గారూ, మీ సహాయం కావాలి," అంది కమల.

"ఏం జరిగిందో చెప్పండి!"

"మా అమ్మాయి రమని ఎవరో ఎత్తుకుపోయారు," అన్నాడు దినకర్.

దినకర్, కమల అంతా వివరంగా చెప్పారు. రిక్షా వాడిమీద వాళ్ళకు అనుమానం వుందని గ్రహించాను. ఇటువంటి సమయాల్లో బీదవాళ్ళమీదకు మన అనుమానాలు వెళ్తూ వుంటాయి!

దినకర్ వైపు చూశాను.

"మిస్టర్ దినకర్, మీరు పేపర్లలో చదివే వుంటారు. గత ఆరు నెలల్లో యాభైమంది బాలికలు యీ పట్నంలో మాయమయ్యారు. వాళ్ళు ఏమైందీ యింతవరకూ పోలీసులకు అంతుచిక్కలేదు!" అన్నాను.

"అంతమందా! మా అమ్మాయి ఒక్కతే మాయమైందని నేననుకుంటున్నాను," అంది కమల.

"వాళ్ళు ఏమైవుంటారు?" అడిగాడు దినకర్.

"మిస్టర్ దినకర్, ఆ పిల్లల తలిదండ్రులు నా దగ్గరకు వచ్చుంటే నేను దర్యాప్తు చేసేవాడిని. ఎవ్వరూ నా ముందుకు రాలేదు. ఇప్పుడు మీరొచ్చారు గనక పరిశోధించి యేమయిందీ తెలుసుకుంటాను."

దినకర్ ఒక ఫోటోను నా కిచ్చాడు. రమ స్కూల్ యూనిఫామ్‌లో వుంది. బ్లూ అండ్ వైట్. అందమైన పిల్ల. చెవులకు రింగులున్నాయి. కాళ్లకు సాక్స్, బూట్లు. చేతిలో పుస్తకాల బాగ్.

కమలవంక చూశాను.

"అమ్మాయి స్కూలుకి ఎన్నింటికి వెళ్తుంది? ఎప్పుడు

తిరిగి వస్తుంది?"

"పొద్దుట ఎనిమిదింటికి స్కూలు రిక్షా వస్తుంది. దానిలో వెళ్తుంది. భోజనం వేరే మనిషి కిచ్చి పంపిస్తాను, అదే రిక్షాలో నాలుగున్నర ప్రాంతంలో అమ్మాయి తిరిగి వస్తుంది."

"ఆ రిక్షావాడు పాతవాడా, కొత్తవాడా?"

"పాతవాడు సార్. రెండేళ్లనుంచి పని చేస్తున్నాడు. పొరపాటున రమ పుస్తకాల బాగ్ను రిక్షాలో వదిలేస్తే పట్టుకొచ్చి యిచ్చాడొకసారి."

"వాడు తరచు డబ్బు అడుగుతూ వుంటాడు," అన్నాడు దినకర్.

"లేదనకుండా మీరు యిస్తూవుంటారా?"

"పిల్లను జాగ్రత్తగా చూసుకుంటాడనే వుద్దేశంతో యిస్తూ వుంటాం," అన్నాడు దినకర్.

"ఇన్స్పెక్టర్ రామన్కేగా మీరు రిపోర్టిచ్చింది?"

"అవును, సార్," అన్నాడు దినకర్.

టెలిఫోన్ దగ్గర కెళ్ళి ఒక నంబరు తిప్పి ఇన్స్పెక్టర్ రామన్తో మాట్లాడి వాళ్ళముందు నిలబడ్డాను.

"ఇంతవరకూ మాయమైన పిల్లల కేసులను ఇన్స్పెక్టర్ పింటో దర్యాప్తు చేస్తున్నాడు. మీ అమ్మాయి కేసు కూడా అతడికి అప్పగించబడింది," అన్నాను.

"పరశురామ్గారూ, దయచేసి మీరు దర్యాప్తు చేసి నా బిడ్డ నాకు దొరికేటట్లు చూడండి. పోలీసులమీద నాకంతగా నమ్మకం లేదు," అంది కమల.

"ఆల్ రైట్, మీరు వెళ్ళండి. ఎవరేనా మీ పిల్ల గురించి ఫోన్ చేస్తే నాకు వెంటనే తెలపండి."

దినకర్ నా వైపు సీరియస్గా చూశాడు.

"పరశురామ్‌గారూ, వెళ్లొస్తాం. ప్లీజ్ డు యువర్ బెస్టు!"

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు. వారి వెనకనే స్ప్రింగ్ డోర్ మూసుకుంది.

పక్క నున్న పార్వతివంక నవ్వుతూ చూశాను.

"భోజనం చేద్దామా?" అందామె.

"మహా ఆకలిగా వుంది, పద," అన్నాడు.

## 4

జాన్ డిస్కో ఇంగ్లీషు మీడియమ్ స్కూలు బోర్డు చూసి కారాపాను. కారులోంచి స్కూలువైపు చూశాను. కాంపౌండులో వున్న సైకిల్ రిక్షా అగుపిస్తోంది. రిక్షాలో పదిమంది పిల్లలు కూర్చోవచ్చు.

కార్లోంచి దిగాను. స్కూలు గేటు ముందుకు వెళ్లాను. అక్కడ యెవ్వరూ లేరు. చంద్రకాంతిలో హాయిగా వుంది. స్కూలు కిటూ అటూ ఏ యిళ్ళూ లేవు. స్కూలు పిల్లలు యెంత గోల చేసినా ఫరవాలేదు!

పక్కకు నడిచాను. చిన్న సందు. కొంచెం దూరం సందమ్మట నడిచాను. గుడిసెలు కనిపించాయి. కుక్కలు నన్ను చూసి మొరుగుతున్నాయి. ఐదో గుడిసె ముందు ఆగాను. బుడ్డి దీపం చేత్తో పట్టుకుని, తలుపు తెరిచి ఒకతను నా వంక చూశాడు.

"ఎవరు కావాలయ్యా?" అడిగాడతను.

"ఆర్ముగం."

"ఆ పేరు నాదే," అన్నాడతను, బయటకొస్తూ.

ఇంటి ముందున్న ఒక రాయిమీద బుడ్డిదీపాన్ని పెట్టి, అతడు నా ముందుకొచ్చాడు.

"అడగండయ్యా!"

"ఆ అమ్మాయిని యెత్తుకు పోయినవాడు యెలా ఉంటాడు?"

"పొడుగ్గా, బలంగా వున్నాడయ్యా. సూటు వేసుకున్నాడు. గడ్డం, నల్లటి కళ్ళద్దాలు వున్నాయి."

"అతడిని యింతకు ముందెప్పుడూ నువ్వు చూడలేదా?"

"లేదయ్యా—అదే మొదటిసారి."

"అతడు కారులో వెళ్ళింది ఎటువైపు?"

"మౌంట్ రోడ్డువైపు ఆయన కారు వెళ్ళింది సార్."

"కారు నంబరు గుర్తుందా?"

"లేదయ్యా. కిందపడిన నేను లేచేసరికి ఆ కారు వేగంగా పోతోంది."

"అదేం కారు? అంబాసిడరా, ఫియెటా?"

"కార్లతో నా కంతగా పరిచయం లేదయ్యా. ఆ కారు కొంచెం పెద్దది."

"ఇవాళ నాటు సారా తాగలేదా?" అడిగాను.

"ఎప్పుడో కాని తాగనయ్యా. రిక్షా స్కూల్లో పెట్టి, యిక్కడికొచ్చి ఆలా తొంగొన్నానయ్యా. తిండి కూడా తినలేదు. రమ చక్కటి చుక్క. ఆమె తల్లీ, తండ్రీ మంచోళ్ళు. ఎప్పుడు రెండు రూపాయి లడిగినా యిస్తారు. ఆ పిల్లను కాపాడలేక పోయాను. ఆయన ఎత్తుకుపోతూంటే వూరికే ఉండిపోయాను."

వెనక్కు తిరిగి నడవసాగాను. నా వెనకనే వచ్చాడు ఆర్ముగం. కుక్కలు మొరుగుతూనే ఉన్నాయి.

కారు పక్కనే నిలబడ్డాను. జేబులోంచి ఐదు రూపాయిల నోటు తీసి అతడి కిచ్చాను.

"ఆ బిడ్డను కాపాడలేని నాలాంటి ఎదవకి మీరు పైసా

కూడా యివ్వకూడదయ్యా!" అన్నాడతను.

"బెంగెట్టుకోకు! ఒక్కోసారి ఇతర్లను కాపాడ్డానికి మన శక్తి చాలకపోవచ్చు. రమ కోసం నేను వెతుకుతున్నాను. ఆమె ఏమైందో కనుక్కుంటాను."

"అది చెయ్యండయ్యా. నేను ఆనందంగా గొంతు కోస్తాను."

అతడి చేతిలో నోటు పెట్టి కారులో కూర్చుని తలుపు మూశాను. ఆలోచిస్తూ సిగరెట్ వెలిగించాను. రిక్షా వాడిని అనుమానించవలసిన అవసరం నాకు కనపడడం లేదు. రెండు మూడు రూపాయలతో తృప్తి చెందే వ్యక్తి రమను యెత్తుకుపోయి వుండడు.

రమను యెవరో యెత్తుకుపోయారు. ఆమె స్కూలు నుంచి ఆ సమయంలో వస్తుందని వాళ్ళకు తెలుసు. రమ దినచర్యలను గమనిస్తూన్న వ్యక్తే ఆమెను యెత్తుకుపోయి ఉండాలి!

డాడ్జి కారును రోడ్డమ్మట పోనిచ్చాను, ఇన్‌స్పెక్టర్ పింటో ఆఫీసువైపు.

ఇన్‌స్పెక్టర్ పింటో కుర్చీలోంచి లేచి నాకు నమస్కరించాడు. "మిస్టర్ పరశురామ్, ఏదో అర్జంటు పనుంటే గాని మీరు యిటు రారు!" అన్నాడతను.

కుర్చీలో కూర్చుని, సిగరెట్ వెలిగించి, పొగ వదులూ పింటోవైపు చూశాను. అతడి వయస్సు నలభై పైన వుంటుంది. సిలిండర్‌లా ఉంటాడు. బట్ట తల. కేసులకు సంబంధించిన పత్రాలను చాలా జాగ్రత్తగా ఫైలు చేసి ఉంచుతాడని డిపార్టుమెంట్‌లోని వాళ్ళు అంటూ ఉంటారు.

"ఇన్‌స్పెక్టర్, యీ మధ్య చాలామంది అమ్మాయిలు

మాయమై పోయారని పత్రికల్లో చదివాను" అన్నాను.

"మిస్టర్ పరశురామ్, పత్రికలను నమ్మకండి. సంవత్సరం నుంచి 'కిడ్నాప్' కేసులను నేను చూస్తున్నాను. గత ఆరు నెలల్లో 55 గురు ఆడపిల్లల్ని ఎత్తుకుపోయినట్లు మాకు రిపోర్టులు వచ్చాయి. మద్రాసు మహాపట్నం జనాభానుపట్టి చూస్తే అది అంత ఎక్కువ కాదనిపిస్తుంది. న్యూయార్క్లో నెలకు వందమంది పైన మాయమవుతారు."

"ఇవాళ సాయంత్రం మాయమైన రమ పేరు కూడా 55 గురు లిస్టులో వుందా?"

"ఉంది. ఆమె పేరు చేర్చాక 55 అయింది."

"మిస్టర్ పింటో, ఇంతవరకూ మాయమైనవాళ్ళు యెవరేనా దొరికారా?"

"ఇద్దరు మాత్రం దొరికారు. నిజం చెప్పాలంటే వాళ్ళ శవాలు కనిపించాయి. మంగి, రంగి, అక్కచెల్లెళ్లు. 12, '0 వయసులవాళ్ళు. వాళ్ళను రేప్ చేసి, చంపి శవాలను ఒక చెరువులో పారేశారు. చేతులు తాళ్ళతో కట్టబడి వున్నాయి."

"తతిమావాళ్ళు యేమైవుంటారు?" ప్రశ్నించాను.

"ఆడపిల్లల్ని యితర రాష్ట్రాలకు తీసుకుపోయి అక్కడ రహస్యంగా అమ్మేస్తున్నారని పుకార్లు ఉన్నాయి."

"ఇన్ హ్యూమన్!" అన్నాను బాధతో.

ఇన్స్పెక్టర్ పింటో ముందు ఏదో ఫైలుంది.

"మీ కొచ్చిన వాటిలో బ్లాక్ మెయిల్ కేసులున్నాయా?"

"బ్లాక్ మెయిల్ చేసినట్లు ఎవ్వరూ యింతవరకూ

చెప్పలేదు. ధనవంతుల పిల్లలైతే గాని బ్లాక్ మెయిల్ చేసే అవకాశం వుండదు," అన్నాడు ఇన్ స్పెక్టర్ పింటో.

"రమ విషయంలో మీరు యేం చేస్తున్నారు?"

"ఎత్తుకుపోయినవాళ్ళు ఆమెను దూర ప్రదేశానికి తీసుకుపోవడానికి ప్రయత్నిస్తారు. రైల్లోనో, బస్సులోనో లేక కారులోనో ఆమెను తీసుకుపోవచ్చు. బయిటకు వెళ్ళే రైళ్లను, బస్సులను, కార్లను మా మనుషులు ఆమె కోసం గాలిస్తున్నారు. మా వాళ్ళు కొందరు ఏర్ పోర్టులో కూడా ఉన్నారు. రమను బయిటకు తీసుకుపోడం సాధ్యం కాదు," అన్నాడు పింటో.

టెలిఫోన్ మ్రోగింది. పింటో మాట్లాడి, రిసీవర్ని నా కిచ్చాడు. "హలో, పరశురామ్," అన్నాను.

"పరశురామ్‌గారూ, నేను సుబ్బారావుని. అమ్మాయి నాకు ఫోన్ చేసి అంతా చెప్పింది. మీరు ఈ కేసు తీసుకున్నందుకు చాలా థాంక్స్. మీరు నిర్విరామంగా శ్రమించి రమను కనుక్కోవాలి. రమ దొరక్కపోతే నా కూతుర్కి పిచ్చెక్కిపోతుంది. ఈ విషయంలో మీరు ఎంతయినా ఖర్చుపెట్టండి. రమ మాకు కావలి! ప్లీజ్ ఫైండ్ హర్!" అన్నాడు సుబ్బారావు.

"సుబ్బారావుగారూ, ఆ పనిలోనే ఉన్నాను. కొన్ని రోజుల్లో రమ నాకు దొరుకుతుంది. డోంట్ బాదర్!" అన్నాను.

"నేను హైద్రాబాద్ నుంచి మాట్లాడుతున్నాను. మీ యింటికి ఫోన్ చేస్తే మీరు దొరకలేదు. ఒక డిటెక్టివ్ ఏజన్సీ సహాయంతో మీరు పింటో ఆఫీసులో ఉన్నారని తెలుసుకుని వెంటనే ఫోన్ చేశాను. నేను

ఎక్కడున్నా ప్రతిరోజూ మీకు ఫోన్ చేస్తూ వుంటాను. ఏదేనా తెలిస్తే చెప్పండి."

"ఆల్ రైట్, గుడ్ నైట్," అని రిసీవర్ పెట్టేశాడు.

ఇన్‌స్పెక్టర్ పింటో నావైపు చూశాడు.

"పరశురామ్‌గారూ, మీరు యేదేనా సలహాలిస్తే అలా చేయిస్తాను."

"మిస్టర్ పింటో, ప్రస్తుతం మనం అడుగు ఎటు వెయ్యాలో తెలియడం లేదు. రమ ఏడేళ్ళ పిల్ల. ఆ వయస్సులో అమ్మితే పెద్దగా డబ్బు రాదు. ఆమె తాత సుబ్బారావు. ఆయన బాగా డబ్బున్నవాడు. అందువలన బ్లాక్‌మెయిల్ చేసి డబ్బు గుంజడంకోసం ఆమెను ఎత్తుకుపోయి వుండొచ్చు. అదాతా మనకు త్వరలో తెలుస్తుంది. అంతవరకూ మీరు చెప్పినదంతా సాగించండి," అని పింటోకి గుడ్‌నైట్ చెప్పి బయటకు కదిలాను.

కారును ఇంటివైపు శరవేగంగా పోనిచ్చాను.

## 5

తెల్లారింది. దినకర్, కమల కాఫీ మాత్రం తాగి పెద్ద సోఫాలో కూర్చున్నారు. రాత్రంతా ఆమెకు నిద్ర లేదు. జాగారం చేస్తూ అతడామె పక్కనే వున్నాడు.

వంటామె హాల్లో కొచ్చింది.

"టిఫిన్ యేం చెయ్యమంటారు?" అడిగిందామె.

"ఏమీ చెయ్యొద్దు. వంట కూడా వద్దు!" అంది కమల.

దినకర్ యేదో చెప్పబోయి వూరుకున్నాడు. వంటామె లోపలకు వెళ్ళిపోయింది.

టెలిఫోన్ మ్రోగింది. దినకర్ వెళ్ళి రిసీవర్ని అందు

కున్నాను.

"హలో, దినకర్!" అన్నాడు.

"మీ భార్యను పిలవండి!" అందొక స్త్రీ కంఠం.

"ఎవరు మీరు?"

అటువైపు స్త్రీ గంభీరంగా నవ్వింది.

"నాతో మాట్లాడాక నేనెవరో మీ భార్య చెపుంది!"

"కమలా!" అగ్చాడతను.

ఆమె వేగంగా ఫోన్ దగ్గరకు వచ్చింది. అతడు రిసీవర్ని ఆమె కిచ్చాడు.

"హలో, కమలా, నేను వెంటనే మీకు ఫోన్ చెయ్యలేక పోయినందుకు విచారిస్తున్నాను. రాత్రంతా మీరు జాగారం చేసి వుంటారు. ఐయామ్ సారీ! మీ అమ్మాయి రమ క్షేమంగా వుంది. హాయిగా నిద్రపోతోంది."

"హలో, ఎవరు మీరు?"

"చెప్పే మీకు ఉపయోగపడదు. మనం బిజినెస్‌కి వద్దాం. మీకు రమ కావలి. నాకు డబ్బు కావాలి!"

కమల ఒళ్ళు వణుకుతోంది. దినకర్ పక్కనే నిలబడి వున్నాడు.

"మిసెస్ కమలా, విన్నారా?"

ఆమె కంఠం సహజంగా లేదు. కంఠం మార్చి మాట్లాడుతున్నట్లుంది.

"చెప్పండి!"

"నాకు ఐదు లక్షలు కావాలి. అది నాకు చేరగానే రమ క్షేమంగా మీ యింటి కొచ్చేస్తుంది," అంది అటువైపు స్త్రీ.

"నేను యివ్వలేక పోతే?" అంది కమల.

అటువైపు నుంచి గంభీరంగా నవ్వు వినపడింది.

"ఇవ్వకపోతే రమ యింటికి రాదు. మీకు దూరంగా ఏ వీధిలోనో కళ్ళు లేని రమ ముష్టెడుక్కుంటూ వుంటుంది. ఆ స్థితికి మీ రామెను పంపరని ఆశిస్తున్నాను."

కమల ఏడ్వసాగింది.

"రమను హింసించకండి! దాన్నేమీ చేయొద్దు!" అరిచిందామె.

"మీరు మమ్మల్ని ఫోర్స్ చేస్తేగాని ఆమెను కష్టపెట్టం."

"నా దగ్గర ఐదులక్షలు లేవు. నా భర్తది అంత పెద్ద వ్యాపారం కాదు. అంత డబ్బు ఆయనివ్వలేరు."

"మిసెస్ కమలా, మీరు సుబ్బారావుగారి కుమార్తె అన్న విషయం మర్చిపోతున్నారు. ఐదు లక్షలు ఆయనకు ఐదురూపాయలతో సమానం!"

"చూస్తాను," అంది కమల.

"మిసెస్ కమలా, పోలీసులను మా వెనక పంపడానికి ప్రయత్నిస్తే రమకు ప్రమాదం వాటిల్లుతుంది. జాగ్రత్త!"

అటువైపు నుండి రిసీవర్ పెట్టేసిన శబ్దం వెలువడింది. రిసీవర్ని పెట్టేసి కమల భర్తవైపు చూసి యేడ్వసాగింది.

అతడామెను తీసుకెళ్ళి సోఫాలో పడుకోబెట్టి పక్కనే కూర్చున్నాడు.

"కమలా, అంతా చెప్పు!"

"రమ క్షేమంగా వుంది. ఐదు లక్షలు యిస్తే వాళ్ళు మన పిల్లను యిక్కడకు పంపిస్తారు. అంత డబ్బు యెలా

యివ్వడం?"

"కమలా, మనకు మన పిల్ల ముఖ్యం. డబ్బుకాదు. నా ఫాక్టరీ అమ్మేసి ఐదు లక్షలూ ఇచ్చేద్దాం" అన్నాడు దినకర్.

"ఫాక్టరీ అమ్మేస్తే తర్వాత ఎలా బతుకుతాం?"

దినకర్ ఆలోచిస్తూ వుండిపోయాడు.

"ఏదో చేసి యివ్వాలిగా!" అన్నాడు మెల్లిగా.

"నా నగలు అమ్మేద్దాం," అందామె.

"లక్ష రూపాయలు రావచ్చు. అది చాలదు."

"బేరం ఆడితే వాళ్ళు దిగుతారేమో!"

"బేరం ఆడుతూ మనం కాలయాపన చేస్తే మధ్యలో రమ నలిగిపోతుంది," అన్నాడతను.

క్షణకాలం గదిలో నిశ్శబ్దంగా వుంది. ఇద్దరూ వేర్వేరుగా ఆలోచిస్తూ వుండిపోయారు.

"ఈ ఫోన్ కాల్ గురించి పరశురామ్‌గారికి చెప్పాలి," అందామె.

"చెప్పాలా?" అన్నాడు దినకర్.

"ఆయన చెప్పమన్నారుగా?"

"ఆయనతో చెప్తే డబ్బు యివ్వద్దని అంటారు. దాని మూలంగా ఎన్నో సమస్యలు మనకు యెదురవుతాయి. డిటెక్టివ్‌లకూ, పోలీసులకూ దోషిని పట్టుకోవాలనే ఆరాటం ఎక్కువగా వుంటుంది. దోషిని పట్టుకోడం కోసం రమ ప్రాణాలు బలైనా వాళ్ళు బాధపడరు!" అన్నాడతను.

"అయితే చెప్పొద్దు?" అందామె.

"కమలా, ఒకలా చేద్దాం. ఫోన్ కాల్ గురించి పరశురామ్‌గార్కి చెబుదాం. కాని వాళ్ళకు డబ్బు యిచ్చే

టప్పుడు ఆయనకు తెలపకుండా ఉందాం. ఆ సమయంలో ఆయన మన్ని వెంటాడుతూ అక్కడికి కొస్తే రమకు ప్రమాదం!"

"అయితే అలాగే చేద్దాం," అంది కమల.

వంటామె మళ్ళా హాల్లోకొచ్చింది.

"అమ్మా, మీరు వద్దన్నా ఉప్మా తయారుచేశాను. కొంచెం తినండి. మీ రిద్దరూ యింట్లో తిండి మాని ఇలా నీరసంగా పడుంటే రమను తీసుకురావడానికి శక్తి ఎవరి కుంటుంది?" అందామె.

కమల భర్తవంక చూసింది.

"తిను కమలా, చాలా నీరసంగా వున్నావు!" అన్నా డతను.

టీపాయ్‌ను దగ్గరకు లాగాడు. దానిమీద రెండు ప్లేట్లను వంటామె పెట్టింది. గ్లాసుల్లో మంచినీళ్ళు వుంచింది.

ఇద్దరూ ఉప్మా తిన్నారు. వంటామె యిచ్చిన వేడి కాఫీ తాగారు. దినకర్ సిగరెట్ వెలిగించి పొగ వూదుతూ భార్యవంక చూశాడు.

"కమలా, వాళ్ళను పోలీసులకు పట్టివ్వడానికి మనం ప్రయత్నించకపోతే మన రమకు ఏ ప్రమాదమూ రాదు. అది క్షేమంగా యింటికొస్తుంది," అన్నాడు దినకర్.

"పరసురామ్‌గారితో చెప్పండి," అందామె.

# 6

టెలిఫోన్‌లో కమల మాట్లాడుతోంది. ప్రతి మాటా టేప్ మీద రికార్డవుతోంది, మరో రిసీవర్ గుండా నేను వింటున్నాను.

సిగరెట్ పీలుస్తూ నేను నిలబడ్డాను. దినకర్ భార్య

పక్కనే వున్నాడు.

"అంత డబ్బు యివ్వలేను. మీరు తగ్గించండి," అంది కమల.

"రమ ప్రాణానికి మీరు చాలా తక్కువ విలువ ఇస్తున్నారు! నే నడిగిన ఐదు లక్షలు చిన్న మొత్తం. సుబ్బారావుగారి ఏకైక మనుమరాలి విలువ యింకా యెక్కువ వుంటుంది."

"ప్లీజ్, నాన్న ఆస్తితో నన్నూ నా బిడ్డనీ ముడి పెట్టొద్దు. నా పెళ్ళయి తొమ్మిదేళ్ళు దాటింది. ఎంత కాలం నాన్న నా కివ్వగలడు? ప్లీజ్, యెంతో కొంత తగ్గించండి!"

"బేరం చేయడం రమకు మంచిది కాదు. ఐదులక్షలు! ఒక్క పైసా తగ్గడానికి వీలులేదు."

తికమకలు పడ్తున్న కమలను ఒప్పుకోమని సౌజ్ఞ చేశాను.

"ఆల్ రైట్, యిస్తాను."

"మిసెస్ కమలా, మీరిప్పుడు సరైన తోవకొచ్చారు. రమతో మాట్లాడితే మీరు సంతోషిస్తారు."

అటువైపునుంచి రమ కంఠం వినపడింది.

"అమ్మా! అమ్మా!" రమ ఏడుస్తోంది.

"ఏడవకమ్మా, నువ్వు మా దగ్గరకు తొందరగా వచ్చేస్తావు," అంది కమల.

"నన్ను యిక్కడి కెందుకు పంపారమ్మా?"

"రమా, భయపడకు!" అని రిసీవర్ని దినకర్ కి ఇచ్చింది.

"రమా!" అరిచాడు దినకర్.

"నాన్నా, నన్ను యింటికి తీసుకుపో నాన్నా!"

"అలాగే నమ్మా."

కమల రిసీవర్ని అందుకొంది. అటువైపు రమ లేదు.

"రమ మాటలు విన్నారా?"

"విన్నాను."

"ఐదు లక్షలు సిద్ధంగా వుంచండి. నూరు రూపాయల నోట్లలో అంతా వుండాలి. మళ్ళా ఫోన్ చేస్తాను. ఎలా మాకు డబ్బు యివ్వాలో తెలియ జేస్తాను," అందా స్త్రీ.

కమల ఏదో అడిగింది కాని అటువైపు ఫోన్ క్లిక్ మంది. రిసీవర్ని పెట్టేసి కమల నావైపు చూసింది. నా చేతిలో వున్న రెండో రిసీవర్ని పెట్టేశాను.

దినకర్, కమల సోఫాలో కూచున్నారు. ఎదురుగా కూర్చుని వాళ్ళవైపు చూశాను.

"ఐదు లక్షలు మీరు నిజంగా యివ్వదల్చారా?" అడిగాను.

"ఇవ్వక చేసేదేముంది?" అన్నాడు దినకర్.

"మిస్టర్ దినకర్, మీరు డబ్బిచ్చే సమయంలో నేను ఆమెను పట్టుకుంటాను. మీ డబ్బు మీకు మిగుల్తుంది."

"రమ ఏమవుతుందో?" అంది కమల.

"మిసెస్ కమలా, రమకు ఏ ప్రమాదం రాదు. మీరు డబ్బిచ్చే సమయంలో నేను అడ్డు రాను. మారువేషంలో ఎక్కడో వుంటాను. డబ్బు తీసుకున్న వ్యక్తిని వెంటాడ తాను. ఆ వ్యక్తి ద్వారా రమ యెక్కడున్నదో తెలుస్తుంది."

"పరశురామ్‌గారూ, డబ్బు తీసుకున్న వ్యక్తిని మీరు వెంటాడుతున్నట్లు వాళ్ళు గ్రహిస్తే రమ మీద పగ సాధిస్తారు," అన్నాడు దినకర్.

"మీ రిద్దరూ ఆలోచించండి! అక్రమంగా డబ్బు గుంజాలో డానికి ప్రయత్నించే వ్యక్తికి మనం లొంగి పోకూడదు. మీరు మర్యాదగా డబ్బు పట్టుకెళ్ళి యిస్తే రమ యింటికి రావచ్చు. కాని వాళ్ళు మళ్ళా మరెవర్నో యిలా ఎత్తుకుపోయి బ్లాక్ మెయిల్ చేస్తారు. అటువంటి దుర్మార్గులను మనం పట్టుకుని శిక్షించాలి," అన్నాను వుద్రేకంతో.

"పరశురామ్‌గారూ, మీరు చెప్పింది నిజమే. వాళ్ళకు డబ్బివ్వడం అంత తొందరగా జరగదు. ఐదు లక్షలు పోగుచెయ్యాలి. దానికోసం చాలా తాపత్రయపడాలి. అదంతా దొరికాక మీరు చెప్పినట్లే చేద్దాం," అన్నాడు దినకర్.

"మరో రెండురోజులదాకా మీకు కాల్ రాక పోవచ్చు. రాగానే నాకు చెప్పండి. ఏం చేయవలసిందీ ప్లాన్ చేస్తాను."

టేప్ రికార్డర్‌ను మూసి కోటుజేబులో పదేసుకుని, వాళ్ళకు బై బై చెప్పి బయట నున్న కారువైపు నడిచాను.

## 7

రమను ఎత్తుకుపోయి ఐదు రోజులైంది.

రెండు మూడు రోజులపాటు డబ్బుకోసం దినకర్ ఎన్ని చోట్లో ప్రయత్నించాడు. కాని అతడి ప్రయత్నాలు ఫలించలేదు.

సోఫాలో కూర్చున్న ఆమెవైపు దీనంగా చూశాడు దినకర్.

"కమలా, ఎక్కడా డబ్బు పుట్టడంలేదు. మార్కెట్ చాలా టైట్‌గా వుంది," అన్నాడతను.

"నాన్నను అడగనా?"

"అది నా కిష్టం లేదు! ఏది మంచిదో నువ్వే ఆలోచించు!"

"ఇంక వాళ్లు ఆగరు. అప్పుడే రెండుసార్లు ఫోన్ చేశారు," అందామె.

"నా బిడ్డను కాపాడి, ఇంటికి తెచ్చుకోలేని నిర్భాగ్యుడిని!" అని ఏడ్వసాగాడు దినకర్.

అతడి కళ్ళు నీళ్ళతో నిండాయి. అతడు కళ్లు మూసుకుని ఏడుస్తున్నాడు. ఆమె అతడి చెయ్యి పట్టుకొంది.

"మీరు బాధపడకండి. నాన్నతో మాట్లాడతాను."

"ఆయన కెలా ఫోన్ చేస్తావు? ఆయన ఏ ఊళ్ళో వుంటారో!"

"కాస్సేపట్లో నాన్నే ఫోన్ చేస్తాడు. అప్పుడు అడుగుతాను." అందామె.

మరో అరగంటిలో ఢిల్లీ నుంచి కాల్ వచ్చింది.

"అమ్మాయి, న్యూస్ ఏమిటి? రమ ఇంటికొచ్చిందా?" అడిగాడు సుబ్బారావు.

"నాన్నా, వాళ్లు ఐదు లక్షలు అడుగుతున్నారు!" అందామె.

"నువ్వు లక్కీ! ఏ యాభైయ్యో అడుగుతా రనుకున్నాను."

సుబ్బారావు భాషలో యాభై అంటే యాభైలక్షలు. ఒకటంటే ఒక లక్ష!

"నాన్నా, డబ్బు సర్దుబాటు కాలేదు...."

"అమ్మాయి, డబ్బు యెప్పు డివ్వాలి? యెలా యివ్వాలి?"

"ఐదు లక్షలు నూరు రూపాయల నోట్లలో కావాలన్నారు. డబ్బు సిద్ధంగా వుంచమన్నారు. తర్వాత ఏం చెయ్యాలో చెప్తానన్నారు."

"కాలయాపన యెందుకు? డబ్బు సిద్ధంగా వుందని చెప్పు. మన మద్రాసు ఆఫీసు మేనేజర్ శ్రీకాంత్ కి యిప్పుడే ఫోన్ చేసి చెప్తాను. అతను ఐదూ పట్టుకెళ్ళి వాళ్ళ కిస్తాడు. చాలా?"

"థాంక్స్ నాన్నా. మళ్ళా మీతో యెలా మాట్లాడం?"

"నే నెక్కడుంటానో నాకే తెలియదు. నేను మీకు ఫోన్ చేస్తూ వుంటాను. అప్పుడే నాతో మాట్లాడాలి. డబ్బు విషయం శ్రీకాంత్ తో మాట్లాడొచ్చు. సరేనా?"

"ఆయనే పట్టుకెళ్ళి డబ్బు యిస్తానంటారేమో!"

"వద్దు! దినకర్ వెళ్ళడం నా కిష్టంలేదు. వాళ్ళు కావాలన్న ఐదూ శ్రీకాంత్ యిస్తాడు. ఇంకా ఏమైనా చెప్పాలా?"

"అంతే నాన్నా."

ఆమె రిసీవర్ని పెట్టేసింది. పక్క నున్న దినకర్ వైపు చూసింది.

"నాన్న యిస్తున్నాడు," అందామె.

అంతా ఆమె భర్తతో వివరంగా చెప్పింది.

"కమలా, శ్రీకాంత్ వెనక మీ నాన్న పోలీసులను పంపితే రమకు ప్రమాదం రావచ్చు."

"ఎవర్నీ పంపొద్దని చెప్తాను," అందామె.

రాత్రి ఎనిమిదైంది. టెలిఫోన్ మ్రోగింది. కమల రిసీవర్ని ఎత్తింది.

"హలో, కమల స్పీకింగ్!"

"అమ్మా, నేను శ్రీకాంత్ ని. ఐదూ నూరురూపాయిల నోట్లతో తయారుగా వుంది. ఏ క్షణంలో కావలసినా నేను మీకు దొరుకుతాను. ఆఫీసులోనో ఇంట్లోనో వుంటాను. డైరక్టరీ చూసి నాకు ఫోన్ చేయవచ్చు."

"అలాగే మిస్టర్ శ్రీకాంత్!" అందామె.

అటువైపు అతడు రిసీవర్ పెట్టేశాడు. బాత్ రూమ్ లోంచి దినకర్ గాభరాగా వచ్చాడు.

"ఎవరు వాళ్ళేనా?"

"కాదు, శ్రీకాంత్," అందామె.

ఇద్దరూ సోఫాలో కూర్చున్నారు. నిముషాలు కదులు న్నాయి. టెలిఫోన్ మ్రోగింది. కమల వెళ్ళి రిసీవర్ని అందుకుంది.

"హలో, కమల స్పీకింగ్!"

"ఐదు లక్షలూ సిద్ధంగా వుందా?" అడిగిందా స్త్రీ అటువైపునుంచి.

"ఉంది."

"మిసెస్ కమలా, జాగ్రత్తగా వినండి. నల్లటి ప్లాస్టిక్ బాగ్ లో డబ్బు వుంచండి. ఈ రాత్రి పన్నెండింటికి ఆ బాగ్ పట్టుకుని అన్నా నగర్ లోని నాల్గో క్రాస్ రోడ్డ మ్మట మీ మనిషి నడుస్తూ వుండాలి. మా కారొచ్చి మీ పక్కనే ఆగుతుంది. 'రమా ప్లీజ్!' అనాలి మీ మనిషి. 'బాగ్ ప్లీజ్!' అంటాడు మా మనిషి. మీరు బాగ్ ను అందించాలి. కారు వెళ్ళిపోతుంది. మీ మనిషి యింటికి పోవచ్చు. పొద్దుటే రమ మీ యింటికి పంపబడుతుంది. పోలీసులు, డిటెక్టివ్ లు మా మనిషిని వెంటాడితే అది మేం తెలుసుకుంటాం. మీ రమ మీద పగ సాధిస్తాం!

బాగా విన్నారా?"

"విన్నాను."

"సరిగ్గా అంతా చేస్తే రమ యింటికొస్తుంది."

"ఆల్ రైట్, చేస్తాను."

కమల పక్కనున్న దినకర్ కి అంతా చెప్పింది. అతడు టైమ్ చూశాడు. తొమ్మిది కావస్తోంది.

రిసీవరెత్తి కమల ఒక నంబర్ తిప్పింది.

"శ్రీకాంత్ హియర్!"

"మిస్టర్ శ్రీకాంత్, వాళ్ళు యిప్పుడే ఫోన్ చేశారు. ఈ రాత్రి పన్నెండింటికి వాళ్ళకు డబ్బు యివ్వాలి," అందామె.

"ఇస్తాను," అన్నాడతను.

ఆమె అంతా వివరంగా చెప్పింది.

"చెప్పింది బాగా తెలిసిందా?"

"తెలిసిందమ్మా."

"మరో విషయం. మీరు డబ్బిస్తున్న విషయం పోలీసులకు చెప్పకూడదు."

"నా వెనక ఎవ్వరూ రారు."

"థాంక్స్, మిస్టర్ శ్రీకాంత్. అంతే" అని కమల రిసీవర్ని పెట్టేసింది.

ఆహ్లాదంగా ఆమె పక్కనున్న దినకర్ ని కౌగలించుకుంది.

"ఈ రాత్రి మనకు నిద్ర పట్టదు! పొద్దుటే రమ మన ముందు వుంటుంది," అందామె ఆనందంగా.

"అన్నీ సవ్యంగా జరగాలని దేవుడిని ప్రార్థించుదాం," అన్నాడు దినకర్.

హాల్లో లైట్లు వెల్గుతున్నాయి. భార్యాభర్తలు

రమను గురించి కలలు కంటున్నారు. టెలిఫోన్ మ్రోగింది.

"హలో!" అన్నాడు దినకర్.

"పరశురామ్ స్పీకింగ్, వాళ్ళు ఫోన్ చేశారా?"

"పరశురామ్‌గారూ, డబ్బింకా సిద్ధంగా లేదు. వాళ్లు ఫోన్ చేస్తే అదే చెప్పాం. రేపటిదాకా వాళ్ళు గడువిచ్చారు."

"ఆల్ రైట్, ఫోన్ చేస్తే నాకు చెప్పండి, గుడ్ నైట్."

రిసీవర్ పెట్టేసి దినకర్ భార్య పక్కకు వెళ్ళి కూర్చున్నాడు.

"పరశురామ్‌గారితో చెప్పాను, డబ్బింకా సిద్ధంగా లేదని."

"మంచిపని చేశారు," అందామె.

"రేపటిదాకా గడువిచ్చారన్నాను."

"అప్పటికి రమ మన యింట్లో వుంటుంది. అప్పుడాయనకు నిజం చెప్పొచ్చు," అందామె.

## 8

అన్నానగర్ నాల్గవ క్రాస్ స్ట్రీట్‌లో జనసంచారం లేదు. మేడల్లోనివాళ్లు హాయిగా నిద్రపోతున్నారు.

విశాలమైన స్ట్రీట్. లైట్లు వెలుగుతున్నాయి. టైమ్ పన్నెండయింది. నల్లటి ప్లాస్టిక్ బాగ్ పట్టుకుని అతడు రోడ్డు వారగా నడుస్తున్నాడు. వెనుకనుంచి ఏదో కారు వస్తోంది.

కారు అతడి పక్కనే ఆగింది. అతడు కారులోకి చూశాడు.

స్టీరింగ్ వీల్ వెనక ఒక మనిషి వున్నాడు.

"రమా ప్లీజ్!" అన్నాడతను.

"బాగ్ ప్లీజ్!" అందో కీచు కంఠం కార్లోంచి.

అతడు ముందు తలుపు తెర్చి బాగ్‌ను అందించాడు. కారు కదిలింది.

అమాంతంగా అతడు కార్లోకి మారి తలుపు మూశాడు.

తటాలున కారు ఆగింది.

"మిస్టర్ గడాన్!" డ్రయివర్ సీటులో వున్న వ్యక్తి అరుపు కీచుగా ధ్వనించింది.

మగాడి దుస్తుల్లో వున్న స్త్రీ అయి వుండాలామె!

"దిగాలనే వుద్దేశ్యంతో నే నెక్కలేదు! నీ ఇంటికి పద!" అర్చాడతను గంభీరంగా, పిస్టల్ని ఆమె వైపు గురిపెడ్తూ.

"రమకు ప్రమాదం వస్తుంది!"

"రమకంటె ముందు నువ్వు చస్తావు!" గద్దించాడు.

సుంగంబాకంలోని ఒక కాంపౌండులోకి కారు ప్రవేశించింది. కారులోంచి దిగి నలువైపులా అతడు చూశాడు. ఎక్కడా ఎవ్వరూ లేరు!

ఆమె కారులోనే కూర్చుని వుంది.

"కిందకు దిగు!"

ఆమె దిగింది. ఇంటి ముందున్న లైట్ కాంతిలో ఆమె వైపు పరీక్షగా చూశాడతను. సూటులో వుందామె. బాబ్డు హెయిర్, నల్లటి మీసాలు, గడ్డం తగిలించుకుంది.

"లోపలకు పద!" అర్చాడు.

భయంతో ఆమె తాళం తెరిచి లోపలకు వెళ్ళింది. పెద్ద హాలు. రెండు ట్యూబ్ లైట్లు ప్రకాశవంతంగా వెల్లు

టున్నాయి.

"నువ్వెవరు?" సూటిగా చూస్తూ అడిగాడు.

ఆమె తగిలించుకున్న మీసాలు, గెడ్డం వూడి కింద పడ్డాయి. ఆమె సోఫాలో కూర్చుని ఏడుస్తూ అతడివంక చూసింది.

"నీ పేరు?"

"మిసెస్ మొనికాజోన్స్" అందామె.

"రమ ఎక్కడుంది?"

"పక్క గదిలో నిద్రపోతోంది. ఆమెను మీకిచ్చేస్తాను. దయచేసి నన్ను పోలీసులకు అప్పగించకండి. నాది సింగపూర్. మీరు వదిలేస్తే సింగపూర్ వెళ్ళి పోతాను. ఇదంతా చేసింది నేను కాదు—రమ తండ్రి దినకర్!"

ఆశ్చర్యంగా ఆమె వైపు చూశాడు.

"ఆరు నెలల క్రితం ఒక హోటల్లో ఆయనతో నాకు పరిచయమైంది. ఆయన నన్ను ప్రేమిస్తున్నానన్నారు. ఇద్దరం యీ ఇంట్లో జీవిస్తున్నాం. నాతో సింగపూర్ రావాలని ఆయన ఆశ. రమను ఆయనే మారు వేషంలో ఎత్తుకు వచ్చి ఇక్కడ దాచారు. నేను ఫోన్లో ఆయన భార్యతో మాట్లాడేదాన్ని, బ్లాక్ మెయిల్ చేస్తూ. తన మామగారు సులువుగా ఐదు లక్షలు ఇస్తారని, అది పట్టుకుని సింగపూర్ పోవాలని ఆయన ప్లాను."

"నువ్వు ఇండియాకు ఎందుకు వొచ్చావు?"

"నా భర్త నన్ను వొదిలి ఇక్కడకు వచ్చేశాడు. అతడిని వెతకడం కోసం ఇలా వచ్చాను. దినకర్‌తో పరిచయం అయ్యాక నా భర్త కోసం వెతకడం మానేశాను" అందామె.

అతడు పక్క గదిలోకి వెళ్ళాడు. ఆమె లైట్ స్విచ్ నొక్కింది. డబుల్ కాట్ మీద రమ బంగారం బొమ్మలా నిద్రపోతోంది.

"మిసెస్ మొనీకా, రమను నేను నీ కారులో తీసుకు వెళ్తాను. నువ్వు సుఖంగా పడుకోవచ్చు! దినకర్ నీ కారును నీకు త్వరలో అప్పగిస్తాడు."

ఆమె మాట్లాడలేదు. రమను భుజంమీద పడుకోబెట్టి నల్లటి ప్లాస్టిక్ బాగ్ తీసుకుని అతడు బయటనున్న కారు వైపు నడిచాడు.

# 9

టైము ఒంటిగంట కావస్తోంది. కమల యింటిముందు కారాపి దిగాను. కమల, దినకర్ బయటకు పరుగెత్తు కొచ్చారు.

నన్ను చూసి యిద్దరూ ఆశ్చర్యపోయారు. కమల నా భుజం మీదకు వాలి పడుకున్న రమను ఆత్రంగా తీసుకుంది.

"పరశురామ్‌గారూ, ఏమైంది? రమ మీకు ఎక్కడ దొరికింది?" గాభరాగా అడిగాడు దినకర్.

అందరం హాల్లోకి చేరుకున్నాం. నిద్రపోతున్న రమ మేలుకుంది. కళ్ళు నులుపుకుని కమలను "అమ్మా!" అని కౌగలించుకుంది. తండ్రి ఒళ్ళోకి రమ అమాంతంగా వాలి పోయింది.

కమల నా వైపు తిరిగింది.

"పరశురామ్‌గారూ, ఇదంతా ఏమిటి? శ్రీకాంత్ వెనక మీరు వెళ్ళారా?" అడిగింది కమల.

"మిసెస్ కమలా, సుబ్బారావుగారు నాకు ఫోన్ చేసి మాట్లాడారు. డబ్బు పట్టుకెళ్ళి నన్నే ఇమ్మన్నారు.

శ్రీకాంత్ కి బదులు నే వెళ్ళాను. చివరకు డబ్బివ్వకుండా రమను తీసుకొచ్చాను" అన్నాడు దినకర్ వైపు ఓరగా చూస్తూ.

"పరశురామ్‌గారూ, చాలా థాంక్స్" అంది కమల.

"మిస్టర్ దినకర్, మీరు నన్ను మా ఇంటి దగ్గర కారులో దింపాలి. ఆ కారు వాది కాదు" అన్నాను.

బయటకు బాగ్ పట్టుకుని నడిచాను. ముందు సీటు మీద కూర్చున్నాను. దినకర్ మౌనంగా కారెక్కి కూర్చున్నాడు. కారును ముందుకు పోనిచ్చాడు.

"మిస్టర్ దినకర్, బాగా దిగజారిపోయారు!" అన్నాను.

"నన్ను క్షమించండి, సార్. వ్యాపారంలో సుబ్బారావుగారికున్న అదృష్టం నాకు లేదు. నా కంపెనీ స్థితి బాగాలేదు. అందుకే మనీతో సింగపూర్ పోవాలనుకున్నాను. నేను చాల నీచమైన పని చేశాను. ఇప్పుడు విచారిస్తున్నాను."

"మిస్టర్ దినకర్, మీ మావగారు నాతో ఏమన్నాడో తెలుసా?"

"చెప్పండి!"

"ఇదంతా అల్లుడు ఆడే నాటకం అయి వుంటుందన్నారు. ఆయన అన్నది నిజమైతే మీకు వార్నింగు యిచ్చి వదిలేయమన్నారు."

"పరశురామ్‌గారూ. మీకు నా ధన్యవాదాలు. ఇటుపైన సరైన తోవలో నడుస్తాను. దయచేసి యిది నా భార్యకు చెప్పకండి. ఇది తెలిస్తే ఆమె నన్ను అసహ్యించుకుంటుంది" బ్రతిమాలాడు దినకర్.

కాంపౌండులో కారు ఆగింది. కిందకు దిగి అతడివైపు

సూటిగా చూశాను.

"వెంటనే ఆమెను సింగపూర్‌కి పంపేయండి. అల్లుడిగా మీరు అడక్కపోయినా ఏదైనా సహాయం కావలిస్తే కమల అడిగితే ఆమె తండ్రి ఎంతయినా యిస్తారు. ఇటుపైన జాగ్రత్తగా వుండండి. ఐ విల్ బి వాచింగ్ యు!" అన్నాను.

గుడ్ నైట్ చెప్పి అతడు కారును గేటు బయటకు పోనిచ్చాడు.

—:ఐపోయింది:—

సీరియల్

# రక్తం త్రాగే పిశాచం

వసుంధర




(గత సంచిక తరువాయి)

మధు మాట్లాడకుండా బయటకు వెళ్ళిపోయాడు

అతను ముందు తిన్నగా ఆ ఊళ్ళోని ధర్మాసుపత్రికి వెళ్ళి

బ్లడ్ బ్యాంకు వ్యవహారాలు చూసే కౌంటర్ దగ్గరకు వెళ్ళాడు.

"నా పేరు మధు!" అన్నాడతను.

"వాట్ కెన్ఐ డూ ఫర్ యూ—" అన్నాడు కౌంటర్‌లోని వ్యక్తి.

"బ్లడ్ బ్యాంక్ వ్యవహారాలు చూస్తూంటారు కదా మీరు! సాధారణంగా ఔన్సు రక్తానికెంత తీసుకుంటారు?" అడిగాడు మధు.

"కొనేటప్పుడు ఇరవై రూపాయలు. అమ్మేటప్పుడైతే ముప్పై రూపాయలు—" అన్నాడా వ్యక్తి.

"నేను యాభై రూపాయలిస్తాను. రోజూ ఇదే రేటున రెండౌన్సుల రక్తం ఇస్తారా?" అనడిగాడు మధు.

ఆ వ్యక్తి తెల్లమొఖంవేసి—"జోక్ చేస్తున్నారా?" అన్నాడు.

"జోక్ చేయడంలేదు. ఔన్సుకు యాభై ఇస్తాను. రోజూ రెండౌన్సులు కావాలి—" అన్నాడు మధు.

"రోజూ ఎందుకు?"

"తాగడానికి!" అన్నాడు మధు చిరాగ్గా.

ఆ వ్యక్తికీ చిరాకేసింది—"ఇక్కడ రక్తం చిల్లరగా అమ్మరు. హాస్పటల్లో పేషంట్‌కి అవసరమైతే వాడతాం. దానికే రేటు కడతాం—" అన్నాడు.

"నేను వేళాకోళ మాడ్డంలేదు. కావాలంటే ఔన్సుకి వందరూపాయలు తీసుకోండి. ఏ మాటా చెబితే ఈ రోజు తొమ్మిది గంటలకు డబ్బు తీసుకుని వస్తాను—" అన్నాడు మధు.

"సరే—అలాగే రండి—" అన్నాడా వ్యక్తి—ఈ తమాషా ఏమిటో చూద్దామని!

మధు అక్కణ్ణించి తిన్నగా ఓ కెమికల్స్ షాపుకి వెళ్ళాడు.

"ఎస్ ప్లీజ్—" అన్నాడు షాపువాడు.

"మీరు శవాలను నిలవవుంచే ప్రెజర్వేటివ్స్ తయారు చేసి మెడికల్ కాలేజికి సరఫరా చేస్తారని విన్నాను. నాకు ఆ ప్రిజర్వేటివ్ కావాలి. ఎప్పుడివ్వగలరు?" అనడిగారు మధు.

"దాందేముంది—ఈ సాయంత్రానికే యివ్వగలం. పనేమిటో మీరు మాకు చెప్పాలి—"

"అవేమీ మీరు నన్నడక్కూడదు. మీ రడిగిందానికి రెట్టింపు ధర యిస్తాను. ఈ రోజు సాయంత్రం ఏడు దాటేక వస్తాను—రెండు వందల లీటర్లు సిద్ధంగా ఉంచండి—" అన్నాడు మధు.

"అలాగే—" అన్నాడు షాపువాడు.

మధు అక్కణ్ణించి తిన్నగా వకుళ ఇంటికి వెళ్ళాడు. అప్పటికి టైము మధ్యాహ్నం పన్నెండయింది.

తలుపులు గడియ వేసి వకుళ గదిలోనికి వెళ్ళి—"వకుళా!" అని పిలిచాడతను.

"ఊఁ! లోపలకు రా—తలుపులు వేయి—" అంది వకుళ.

మధు ఆమె గదిలో ప్రవేశించి తలుపు వేసేశాడు. "ఎక్కడ నువ్వు?"

"ఆకాశంలో సూర్యుడుండగా—నేను వెలుతుర్లో వుండలేను. చీకటి కావాలి నాకు. మధూ—అన్ని పనులూ సక్రమంగా అయ్యాయా?"

"అయ్యాయి. కానీ మనకి డబ్బు కావాలి...." అన్నాడు మధు.

"సాయంత్రం ఆరు దాటనీ—నీకు ఎంత కావాలంటే అంతా తెచ్చిస్తాను—" అంది వకుళ.

"వకుళా!" అన్నాడు మధు.

"ఏం-మధూ!" అంది వకుళ.

"ప్లీజ్! నా రక్తం తాగవూ?" అన్నాడు మధు.

"వద్దు మధూ! నేను రక్తం పీల్చడం మొదలుపెట్టానంటే నా తృష్ణ తీరదు. మొత్తం శరీరంలోని రక్తమంతా పీల్చేస్తాను. నిన్నలా చేయడం నా కిష్టం లేదు. అసలు మనుషుల రక్తం జోలికి వెళ్ళడం నా కిష్టంలేదు. అందుకే రోజూ రెండు ఔన్సుల రక్తం పుచ్చుకుందామనుకుంటున్నాను-" అంది వకుళ.

"అది నీకు సరిపోతుందా?"

"చూడు మధూ! రోజూ ఓ ఔన్సు పుచ్చుకుంటే బ్రాందీ యెంతో మంచిది. శరీరంలోని అన్ని విధులూ సక్రమంగా జరుగుతాయి. అదే బ్రాందీని సీసాలకు సీసాలు గడగడా పుచ్చుకుంటే-మనిషి మనసు వశం తప్పుతుంది. ప్రవర్తన మారిపోతుంది—ఆరోగ్యం చెడిపోతుంది. నా విషయంలో రక్తమూ అంతే! నేను సాధించవలసిన పనులెన్నో వున్నాయి. నేను నిగ్రహంగా ఉండదలిచాను. రోజుకు రెండు ఔన్సులు చాలు" అంది వకుళ.

"నీ కార్యదీక్ష గొప్పది వకుళా—నీ కెలా సాయపడగలనా అనే ఆలోచిస్తున్నాను—" అన్నాడు మధు.

"నాకు సాయపడగల వాడివి నువ్వు మాత్రమే ఉన్నావు—" అంది వకుళ.

"అమ్మ నా కోసం ఎదురుచూస్తూ ఉంటుంది. మరి నేను వెళ్ళిరానా!" అన్నాడు మధు.

"వెళ్ళి సరిగ్గా సాయంత్రం ఆరింటికి రా. అమ్మ పెట్టిన వన్నీ బుద్ధిగా తిను—" అంది వకుళ.

మధు లేచి ఇంటి బయటకు వచ్చాడు. సరిగ్గా అప్పు డతనికి ఎదురింటి పుల్లారావు ఎదురై—"అరే—యింట్లో ఎవరున్నారు?" అనడిగాడు.

"వకుళ-" సమాధానమిచ్చాడు మధు.

"వకుళక్కా! ఎప్పుడొచ్చింది?" అనడిగాడు పుల్లా రావు.

"నిన్న రాత్రి-"

పుల్లారావు ఆశ్చర్యంగా-"వకుళక్క వస్తే తాళం ఇమ్మనమని శారదపిన్ని చెవి ఇచ్చి వెళ్ళింది. మాకు తెలియ కుండా ఎలా వచ్చింది? ఒకవేళ అప్పుడు నేను పడుకుంటే అమ్మ ఇచ్చిందేమో?" అన్నాడు.

"అవన్నీ నా కెందుకు?" అని విసురుగా వెళ్ళి పోయాడు మధు.

పుల్లారావు ఇంట్లోకి వెళ్ళి—"అమ్మా! వకుళక్క నిన్న రాత్రి వచ్చిందటగా—నాకు చెప్పలేదేం?" అన్నాడు.

"వకుళొచ్చిందని ఎవరు చెప్పారు నీకు?" అనడిగింది కామేశ్వరమ్మ.

"మధు చెప్పాడు. అతను వాళ్ళింట్లోంచే వస్తున్నాడు. చూసి పలకరించాను—" అన్నాడు పుల్లారావు.

"అరే—మరి మనదగ్గర తాళంచెవైనా తీసుకోకుండా తలుపెలా తీసిందీ?" అనడిగింది కామేశ్వరమ్మ.

"నేను కనుక్కొని వస్తానే—" అంటూ పుల్లారావు ఎదురింటికి బయల్దేరాడు.

తలుపులు దగ్గరగానే వున్నాయి. తోశాడు. తెరుచు

కున్నాయి.

"ఎవ రది?" లోపల్నుంచి వకుళ కంఠస్వరం విని పించింది.

"నేను పుల్లారావుని!" అన్నాడు పుల్లారావు.

"ముందు వీధి తలుపులు వేసేయ్—" అంది వకుళ.

పుల్లారావు తలుపులు వేసేసేడు.

"ఇప్పుడు నువ్వు నా గదిలోది రా—" అంది వకుళ.

అన్ని వైపులా తలుపులు వేసి వుండడంవల్ల నేమో గది చీకటిగా వుంది—"ఏమీ కనపడడం లేదక్కా!" అన్నాడు పుల్లారావు.

"కనపడకపోతే పోనీలే—నా మాటలు వినబడుతున్నాయిగా—" అంది వకుళ.

పుల్లారావు నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ గది తలుపులు తీశాడు.

"అబ్బ—ఇక్కడా చికటే—ఇంత చీకట్లో ఎలా ఉన్నావక్కా?" అనడిగాడు పుల్లారావు.

"డాక్టరు చీకట్లో ఉండమన్నారు లే—అది సరే నువ్విప్పుడిక్కడికి ఎందుకొచ్చావు?" అనడిగింది వకుళ.

"శారద పిన్ని తాళం మా యింట్లో యిచ్చి వెళ్ళింది. తాళం లేకుండా నువ్వింట్లోకి ఎలా వచ్చావో తెలుసుకుందామని వచ్చాను!" అన్నాడు పుల్లారావు.

వకుళ అదోలా నవ్వింది—అట్టే శబ్దం కాకుండా! "నీ కక్కడా ఎప్పుడైనా తాళంచెవి పోతే నా దగ్గరకు రా—తాళం తీసిపెడతాను—" అంది.

"అదేంటక్కా అలా నవ్వుతావు—నాకు భయం వేస్తోంది—" అన్నాడు పుల్లారావు.

"నీకు భయమేస్తే వెళ్ళిపో—నా కిలా నవ్వడమే

వచ్చు—" అని మళ్ళీ నవ్వింది వకుళ.

పుల్లారావు చటుక్కున అక్కణ్ణించి లేచి పరుగు లంకించుకుని ఒక్క ఉదుటన తన యిల్లు చేరాడు.

"ఏమయిందిరా?" అంది కామేశ్వరమ్మ.

"వకుళ నన్ను భయపెడుతోంది. భయమేసి వచ్చే శాను—" అన్నాడు పుల్లారావు.

"ఛీ—పిరికి వెధవకానా—" అంటూనే ఆమె కొడుకుని ఆప్యాయంగా దగ్గరగా తీసుకుని—"ఆ పిల్లను వెళ్ళి కాస్త మందలించి వస్తాను—నువ్వింట్లో వుండు—" అంది.

"అమ్మా—వద్దే—నువ్వెళ్ళొద్దే—" అన్నాడు పుల్లారావు.

ఏమనుకుందో కామేశ్వరమ్మ అప్పటికి ఊరుకుంది.

# 16

సరిగ్గా సాయంత్రం ఆరయ్యేసరికి వీధి తలుపులు తీసుకుని బయటకు వచ్చింది వకుళ.

ఆ సమయంలో కామేశ్వరమ్మ ఎదురింటి వీధి అరుగుల మీద కూర్చుని ఉంది. వకుళ బయటకు రావడం చూస్తూనే—"ఏమమ్మా—యెలా ఉన్నావ్? ఎప్పుడొచ్చావ్?" అనడిగింది.

"ఒక్క రూపాయుంటే ఇస్తావా—పిన్నీ—కాస్సేపయ్యాక ఇస్తాను—" అంది వకుళ.

తన ప్రశ్నకు జవాబు చెప్పకుండా రూపాయడిగిన వకుళ కామేశ్వరమ్మను ఆశ్చర్యంతో ముంచింది. వకుళ తనను డబ్బడగడం ఇదే ప్రథమమావిడకు.

"దానికేముందమ్మా—ఇస్తాను—" అంటూ లోపలకు వెళ్ళింది కామేశ్వరమ్మ.

వకుళ ఆవిడ ఇంటి దగ్గరో నిలబడింది. ఈ లోగా మధు అలా వచ్చాడు—"మధూ! రిక్షా ఒకటి పిలు— సేట్ రతన్‌లాల్ ఇంటికి—రూపాయికంటే ఎక్కువివ్వనని చెప్పు—"

అలాగేనని వెళ్ళిపోయాడు మధు.

ఈలోగా కామేశ్వరమ్మ ఒక రూపాయనోటు తీసుకుని వకుళ వచ్చింది. వకుళ ఆత్రుతగా ఆ నోటు లాక్కుంది. అప్పుడు వకుళ చేయి కామేశ్వరమ్మకు తగిలింది. మంచుముంటి ఆ చల్లని స్పర్శకు ఉలిక్కిపడింది కామేశ్వరమ్మ—"అదేమిటమ్మా నీ చేయి అంత చల్లగా ఉంది—"

"ఇప్పుడే అయిస్ తిన్నాను—" అని వకుళ ఆవిడకు కాస్త దూరంగా వెళ్ళింది.

ఇంతలో మధు రిక్షాలో వచ్చాడు. ఇద్దరూ రిక్షా ఎక్కారు.

"చాలా చోద్యంగా వుందే దీని వ్యవహారం?" అనుకుంటూ బుగ్గలు నొక్కుకుంది కామేశ్వరమ్మ.

రిక్షా సేట్ రతన్‌లాల్ ఇంటిముందాగింది.

"మధూ! నువ్వు మాత్రం ఇక్కడే నిలబడివుండు నేను వచ్చేదాకా!" అంది వకుళ మధుతో. రిక్షావాడికి రూపాయిచ్చేసిందామె. రిక్షా వెళ్ళిపోయింది. మధు అక్కడే నిలబడిపోయాడు.

వకుళ నెమ్మదిగా గేటు దగ్గరకు వెళ్ళింది. ముఖం కనబడకుండా ముసుగు లాక్కుని వాచ్‌మాన్ దగ్గరకు వెళ్ళింది.

వాచ్‌మన్ తలెత్తి ఆమె వంక చూశాడు.

"సాబ్‌తో పనివుంది. ఉన్నారా?" అనడిగిందామె.

"వెళ్ళండి—" అన్నాడు వాచ్‌మన్. ఆడువారికా ఇంట ప్రవేశించడానికెన్నడూ ఎలాంటి అభ్యంతరాలూ ఉండవు.

ఆమె లోపలకు వెళ్ళి నాలుగడుగులైనా వెయ్యకుండా కుక్క ఒకటి మొరుగుతూ వచ్చి ఆమె చుట్టూ తిరగసాగింది.

వకుళ—ఛీ ఛీ—అన్నా కదలడంలేదు.

ఈలోగా తోటమాలి కాబోలు వచ్చాడు—"ఛీ—దీనికి బుద్ధిలేదు—" అంటూ కుక్క మెడకు గొలుసు తగిలించి—"మీరు లోపలకు వెళ్ళండమ్మా!" అన్నాడు.

రతన్‌లాల్‌ని కలుసుకుందుకు ఆడవాళ్ళు రావడం సర్వసాధారణం. వాళ్ళకే ఆటంకం కలిగించినా ఆయన సహించలేడు. అందుకే తోటమాలి కుక్కను లాక్కుని పోయాడు. అయితే అది వెనక్కు తిరిగి తిరిగి ఆగకుండా మొరుగుతూనే ఉన్నది.

"ఒక ఆడదాన్ని చూసి అది ఎందుకలా మొరుగుతుంది?" అని ఆశ్చర్యపడ్డాడు తోటమాలి.

ఇంతవరకూ ఏ ఆడదీ రతన్‌లాల్ని మోసం చేయడం జరగలేదు.

వకుళ బంగళాలో అడుగుపెట్టింది.

రతన్‌లాల్ తన కోసం కట్టించుకున్న ప్రత్యేకమైన బంగళా అది. అందులోనే అతడి డబ్బంతా ఉంటుంది. అక్కడే అతడి విలాస జీవితమూ గడుస్తుంది.

వకుళ చకచకా నడుచుకుంటూ ఓ గది తలుపు తోసింది.

అక్కడే ఉన్నాడు రతన్‌లాల్—తలుపు తోసుకొని ఓ యువతి ప్రత్యక్షంగానే—"ఎవరు పంపారు నిన్ను?"

అనడిగాడు.

వకుళ తలుపు వదిలేసి—"ఇది సౌండ్ ప్రూఫ్ గది కదూ?" అంది. తలుపు క్లిక్‌మని చప్పుడైంది.

రతన్‌లాల్ కిసుక్కుమని నవ్వాడు.

వకుళ గుమ్మం దగ్గరే ఆగిపోయింది—"ఇది సౌండ్ ప్రూఫ్ గదే కదూ—" అందామె మళ్ళీ.

"నీకేం భయంలేదు. ఇక్కడికి ఎవ్వరూ రారు—" అన్నాడు రతన్‌లాల్.

వకుళ గదిని పరిశీలిస్తోంది. గదిలో అందమైన డబల్ కాట్ ఉంది. ఓ పక్క ఇనప్పెట్టె ఉంది. నేలంతా ఖరీదైన కార్పెట్ పరిచివుంది. గోడలకు దేవుళ్ళ పటాలు తగిలించి ఉన్నాయి.

"ఎవరూ రాకూడను. చూడకూడదు!" అంది వకుళ.

"అవునవును-" అంటూ రతన్‌లాల్ దేవుడి పటాలను వెనక్కు తిప్పి—"ఇది పాపపు పని అని నాకు తెలుసు. అందుకే దేవుడి పటాలను అలా తిప్పుతాను—"

వకుళ నవ్వింది. శబ్దం దాటి బయటకు వెడుతుందేమో నన్నట్లు నెమ్మదిగా భయంకరంగా నవ్వింది.

రతన్‌లాల్ ఉలిక్కిపడి-"అదేం నవ్వు?" అన్నాడు.

"అన్నట్లు ఇది సౌండ్‌ప్రూఫ్ గది కదూ!" అంటూ బిగ్గరగా నవ్వింది వకుళ.

ఒక ఆడది అంత గట్టిగా, భయంకరగా నవ్వగలదని రతన్‌లాల్ ఊహించలేదు. అతడి గుండె లవిసిపోయాయి-"అదేం నవ్వు—నువ్వు మనిషివా — పిశాచానివా?" అన్నాడు.

వకుళ నవ్వు ఆపేసి రతన్‌లాల్ కళ్ళలోకి చూసింది.

"అలాగే చూడు....ఆహా నీ కళ్ళు—ఎంత అంద

మైనవి....ఎంత అంద మైనవి....ఎంత....అంద..." అంటూ తడబడ్డాడు రతన్‌లాల్. చూస్తున్న కొద్దీ ఆ కళ్ళలో క్రూరత్వం పెరుగుతున్నట్లనిపించిందతడికి— "ఏమిటలా చూస్తున్నావే ?" అన్నాడాఖరికి.

"ఇనప్పెట్టె తెరు...." అంది వకుళ.

"ఎందుకు?"

"నాకు డబ్బు కావాలి...."

"ఎలాగూ ఇస్తానుగా—కాస్సేపయ్యాక—"

"నాకు ఇప్పుడే కావాలి. అవతల నా మనిషి డబ్బు కోసం ఎదురు చూస్తున్నాడు...." అంది వకుళ.

"ముందు డబ్బు....చస్తే ఇవ్వను—" అన్నాడు రతన్‌లాల్.

"ముందు డబ్బు....ఇవ్వకపోతే చస్తావ్-...." అంది వకుళ.

రతన్‌లాల్ ఆమెవైపు చూడబోయి—ఆ చూపులకు భయపడి తలవంచుకుని—"నువ్వు నాకొద్దు—అవతలకు పో—" అన్నాడు.

"కానీ నాకు నువ్వు కావాలి—" అంటూ వకుళ రతన్‌లాల్‌ని సమీపించి గట్టిగా కౌగలించుకుంది.

చల్లటి ఆమె స్పర్శ!

కెవ్వుమన్నాడు రతన్‌లాల్!

"ఇది సౌండ్‌ప్రూఫ్ గది కదూ—" నవ్విందామె. నెమ్మదిగా భయంకరంగా ఉందా నవ్వు.

"నన్ను వదులు...." అన్నాడు రతన్‌లాల్. ఆమె పట్టు వదిలించుకోవడం చాలా కష్టంగా ఉన్నదతడికి.

వకుళ మరింత బలంగా అతణ్ని కౌగలించుకుంది.

"నన్ను చంపేస్తున్నావు .... చంపేస్తున్నావు ....

వదులు....నువ్వు కోరిన డబ్బిస్తాను...."

రతన్‌లాల్‌ని మరింత బలంగా కౌగలించుకుందామె. అతడికి ఊపిరి సలపలేదు. దానికి తోడు భరించ శక్యం గాని ఆమె శరీరపు చల్లదనం.

వకుళ తన పట్టు సడలించింది. రతన్‌లాల్ ఉన్న వాడున్నట్లు కుప్పలా కూలిపోయాడు.

వకుళ అతడి పక్కనే కూర్చుంది. నీరసంగా కళ్ళు విప్పి చూశాడు రతన్‌లాల్ — ఇప్పుడామె చూపులు చూస్తూంటే మేకవైపు చూస్తున్న తోడేలు గుర్తుకొస్తుంది.

"ఎవర్నువ్వు?" అన్నాడు రతన్‌లాల్.

వకుళ అతడి చేతిని అందుకుంది. అరచేతిని ఆప్యాయంగా ముద్దు పెట్టుకుంది. తరువాత నాలిక జాపి— అతడి చేతిని నాకడం మొదలు పెట్టింది. ఆ స్పర్శ మృదువుగా కాక — అమరాతి స్పర్శలా ఉన్నది రతన్‌లాల్‌కి. అయితే అతడికిప్పుడు కాలు, చేయి స్వాధీనంలో లేవు. నిస్సహాయుడై జరుగుతున్నది చూస్తున్నాడు.

వకుళ అలా భుజంవరకూ నాలికతో నాకింది. అక్కడ ఓ సారి ఆగింది. తర్వాత....

కెవ్వుమని అరిచాడు రతన్‌లాల్.

కానీ రెండు మూడు నిముషాలామె పళ్ళు పదునైన కత్తుల్లా తన భుజంలోకి దిగబడి వుంటే అతడు మౌనంగానే వున్నాడు. ఆమె చేతిని వదిలి—చీర కొంగుతో మూతిని తుడుచుకున్నది. తర్వాత తన అరచేతిలో— భుజానికైన గాయంమీద కాసేపు మర్దనా చేసింది.

రతన్‌లాల్ ఆమెవంక అభిమానపూర్వకంగా చూసి "నీ పేరేమిటో తెలుసుకోవచ్చా?" అన్నాడు.

"వకుళ!" అందామె.

"వకుళా—నాదో చిన్న కోరిక—" అన్నాడు రతన్‌లాల్.

"చెప్పు—" అంది వకుళ.

"ప్లీజ్—నా రక్తం తాగవూ?" అన్నాడు రతన్‌లాల్.

వకుళ తన మామూలు నవ్వు నవ్వి—"అలాగే రతన్‌లాల్! కానీ ఇప్పుడు కాదు. ఇప్పుడింకా రక్తం తాగితే నువ్వు చచ్చిపోతావు—" అంది.

"నువ్వు రక్తం తాగితే నేను చచ్చిపోయినా నాకు బాధ లేదు—" అన్నాడు రతన్‌లాల్.

"అయితే నువ్వు నన్ను సేవించవా? కొంతకాలం నాకు సేవలు చేయాలని లేదా నీకు?" అనడిగింది వకుళ తీవ్రంగా.

"నువ్వెలాగంటే అలాగే—ఆజ్ఞాపించు—" అన్నాడు రతన్‌లాల్.

"నా అనుచరుడు, నీ మిత్రుడు అయిన మధు బయట నిలబడి ఉన్నాడు. ఈ రోజునుంచీ మీ రిద్దరూ మంచి స్నేహితులు. మధు యెప్పుడు యెంత డబ్బడిగినా నువ్వివ్వాలి—" అంది వకుళ.

"అలాగే—ముందు నా మిత్రుణ్ని పిలు—" అన్నాడు రతన్‌లాల్.

"అయితే ఈ గదిలోకి మనుషుల్ని పిలిచే మార్గం లేదా?" అంది వకుళ.

"లేకేం? మంచానికి అవతలిపక్క కాలింగ్ బెల్ ఉంది. కానీ నా కిప్పుడు నీరసంగా ఉంది—లేచి అక్కడిదాకా వెళ్లలేను—" అన్నాడు రతన్‌లాల్.

వకుళ అతణ్ని మంచానికి తలపక్క పడుకోబెట్టింది. తను అవతలివైపుకి వెళ్ళి పడుకుని కాలింగ్ బెల్ మ్రోగించింది. క్షణాలమీద ఓ మనిషి గదిలోకి వచ్చాడు.

వకుళ అతడికి మధు గురించి చెప్పి గదిలోకి పంపమని చెప్పింది. అతడు వెళ్ళిపోయాడు.

కాసేపటికి మధు లోపలకు వచ్చాడు. అతణ్ని చూడగానే రతన్‌లాల్ కుత్సాహం వచ్చింది. మంచంమీద నించి లేచివెళ్ళి అతణ్ని కౌగలించుకున్నాడు.

"మధూ! సేఠ్ ఇచ్చిన డబ్బు తీసుకుని మన కావలసిన వస్తువులన్నీ ఇల్లు చేర్చు—" అంది వకుళ.

రతన్‌లాల్ ఇనప్పెట్టె తెరిచి మధుకు డబ్బిచ్చాడు. మధు వెళ్ళిపోయాడు. రతన్‌లాల్ యినప్పెట్టె మూసేశాడు.

"ఇప్పుడు నే నేం చేయాలి?" అన్నాడు రతన్‌లాల్.

"అర్జంటుగా డాక్టర్‌కి కబురు చేసుకుని వైద్యం చేయించుకో—నీ ప్రాణాలు నీకు ముఖ్యం కాకపోయినా నాకు ముఖ్యం—" అంది వకుళ.

"నాకు బాగానే ఉన్నది. నాకే వైద్యమూ అవసరంలేదు—" అన్నాడు రతన్‌లాల్.

"అయితే సరేలే—సరైన వైద్యుణ్ని నేను పంపిస్తాను—" అంది వకుళ. ఆమె లేచి నిలబడింది.

"వెళ్ళిపోతావా, వకుళా!" అన్నాడు రతన్‌లాల్ ఆత్రుతగా.

"వెళ్ళినా మళ్ళీ వస్తాగా—" అంది వకుళ.

వకుళ గదిలోంచివెళ్ళిపోతూంటే రతన్‌లాల్ జాలిగా చూస్తూండిపోయాడు.

రతన్‌లాల్ ఇంటినుంచి వకుళ తిన్నగా ఇంటికి వెళ్ల లేదు. తన దారిని బజారువైపు మళ్ళించింది.

ముందామె ఒక బట్టలషాపులోకి వెళ్ళింది.

"లేటెస్టు డిజైన్సు చూపించు—" అందామె సేల్సు బాయ్‌తో.

"క్రీమ్ షిఫాన్ చూడండి—" అంటూ సేల్స్‌బాయ్ ఆమె ముందో పాతిక చీరలు పడేశాడు.

"గుడ్డ బాగుంది. ఒక్కటీ రంగు నచ్చలేదు—" అందామె.

"ఇందులో అన్ని రంగులూ ఉన్నాయి. లేనిదల్లా బ్లడ్ రెడ్ ఒక్కటే—" అన్నాడు సేల్సుబాయ్.

"ఏమన్నావ్?" అనడిగిందామె.

"బ్లడ్ రెడ్—అంటే రక్తవర్ణం—" అన్నాడు సేల్సు బాయ్.

"నా దగ్గర రక్తం పేరెత్తకు. నాకు రక్తం తాగా లనిపిస్తే నీ వంట్లో ఒక్క రక్తపు చుక్క కూడా మిగ లదు—" అంది వకుళ తీవ్రంగా.

ఎందుకో ఆమెకు కోపం వచ్చిందని అనుకున్నాడు సేల్స్‌బాయ్—"నే నన్న మాటల్లో తప్పేముందమ్మా" అన్నాడు కంగారుగా.

"తప్పేం లేదు. ప్రమాదమే ఉంది. ఇంకేమైనా చీరలు చూపించు—" అంది వకుళ.

"కస్టమర్సు చాలామంది జోకులేశారు కానీ ఇలాంటి జోకు యెవ్వరూ వేయలేదు—" అని తనలో తను గొణుక్కుంటూ సేల్స్‌బాయ్ ఆమెకు చీరలు చూపిం చాడు.

రెండు తెల్లటి చీరలు తీసుకుని వాటిమీదకు బ్లౌజ్ పీసెస్ తీసుకుని ఆమె బయటకు నడిచింది. కౌంటర్లోని వ్యక్తి ఆమెను వారించి—"డబ్బివ్వకుండా వెళ్ళిపోతున్నారు మీరు!" అన్నాడు.

"డబ్బు నే నెప్పుడూ ఇవ్వను. సేఠ్ రతన్‌లాల్‌కు ఫోన్ చేయి—" అంది వకుళ నిర్లక్ష్యంగా.

"ఓయ్—ఇది రతన్‌లాల్ సరుకా?" అన్నాడు కౌంటర్లోని వ్యక్తి నిరసనగా.

"ఏమన్నావ్?" అంటూ వకుళ ఒక్కడుగు వెనక్కు వేసి కౌంటర్లోని వ్యక్తిని సాచి లెంపకాయ కొట్టింది.

అంతే! ఆ వ్యక్తి కళ్ళు తిరిగి దబ్బున నేలకూలాడు.

వకుళ అక్కడే నిలబడి—"ఎవరనుకుంటున్నావురా నన్ను?" అని గద్దించి ఇంకా ఏమో అంటోంది.

అక్కడంతా చుట్టూ మూగారు. పడిపోయిన వ్యక్తి ఇంకా లేవలేదు.

"ఆడది కాస్త నదురుగా కనపడేసరికి—వెధవలకి నోళ్ళు తిన్నగా వుండవు—" వకుళ ఇంకా గొణుగుతూనే ఉంది.

"ఏమయింది? ఏమయింది?"....—జనం యెక్కువయ్యారు.

వకుళ షాపులోంచి రోడ్డుమీదకు వచ్చేసింది. అక్కడెవ్వరూ ఆమెను పట్టించుకోలేదు. కౌంటర్ వ్యక్తి ఏదో తప్పు మాట అంటే ఆమె అతణ్ని కొట్టిందనే అంతా అనుకున్నారు తప్పితే ఆమె డబ్బివ్వకుండా వెళ్ళిపోతోందని ఎవ్వరూ ఊహించలేదు.

వకుళ అక్కణ్నించి తిన్నగా ఓ టైలరింగ్ షాపుకి వెళ్ళి—"జాకెట్లు కుట్టివ్వాలి—" అంది.

"ఎప్పటికి కావాలి?"

"రేపటికి—"

"ఛార్జి ఎక్కువవుతుంది—"

"ఎంతయినా ఫరవాలేదు—" అంది వకుళ. ఆమె గుడ్డలు టేబిల్ మీద పెట్టింది. "కానీ లేటెస్టు ఫేషన్‌లో కుట్టాలి—"

"అది జాకట్టుందా?"

"లేదు—"

"మరెలాగమ్మా?"

వకుళ చిన్నగా నవ్వి—"కొత్త ఫేషన్లో కుట్టమంటే అది జాకెట్టెలాగౌతుంది?" అంది.

ఆమె నవ్వు విని ఉలిక్కిపడ్డాడు షాపువాడు—"మీ నవ్వు చాలా విచిత్రంగా ఉంది—" అన్నాడు అప్రయత్నంగా. నిజానికా నవ్వు విచిత్రంగా లేదు. భయంకరంగా ఉంది.

"నువ్వు షాపుకి వచ్చినవాళ్ళ నవ్వెలాగుందో చెబుతూంటావా?" అంది వకుళ తీవ్రంగా.

షాపువాడు తడబడి—"షాపుగంట క్రితమే నా పార్ట్‌నర్ వెళ్ళిపోయింది. కొలతలివ్వడానికి మీరు రేపు రావాలి—" అన్నాడు.

"ఏం—నీకు కొలతలు తీసుకోవడం రాదా?" అంది వకుళ.

"వచ్చు. కానీ ఆడవాళ్ళకు ఆడవాళ్ళే...." అని నసిగాడు షాపువాడు.

"నాకలాంటి అభ్యంతరాలేమీ లేవు. బుద్ధి తిన్నగా ఉంటే—పరాయి ఆడది—చెల్లెలాంటి దన్న భావ

ముంటే—మగయితే నేమిటి—ఆడైతే నేమిటి—త్వరగా కొలతలు తీసుకో—" అంటూ లోపలకు వెళ్ళింది వకుళ.

"అంతా మీకులా ఉంటే యెంత బాగుణ్ను?" అంటూ ఆమె ననుసరించాడు షాపువాడు. ఆమె గురించి ఏమనుకున్నాడో యేమో—కొలతలు తీసుకుంటూ వేయ కూడనిచోట చేయి వేశాను. ఛర్రుమని లేచింది వకుళ.

"నేను చేయి చేసుకుంటే నీ పనేమవుతుందో తెలుసా?" అందామె అతడివంక తీవ్రంగా చూస్తూ.

షాపువాడు రవంత భయపడి—"పొరపాటయిందమ్మా—" అన్నాడు.

వకుళ ఆ రూంలోని కిటికీవైపు నడిచింది. మూసివున్న తలుపులు తెరిచింది. దానికి నాలుగు ఊచలున్నాయి. ఆమె ఒక ఊచను పట్టుకు లాగగానే చేతిలోకి ఊడి వచ్చింది. దాన్ని ఆమె దారాన్ని చుట్టినట్లు చుట్టి అక్కడ పడేసి—"పిచ్చి పిచ్చి వేషాలు వేస్తే నిన్ను కూడా ఆ ఊచలాగే చుట్టేయగలను—" అని—కిటికీ తలుపులు వేసివచ్చి మళ్ళీ తన స్థానంలో కూర్చుని—"ఇప్పుడు జాగ్రత్తగా కొలతలు తీసుకో—" అంది.

షాపువాడు క్రింద పడివున్న ఊచ వంకా బల్లమీద కూర్చున్న వకుళవంకా—మార్చి మార్చి చూశాడు. అతడి చేతులు వణికాయి. టేపు జారి క్రింద పడింది. వంగుని టేపు తీసుకుని శ్రద్ధగా ఆమె కొలతలు తీసుకున్నాడు. ఎక్కడా ఆమెను తాకకుండా జాగ్రత్తపడ్డాడు. ఒక విధంగా అది మంచిదే అయింది. అసలే భయపడిపోతున్న అతడు మంచువంటి ఆమె శరీరం తాకితే మూర్ఛపోయి ఉండేవాడే!

వకుళ షాపులోంచి బయటకు రాగానే షాపువాడు కిటికీ తలుపులు తెరిచాడు. అక్కడ ఒక ఊచ ఉండవలసిన స్థానంలో లేదు. కళ్ళు నలుపుకుని మళ్ళీ చూశాడు. తర్వాత నేలమీదకు చూశాడు. చుట్టగా పడి ఉంది ఊచ.

షాపువాడు ఊచను గట్టిగా లాగాడు. అది ఇసుమంత కూడా కదల్లేదు. క్రింద చతికిలబడి ఊచను తీశాడు. చుట్టగా ఉన్నదాన్ని విడదీయాలని ప్రయత్నించాడు. అది ఉన్నదున్నట్లుగానే ఉంది తప్పితే కదలడంలేదు. ఆ ఊచ చాలా బలమైనది. ఇంత బలమైన ఊచను ఒక ఆడది__అందులోనూ ఎంతో సుకుమారంగా ఉన్న పదునారేళ్ల పిల్ల__ఎలా వంచగలిగింది? అప్పుడే....అతడికి ఆమె నవ్వు గుర్తుకొచ్చింది. గుర్తుకు రాగానే ఆ నవ్వు చెవిలో వినిపించినట్లే అనిపించింది.

కెవ్వుమన్నాడు షాపువాడు.

అప్పటికి వకుళ ఆ కేక వినిపించనంత దూరంలో ఉంది.

ఆమె యింకే షాపులకూ వెళ్లలేదు. ఆ నాటికి ఆ మాత్రపు షాపింగుతో తృప్తిపడింది. అందుకని తిరుగు ప్రయాణమైంది.

వకుళ రిక్షా యెక్కలేదు. తాపీగా నడుచుకుంటూ వెళ్ళిపోతోంది.

వకుళ యింటికి కొంత దూరంలో ఓ సందు మళ్ళాలి. అది యిరుకు సందు. కానీ నడకకు దగ్గర దారి.

వకుళ ఇరుకు సందులోకి మళ్ళింది. అక్కడ కాస్త చీకటిగా ఉంది.

వకుళ చకచకా నడుస్తోంది. ఆ సమయంలో ఆ సందు

లోకే ఓ సైకిలు మళ్ళింది. సైకిల్ కొంతదూరం వెళ్ళగానే—ముందు ఎవరో నడుస్తున్నట్లు సైకిల్ మీది వ్యక్తి గ్రహించాడు. గట్టిగా బెల్ కొట్టాడు.

వకుళ తప్పుకోకుండా నడుస్తోంది.

అసలే అది ఇరుకు సందు. ఆ వ్యక్తి సైకిల్ స్లో చేసి బెల్ కొట్టసాగాడు.

వకుళ చెవిటిదానిలా ముందుకు నడుస్తోంది.

తన ముందు నడుస్తున్నది ఒక ఆడపిల్ల అని సైకిల్ రౌతు గ్రహించాడు. మరోసారి బెల్లు మోగించినా ఆమె తప్పుకుని దారి ఇవ్వకపోయేసరికి అతడికి కోపం, పౌరుషం వచ్చాయి. అందులోనూ ముందున్నది ఆడపిల్ల!

అతను సైకిల్ స్పీడు పెంచి ఆమెను గుద్దేశాడు. అంతే!

అతడూహించినట్లుగా ఏమీ జరగలేదు. వకుళకు దోమ తాకినట్లుగా కూడా ఉన్నట్లులేదు. ఎటొచ్చీ ఆమె వేగాన్ని తగ్గించి నెమ్మదిగా నడుస్తోంది.

అతగాడి సైకిల్ ఏదో పెద్ద ట్రక్కుకు ఢీకొన్నట్లుగా ముందు భాగమంతా తుక్కుతుక్కయిపోయింది. అతను క్రింద పడిపోయినా స్వల్ప గాయాలతో బయట పడ్డాడు.

అతడు కళ్ళు నలుపుకుని లేచేసరికి వకుళ సందు మళ్ళుతోంది.

“ఎవరామె? మనిషేనా?” అనుకున్నాడతను.

అలా అనుకోగానే అతడి నరనరాల్లో భయం పుట్టుకొచ్చింది.

ఓసారి చుట్టూ చూశాడు. సందులో ఎవ్వరూ లేరు. రోడ్డుమీద అడ్డంగా ఇంకేమీ లేవు.

సందేహంలేదు—తన సైకిల్ ఆమెకే గుద్దుకుంది.

అయితే ఇది సంభవమా? తన మాటలు ఎవరైనా నమ్ముతారా? ఏదో యాక్సిడెంట్ చేసి కాకమ్మ కథలు కల్పిస్తున్నా డనుకుంటారు. ఇంతకీ ఆమె ఎవరో?

ముందుకు వెళ్ళి ఆమెను చూడాలో—వెనక్కి ఆగి తన సైకిల్ సంగతి చూసుకోవాలో తెలియలే దతడికి. ముందుకు వెళ్ళి ఆమెతో మాట్లాడ్డానికి భయం వేసిందో యేమో—అతడు సైకిల్‌ను భుజానికెత్తుకుని వెనక్కి మళ్ళాడు.

వకుళ మాత్రం ముందుకే వెడుతూ నెమ్మదిగా తన ఇల్లు చేరుకుంది. ఆమె వెళ్ళిన చాలా సేపటివరకూ మధు రాలేదు. అతను వస్తూనే చాలా సరంజామాతో వచ్చాడు.

అన్నీ తన గదిలో సర్దించింది వకుళ.

రిక్షావాళ్ళు వెళ్ళిపోయాక—మధు తెచ్చిన నిలువెత్తు గాజు సిలిండర్‌ని గదిలో ఓ మూలగా జరిపింది. అతడు తీసుకువచ్చిన రెండువందల లీటర్ల సాల్యూషన్లోంచి ఆ గాజు సిలిండర్లో పట్టినంత పోసి—దానికి మూత పెట్టింది.

"రక్తం తెచ్చావా మధూ!" అనడిగింది.

మధు ఆమెకు ఓ బాటిల్ అందించాడు. గటగటా తాగేసింది వకుళ.

"నీ దగ్గర డబ్బుందా?" అనడిగింది మధుని.

"బోలెడుంది—"

"ఓ రూపాయిలాగియ్యి—"

మధు యివ్వగానే—దాన్నామె ముద్దుపెట్టుకుని—"పాపం—ఇది కామేశ్వరమ్మగారిది. వెళ్ళేటప్పుడు తిరి

గిచ్చేసేయ్—" అంది. మధు ఆ రూపాయ అందుకొన్నాడు.

"మధూ! రేపు వీలు చూసుకుని మళ్ళీ రా. ఈ రోజు కింక నువ్వు వెళ్లవచ్చు. స్నానం చేయాలని నా శరీరం కోరుతోంది—" అంది వకుళ.

"అయితే వెడుతున్నాను. మళ్ళీ రేపు కలుస్తాను—" అన్నాడు మధు.

"అన్నట్లు చెప్పడం మరిచాను. ఉదయం మీ ఇంటికి వచ్చిన డాక్టర్ని రతన్‌లాల్ ఇంటికి పంపించు. ఆయనైతే అలవాటుమీద వెంటనే రోగనిదానం చేస్తాడు—" అంది వకుళ.

మధు వెళ్ళిపోగానే వకుళ తన బట్టలన్నీ విప్పి పక్కన పెట్టి చేతులు గాలిలోకి సాచింది. అప్పుడామె చిత్రంగా గాలిలోకి ఎగిరింది. అలా ఆమె పైకప్పు తగిలే వరకూ ఎగిరి—తర్వాత నెమ్మదిగా గాజు సిలిండర్లోకి దిగింది. అందులో ఆమె పూర్తిగా మునిగింది. తీసిన మూతను పెట్టేసింది. అందులోని ద్రవాన్ని ఒళ్లంతా పూసుకుని ఆమె కేరింతలు కొట్టసాగింది.

ఆమె నవ్వు మాత్రం నెమ్మదిగా భయంకరంగానే ఉంది.

## 18

"నువ్వు యెక్కడి కెళ్ళావురా?" అనడిగింది మధు తల్లి.

"ఎక్కడికో అక్కడికి. నీ కెందుకు?" అన్నాడు మధు విసుగ్గా.

"అలా విసుక్కుంటా వెందుకురా—కన్న తల్లిని కదా—ఆ మాత్రం వివరా లడక్కూడదా?" అంది తల్లి.

"నీకు అడగాలనుంటే అడగొచ్చు. నాకు చెప్పాలనుంటే చెప్పొచ్చు. కానీ నాకు చెప్పాలని లేదు—"

"ఎందుకుంటుందీ? ఆ వకుళ మాయలో పడ్డావు కదా—" అంది తల్లి.

"ఏమిటన్నావ్?" అన్నాడు మధు.

"నువ్వేం చెబుతావోనని అడిగాను కానీ నువ్వు చేసేది నాకు తెలీదనుకున్నావట్రా నాయనా! పిల్లి కళ్ళు మూసుకుని పాలు తాగుతూ ఎవరూ చూడ్డం లేదనుకుంటుందిట. అలాగుంది నీ వరస! నువ్వూ ఆ వకుళా పోతున్న పోకడలు ఈ వీథి వీథంతా చూశారు. ఇప్పుడు కాదన డానిక్కూడా లేదు—బోలెడు కట్నంతో పిల్లనిస్తామంటూ సంబంధాలొస్తున్నాయి నీకు. ఈ వకుళని చేసుకుంటే కానీకి ఠికానా ఉండదు—" అంది మధు తల్లి.

"అదా నీ బాధ—డబ్బుతో ఏం చేసుకుందామని?" అన్నాడు మధు.

"డబ్బుతో ఏం చేసుకోవడమేమిటి? కొండమీద కోతి కూడా వస్తుంది—" అంది తల్లి.

"అయితే అందాకా ఓ కోతిని తెచ్చుకో. నేను డబ్బిస్తాను—" అంటూ మధు తల్లి చేతిలో అయిదు వంద రూపాయ నోట్లు పెట్టాడు.

ఆ నోట్లు చూస్తూనే మధు తల్లికి నోట మాటరాలేదు "ఎక్కడిదిరా ఇంత డబ్బు?" అంది కాసేపటికి ఆశ్చర్యాన్నించి తేరుకుని.

"కానీకి ఠికానా లేని వకుళ నాకు రతన్‌లాల్ దగ్గర ఉద్యోగ మిప్పించింది. ఆయన నాకు ఎప్పుడు ఎంత కావాలంటే అంత డబ్బిస్తాడు! అంచేత నువ్వు నా పెళ్ళి గురించి బెంగపెట్టుకోకు. నా మానాన నన్ను

తిరగనీ—నీకెంత కావాలో నన్నడుగు—నేనిస్తాను!" అన్నాడు మధు!

"అయితే మరి నువ్వు పెళ్ళి చేసుకోవా?" అంది మధు తల్లి.

"నాన్నాళ్ళు నా దగ్గర పెళ్ళి మాట తీసుకురావద్దు" అన్నాడు మధు.

తల్లి అతడికి భోజనం పెట్టింది. డాక్టర్ చెప్పిన పళ్ళు తినిపించింది. టానిక్ తాగించింది. అవన్నీ అయ్యాక వళ్ళెరక్కుండా నిద్రపోయాడు మధు.

మధు తల్లికి వెంటనే నిద్రపట్టలేదు. కొడుకు విపరీత ధోరణి ఆమెకు ఆశ్చర్యం కలిగిస్తోంది.

ఆమెకు కునుకుపడుతూండగా ఎవరో ఇంటి తలుపు తట్టారు. ఆమె కళ్ళు నలుముకుంటూ లేచి వెళ్ళి తలుపు తీసింది.

డాక్టరు వచ్చాడు; ఆయన ముఖంలో ఆత్రుత వుంది.

"మధు ఎలా వున్నాడమ్మా?" అన్నాడాయన ఆత్రుతగా.

"ఏమయింది?" అందావిడ కంగారుపడి.

డాక్టర్ లోపలకు వచ్చి మధును చూశాడు. అతడు హాయిగా నిద్రపోతున్నాడు. డాక్టర్ మధుకు నాడి చూసి—"అమ్మయ్య! అంతా బాగానే ఉంది—" అన్నాడు.

"ఏమయిందసలు?" కంగారుగా అడిగింది మధు తల్లి.

"ఏమీ లేదు. సరిగ్గా ఇలాంటి కేసే ఇంకోటి వచ్చింది. వంటిమీద ఎక్కడా గాయంలేదు. వంట్లోని రక్తం తగ్గింది. అదీ హఠాత్తుగా జరిగింది. ఆయనకు వైద్యం మధుకు చెప్పిందే చెప్పాను. అదెలా పనిచేస్తుందో

చూడాలి గదా—అసలే అది పెద్ద కేసు!" అన్నాడు డాక్టర్.

"ఎవరాయన?"

"సేట్ రతన్‌లాల్. ఆయన నన్నెప్పుడూ పిలవలేదు. ఈ రోజెలాగ వచ్చిందో నాకు పిలుపు వచ్చింది. ఎవడో చిన్న కుర్రాడు వచ్చి ఓ చీటీ ఇచ్చి వెళ్ళాడు. ఎవరిచ్చారంటే సరిగ్గా చెప్పలేకపోయాడు. అందులో రాసిన ప్రకారం రతన్‌లాల్ ఇంటికి వెళ్ళాను. పాపం—ఆయన మీవాడికంటే నీరసంగా ఉన్నాడు—"

మధు తల్లి ఆశ్చర్యంగా—"రతన్‌లాల్ దగ్గర తన ఉద్యోగం వచ్చిందని మా మధు నాతో అన్నాడు—" అంది.

"చాలా తమాషాగా ఉందే!" అన్నాడు డాక్టర్.

అంతకంటే తమాషా మర్నాడుదయం జరిగింది.

మర్నాడుదయం పుల్లారావు మధు ఇంటికి వచ్చాడు. అప్పటికి మధు ఇంకా నిద్రలేవలేదు. మధు తల్లి అతణ్ని చూసి—"ఏం నాయనా—పొద్దున్నే వచ్చావ్?" అనడిగింది.

"మధు లేచాడాండీ?"

"ఇంకా లేవలేదు—"

"ఓసారి అతన్ని మా అమ్మ పిల్చుకుని రమ్మంది—"

"మధుతో మీ అమ్మకేం పని?"

పుల్లారావు స్వరం తగ్గించి—"వకుళ మా అమ్మ దగ్గర ఓ రూపాయ బదులు తీసుకుంది. ఆ బాకీ మధు తీర్చాడు మధు వెళ్ళాక చూస్తే అతడిచ్చిన రూపాయి కాసుకు రక్తం అంటుకుని ఉంది. రక్తం కూడా బాగా ఎండిపోయిలేదు...." అన్నాడు.

"అయితే?" అంది మధు తల్లి ఆశ్చర్యంగా.

"ఆ రూపాయ మధు కెలా వచ్చిందీ అని తెలుసు కుందామని?"

"ఈ మాత్రం దానికి వాణ్ని పిలవాలా? వాడి చేతికి దెబ్బ తగిలి వుంటుంది——" అంటూ ఆమె లోపలకు వెళ్ళి మధు చేతులు పరీక్షగా చూసింది. చేతులకెక్కడా గాయమైనట్లు లేదు. పరీక్షించి చూస్తే మధు శరీరంమీద ఎక్కడా గాయమున్నట్లు లేదు. ఆమె ఆశ్చర్యపడి కొడుకును తట్టి లేపి——రూపాయ కాసు గురించి అడిగింది.

"అదా? అది నాకు వకుళ ఇచ్చింది—" అన్నాడు మధు విసుగ్గా.

"దానికి రక్తమెలా అంటిందిరా?" అంది తల్లి.

"ఏమో నాకేం తెలుసు? తెలుసుకోవాలనుంటే వెళ్ళి వకుళనే అడగండి——" అని మధు మళ్ళీ ముసుగు తన్ని పడుకున్నాడు.

ఈ సంభాషణ పుల్లారావు కూడా విన్నాడు. అతను వెంటనే—"వకుళక్కని నేనే అడుగుతే——మా అమ్మ భయం ఏమీలేదు—ఎవరికైనా ప్రమాదం జరిగిందేమోనని——మధు బాగానే ఉన్నాడుగా అందుకని వకుళక్కకే ఏమైనా అయుండాలి—" అంటూ అక్కణ్నించి పరుగెత్తాడు.

మధు ఇచ్చిన రూపాయి కాసుకి రక్తం అంటిందనగానే ఆమకు బెంగపట్టుకుంది. మధు ఏమన్నా అఘాయిత్యం చేయలేదుగదా అని ఆమె అనుమానం. ఒక్క నిముషం ఆగి ఆవిడ విషయం మేషిటో తెలుసుకోవచ్చునని మధును ఇంట్లోనే ఉంచి తాళం పెట్టి కామేశ్వరమ్మ

ఇంటికి బయల్దేరింది.

ఈలోగా పుల్లారావు వకుళ ఇంటికి వెళ్ళి గుమ్మం దగ్గర ఆగాడు. తలుపు తీయగానే—గడియ వేయలేదని అర్థమయింది. పుల్లారావు క్షణం తటపటాయించాడు.

వకుళ నిన్నటి దినం నవ్విన నవ్వు అతడి చెవుల్లో గింగురుమంది. ఆ నవ్వు తలుచుకుంటేనే అతడికి భయం వేసింది. కానీ అంతలోనే అతడికి పౌరుషం వచ్చింది. వకుళ ఆడపిల్ల. తను మగవాడు. తనేం మరీ చిన్నవాడు కాదు—అయిదారేళ్ళు చిన్న ఉంటాడేమో వకుళకంటే!

అయినా వకుళ తనను భయపెట్టడమేమిటి—తను భయపడటమేమిటి? వకుళ ఏమైనా దయ్యమా—ఏమన్నానా? తను దగ్గరకు వెళ్ళి రక్తం సంగతి చెప్పి తనే వకుళను భయపెట్టాలి!

పుల్లారావు తలుపులు తోశాడు. ఇంట్లో నిన్నటంత చీకటిగా లేదు. అతడిలో ధైర్యం పెరిగింది.

ఇల్లు నిశ్శబ్దంగా వుంది. అంటే వకుళ నిద్రపోతోందన్నమాట!

నిన్న వకుళ తన్ను భయపెట్టింది. ఈ రోజు తనామెను భయపెట్టాలి—ఇదే మంచి అవకాశం.

అతను వకుళ గది వద్దకు నడిచి చటుక్కున తలుపు తోశాడు. అంతే!

గదిలో దీపం వెలుగుతోంది. గదికి ఒక మూలగా నిలువెత్తుగా సిలిండర్ ఉంది. దాని నిండా ఏదో ద్రవ పదార్థం ఉంది. అందులో....నగ్నంగా....వకుళ ఉంది.. పైకీ క్రిందకూ తిరుగుతోంది.

పుల్లారావు కెవ్వుమని కేక పెట్టి అక్కణ్ణుంచి గుమ్మం దగ్గరకు ఒక్క గెంతు గెంతాడు. మరొక్క గెంతు

గింతి ఇల్లు చేరుకుని—"అమ్మోయ్!" అని పెద్ద కేక పెట్టి కూలబడిపోయాడు.

ఆ కేక విని కామేశ్వరమ్మ పరుగున వచ్చింది. ఇంట్లో మిగతా జనం కూడా పుల్లారావు చుట్టూ మూగారు.

"ఏమయిందిరా?" కామేశ్వరమ్మ అడిగింది.

పుల్లారావు మాట్లాడడంలేదు. అదే పనిగా వణుకుతున్నాడు.

"ఏం జరిగిందిరా?" కామేశ్వరమ్మ రెట్టించింది.

"దెయ్యం—" అన్నాడు పుల్లారావు అతికష్టంమీద.

"ఎక్కడ?"

"వకుళా వాళ్ళింట్లో—"

"వాడెందుకో జడుసుకున్నట్లున్నాడు. ఎదురింట్లో దెయ్యమంటా డేమిటి? మనుష్లేరా?" అ న డి గా డు పుల్లారావు తండ్రి.

"ఎందుకు లేరు — వకుళ ఉంది — విషయమేమిటో నేను కనుక్కుని వస్తాను—" అంటూ కామేశ్వరమ్మ చకచకా ఎదురింటికి నడిచింది. గుమ్మంలోనే ఆవిడకు వకుళ ఎదురై — "ఏమిటి పిన్నీ — వాడావుడిగా వస్తున్నావ్—" అంది.

కామేశ్వరమ్మ వకుళను ఎగాదిగా చూసింది. తర్వాత చిరాగ్గా—"నీ వరసేమైనా బాగుందా?" అంది.

"నేనేం చేశాను పిన్నీ!" అంది వకుళ అమాయకంగా.

"ఏం చేశావో ఏమో—కుర్రాడు జడుసుకున్నాడు. నిన్నా నీ గురించి అలాగే చెప్పాడు...."

"ఏం చెప్పాడు?"

"నువ్వు వాణ్ని భయపెడుతున్నావుట!"

"ఏం చూసి భయపడ్డాడో ఏమో—నాకేం తెలుసు? అసలేం జరిగిందో వాణ్నడిగి తెలుసుకుందాం—నేనూ రానా మీ యింటికి—" అంది వకుళ.

"ఒక్కసారి రామ్మా—" అంది కామేశ్వరమ్మ.

వకుళ, కామేశ్వరమ్మా కలిసి వెళ్లేసరికి ఫుల్లారావు అప్పుడే కాస్త స్థిమితపడుతున్నాడు. తన ఇంట్లోకి అడుగు పెడుతున్న వకుళను చూశాడు ఫుల్లారావు. ఒక్కసారి అతడి కళ్ల ముందు గాజు సిలెండరులోని వకుళ మెదిలింది.

వకుళ ఫుల్లారావుకేసి చూస్తూంటే ఆ చూపులు అతడికి పిశాచపు చూపుల్లా కనపడ్డాయి.

మళ్ళీ కెవ్వుమని అరిచాడతను. ఈసారి అతడికి స్పృహ తప్పింది.

"ఏమిటయింది?" ఆశ్చర్యంగా అంది వకుళ.

ఫుల్లారావు తండ్రి వకుళవైపు గుచ్చి గుచ్చి చూస్తూ—"మీ ఇంట్లో నిలువెత్తుగా గాజు జాడీ ఉందా?" అన్నాడు.

"ఉంది—" అంది వకుళ.

"దాన్నిండా నీళ్ళున్నాయా?"

"ఉన్నాయి...."

"అందులో నువ్వు ఈతలు కొడుతూ స్నానం చేస్తున్నావా?"

ఈ ప్రశ్న చెవుల బడగానే వకుళ పకపకా నవ్వింది. అదే నవ్వు.... నెమ్మదిగా....కానీ భయంకరంగా!

ఆ నవ్వు విని అక్కడ చేరిన వారందరూ స్తంభించిపోయారు. అదేం నవ్వు!

అంతా చేష్టలు దక్కి ఆమె వైపే చూస్తూండిపోయారు.

వకుళ చటుక్కున తన నవ్వు ఆపి—"అదేంటి పిన్నీ- అంతా ఒక్కసారిగా నిశ్శబ్దం అయిపోయారు?" అంది.

కామేశ్వరమ్మ వకుళ వంక అనుమానంగా చూస్తూ— "నువ్వు అలా నవ్వుతున్నా వేమిటి?" అంది.

"అదా?" అని మళ్ళీ నవ్వబోయి ఆగి—"క్షమించు పిన్నీ—అది మీకోసం కాదు. మా శారద పిన్ని కోసం నేర్చుకున్నాను. అలవాట్లో పొరపాటుగా మీ దగ్గరా వచ్చేసింది—అంతే!" అంది. అంతా తనకేసే కళ్ళప్పగించి చూస్తూండగా "నా బాధ మీకు అర్థంకాదు. అనుభవి స్తే తప్ప తెలియదు. మా పిన్ని ఏం చేసిందో తెలుసా? నేను వళ్ళెరగని జ్వరంతో పడివుంటే—నన్ను ధర్మాసు పత్రిలో పారేసి తను తన అక్క కొడుకు చారసాలకి వెళ్ళింది. ఇంత ఘోరం ఎవరైనా చేస్తారా? అదృష్టం కొద్దీ ఓ మహానుభావుడు నన్ను రక్షించాడు. ఆయన ధర్మమా అని ఇప్పుడిలాగున్నాను. పిన్ని ఇంట్లోకి రాగానే తన్ను భయపెట్టాలని నా ఉద్దేశ్యం. అందుకే ఈ నవ్వు నేర్చుకున్నాను. ఇంట్లో ఓ గాజు జాడీలో నీళ్ళు పోసి అందులో బొమ్మను వేశాను. పాపం—పుల్లారావు అది చూసి భయపడ్డట్టున్నాడు. ఇక ముందెన్నడూ తలుపు తట్టి పిలవకుండా ఎవరూ ఇంట్లోకి రాకండి. ఇప్పుడు కావాలంటే పుల్లారావు చూసిన ఆ బొమ్మను మీరూ చూడొచ్చు—" అందామె మళ్ళీ.

కామేశ్వరమ్మా, ఆమె భర్తా పుల్లారావును సముదాయించారు. అతడికి నచ్చజెప్పారు. "నువ్వు అనవసరంగా భయపడ్డావు—అంతే — మరొక్కసారి నిజం చూస్తే నీకే భయం తగ్గిపోతుంది—" అన్నారు. ముత్తంమీద

పుల్లారావు తలిదండ్రులతో కలిసి ఎదురింటికి బయ లేరాడు. తర్వాతి పిల్లల్ని మాత్రం కామేశ్వరమ్మ రావద్దంది.

అంతా వకుళ ఇంటికి బయల్దేరేసరికి మధు తల్లి అక్కడికి వచ్చింది. జరిగింది విని ఆవిడా ఆశ్చర్య పోయింది. తనూ వాళ్లతో బయల్దేరింది.

అంతా ఆ గదిలోకి వెళ్ళారు.

ఆ దృశ్యం చూడ్డానికి భయంకరంగానే ఉంది. కానీ వకుళ చెప్పినట్లే అందులో బొమ్మ ఒకటి పైకీ క్రిందకూ కదులుతోంది.

"ఆ బొమ్మ తనంతట తను ఎలా కదలగల్గుతుంది?" అన్నాడు పుల్లారావు తండ్రి.

"ఆ జాడీలో ఉన్నది నీరు కాదు. ప్రత్యేకమైన ద్రావకం. ఒకసారి బొమ్మను అందులో వేసి కదిపితే ఇక ఆగకుండా కదిలేవిధంగా ఆ ద్రావకపు సాంద్రత ఉంటుంది—" అంది వకుళ తడుముకోకుండా.

"ముందుగా తెలియకుండా వచ్చి ఎవరైనా చూశా రంటే గుండె ఆగి చస్తారు—" అంది కామేశ్వరమ్మ.

"మా పిన్నికి గుండె లేదు. అందువల్ల గుండె ఆగి చస్తుందన్న బెంగలేదు. మా నాన్నకి గుండె ఉన్నా— పిన్నితో ఇన్నేళ్ళు కాపురం చేశాడు కాబట్టి దేనికీ భయపడడనే అనుకోవాలి—" అంది వకుళ.

"నీ సరదాలు నీకుండొచ్చు కానీ— ఈ బొమ్మకు కాసిని బట్టలు తొడిగినా బాగుండేది. చూడ్డానికి సిగ్గుతో వళ్ళు చచ్చిపోతోంది—" అంది వకుళకు దగ్గరగా వచ్చి, కాస్త నెమ్మదిగా మధు తల్లి!

"ఈ బొమ్మ మీ మధుయే సెలక్టు చేశాడు. ఆడాళ్లు

స్నానం చేసేటప్పుడు వంటిమీద బట్టలుంచుకోరని అతనే అన్నాడు. దీన్నిలా చూస్తేనే మా పిన్నిని భయపెట్ట డానికి బాగుంటుందని నాకూ అనిపించింది—" అంది వకుళ.

మధు ప్రసక్తి రాగానే అతడి తల్లి ఇంకేమీ మాట్లాడలేదు. వారిద్దరి అనుబంధం ఎటువంటిదో ఆమెకు సరిగ్గా అర్థం కావడంలేదు.

పుల్లారావు తండ్రి చేయిగోకి — "ఇందాక నేను స్పష్టంగా చూశాను. ఈ జాడీలో ఉన్నది బొమ్మ కాదు. వకుళే!" అన్నాడు.

"వెర్రి వెధవా—అదే భ్రమ అంటే—గదిలోకి వచ్చేముందు ఇలాంటి ఏర్పాటొకటుంటుందని నీకు తెలియదు గదా—అందుకే అలా భ్రమపడ్డావు —" అన్నాడు పుల్లారావు తండ్రి.

"దయుంచి ఆ విషయం నలుగురికీ తెలియనివ్వకండి. నా పిన్ని నన్ను నానా బాధలూ పెడుతుంటే పట్టనట్లు ఎలా వూరుకున్నారో ఇప్పుడూ అలాగే ఊరుకోండి—" అంది వకుళ.

# 19

"ఎవరు కావాలి?" అన్నాడు నర్సింగ్ హోంలోని మనిషి.

"మామయ్య.... పేరు కోదండం...."

ఆ మనిషి ఆమెకు రూం నంబరు చెప్పాడు. వకుళ అటు వెడుతూంటే వినపడీ వినబడనట్లుగా "అదృష్ట వంతుడు. చూడ్డానికి ఎంత చక్కటి మేనకోడలు వచ్చిందో!" అన్నాడు.

వకుళ గిరుక్కున వెనక్కి తిరిగి అతణ్ని సమీపించి

"ఏమన్నావ్?" అంది.

"తప్పేమీ అనలేదండీ—మీరు చక్కగా ఉన్నారన్నాను—" అన్నాడతను.

"చక్కదనమంటే—ఏమిటి నాలో నీ క్కనపడ్డ ప్రత్యేకత?" అంది వకుళ.

"మీ ముక్కు!" అన్నాడతను ఏమనాలో తెలియక.

"అలాగా— అయితే నేను తిరిగొచ్చేదాకా అది నీ దగ్గరే ఉంచుకుని ఆనందించు-" అంటూ ఆమె చేత్తో తన ముక్కు లాగి అతడి చేతిలో పెట్టింది.

అతడు నిశ్చేష్టుడై ఆమె వంక చూశాడు. ఇప్పుడామె ముఖంలో ముక్కు తప్ప అన్నీ ఉన్నాయి. ముక్కుండవలసినచోట ఖాళీగా వున్నది. అతడు తన చేతిలో వున్న వస్తువు చూశాడు. అది మనిషి ముక్కు అని స్పష్టంగా తెలుస్తూనే ఉంది. అతడు మరోమారు ఆమె ముఖం వంక చూసి కెవ్వుమని అరిచాడు.

"చక్కగా వుందని మనసు పడ్డావు కదా అని ఇచ్చాను. నీకంత భయమైతే వద్దులే— ..." అని వకుళ ముక్కు తీసి యథాస్థానంలో పెట్టుకుంది. ఆమె ముఖమిప్పుడు మామూలుగా అయిపోయింది.

ఈలోగా అతడి కేక విని నలుగురూ అక్కడకు చేరారు.

"ఏమయింది?" అనడిగాడు.

"అందమైన ఆడపిల్ల చేయిపట్టుకుని చెంప దెబ్బ తిన్న వాళ్ళందరూ చెప్పే కట్టు కథే అతనూ చెప్తాడు. మీరు వింటూ వుండండి. నేను లోపలకు వెడతాను—" అంటూ అక్కణ్నించి వెళ్ళిపోయింది వకుళ.

"ఆమె మనిషా, పిశాచమా? ముక్కు బాగుంద న్నాను. వెంటనే ముక్కు తీసి నా చేతిలో పెట్టింది. అప్పుడామె రూపం చూసి హడిలిపోయి కేక పెట్టాను. వెంటనే తన ముక్కు తను తగిలించుకుని మామూలుగా అయిపోయింది. నేను చూసింది కలో, నిజమో తెలి యడంలేదు—"

"ఆ అమ్మాయి చెప్పినట్లే కట్టు కథ చెబుతున్నాడు. కొస్త గట్టిగా కొట్టిందేమో — కళ్ళు తిరిగి మతికూడా చెడినట్లుంది. మీ డాక్టరుగారి దగ్గరే అర్జంటుగా వైద్యం చేయించుకో—" అని వచ్చిన నలుగురూ అక్కణ్నించి వెళ్ళిపోయారు. అతను మాత్రం ఉన్న చోటే కూర్చుని ఇంకా ఆశ్చర్యపోతూనే ఉండిపోయాడు.

అప్పటికి వకుళ కోదండం ఉన్న గది చేరుకుంది. గదిలో కోదండం ఒక్కడూ మంచంమీద పడుకుని నిద్రపోతున్నాడు.

వకుళ మంచం పక్కనే కూర్చుని—"మామయ్యా!" అని పిలిచింది. ఆ పిలుపు మామూలుగాకాక ఏదో గుస గుసలాడినట్లుగా గాలిలో తేలుతున్నట్లుగా ఉంది.

కోదండం కళ్ళు తెరిచి — "ఎవరూ — వకుళా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"అవును మామయ్యా!" అంది వకుళ ఇందాకటిలాగే!

"నీ మాట కొత్తరకంగా ఉందే!" అన్నాడు కోదండం.

"మాట మారింది — మరి చూపులెలాగున్నాయ్?" గుసగుసలాడుతున్నట్లే మాట్లాడిం దామె.

అప్పుడు కోదండం ఆమె వంక పరీక్షగా చూసి ఉలిక్కిపడ్డాడు.

అవును....వకుళ ఇలా చూస్తోందేమిటి? ఆ చూపులు మనిషి మనిషికేసి చూస్తున్నట్లులేదు.

"అలా చూస్తావేం?" అన్నాడు కోదండం.

"నీ వంట్లో ఎలా ఉంది?"

"కాస్త లేచి తిరగ్గలుగుతున్నాను. కానీ హాస్పిటల్లో ఇంకా వారం రోజులైనా ఉండాలిట!"

"పాపం—నిన్ను చూస్తే నాకు జాలేస్తోంది—" అంది వకుళ.

"నువ్వు కొట్టిన దెబ్బే ఇది...." అన్నాడు కోదండం తల తడుముకుంటూ.

"నిన్ను కొట్టగలిగాను. కానీ జగ్గూను కొట్టలేక పోయాను—" అంది వకుళ.

"జగ్గు...." అని నిట్టూర్చి—"వాడు నీ దగ్గరకు వచ్చాడా?" అన్నాడు కోదండం ఆత్రుతగా.

"నీ స్నేహితుడు నీకిచ్చిన మాట తప్పుతాడా?" అంది వకుళ.

"వచ్చి ఏం చేశాడు?"

"నీ స్నేహితుడు నీకిచ్చిన మాట తప్పుతాడా?"

"అంటే?"

"నీకు తెలియందేముంది? .... వాడితో కలిపి వాడి లాంటి వాళ్ళు మొత్తం అయిదుగురు....నేనొక్కర్తిని! ద్రౌపది తన భర్తలుగా ఏడాదికొకరు చొప్పున వంతు వేసుకుని— మొత్తం అయిదుగురు మగవాళ్ళని భరించింది. నేను అయిదుగురు పరమ కిరాతకుల్ని — నా భర్తలు కాని వాళ్లని—ఒక్క రాత్రి భరించాను!"

"ఒకోసారి చిన్న తప్పుకు పెద్ద శిక్ష అనుభవించాలి. అందులోనూ ఇది కోదండంతో వ్యవహారం. ఇప్పటికైనా

నీకు బుద్ధి వచ్చిందా?" అన్నాడు కోదండం.

"చిన్న తప్పుకు పెద్ద శిక్ష న్యాయమే నంటున్నావు. మరి పెద్ద తప్పుకు ఎలాంటి శిక్ష వేయాలో కూడా నువ్వే చెప్పు—" అంది వకుళ.

"ఎందుకని?"

"నేను నిన్ను శిక్షించాలనుకుంటున్నాను...."

కోదండం వకుళ వంక తీవ్రంగా చూసి—"ఇంకా నీకు బుద్ధి రాలేదా? జగ్గూకు చెప్పాలా?" అన్నాడు.

వకుళ నవ్వింది. నెమ్మదిగా, భయంకరంగా!

కోదండం ఆ నవ్వు విని ఉలిక్కిపడ్డాడు. అప్రయత్నంగా అతడు వకుళ వైపు చూశాడు. ఆమె ఎప్పటి వకుళలా లేదు. ఆ కళ్ళలో అమాయకత్వం బదులు ఏదో పైశాచికత్వం కనబడింది. అందమైన ఆమె ముఖానికి ఆ చూపులు జతపడగానే ఆమె మోహినీ పిశాచివలె ఉన్నది.

"ఏమిటా నవ్వు?" అన్నాడు కోదండం.

"పాపం — నువ్వు నాకు బుద్ధి చెప్పాలని చాలా తహతహ లాడుతున్నావు. అందుకోసం మాటిమాటికీ జగ్గూని పిలవా లనుకుంటున్నావు. కానీ అసలు సంగతి నీకు తెలియదు. జగ్గూ నాకు బుద్ధి చెప్పడం అయిపోయింది. ఇప్పుడు నేను వాడికి బుద్ధి చెప్పాలి. ఎలా బుద్ధి చెబుతానో నువ్వూ చూడాలిగదా అని వాయిదా వేస్తున్నాను. అంతే! ఇప్పుడు కదిలి రాగలనంటే— సరదాగా ఈ క్షణమే నీకా దృశ్యం చూపిస్తాను. కానీ ఇంకా వారం రోజులైనా నువ్వు నర్సింగ్ హోంలో ఉండాలి—" అని మళ్ళీ నవ్వింది వకుళ.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును. •



# క్రైమ్‌లో తమాషాలు

(ఈ శీర్షికలో ప్రచురితమయ్యే ప్రతిరచనకూ రూ. 5 పారితోషకం ఇవ్వబడును.)

## కోణార్క్ ఎక్స్‌ప్రెస్

విజయవాడ రైల్వేస్టేషన్ కలకలలాడుతూ వుంది. సాయంత్రం ఆరు గంటలయింది.

"గమనిక. సికింద్రాబాద్ నుండి భువనేశ్వర్ వెళ్ళు కోణార్క్ ఎక్స్‌ప్రెస్ మరికొద్ది నిముషములలో నాల్గవ నంబరు ప్లేట్‌ఫారం పైకి వచ్చును...." ఇంగ్లీషు, హిందీ తెలుగులో ఎనౌన్స్‌మెంట్ వినవచ్చింది.

నారాయణకూడా విన్నాడు. క్యాంటీన్‌లోనికి వెళ్ళి వడ, పూరీ తిని కాఫీ తాగి, సిగరెట్ కాలుస్తూ నిల్చున్నాడు. సరిగ్గా బండి కదిలేక పరిగెత్తుకుంటూ పోయి ఇంజన్ ప్రక్క భోగీ ఎక్కాడు. పెట్టినిండా జనం. కూర్చుని, పడుకొని వున్నవారుకాక చాలమంది నిలబడి వున్నారు.

"టికట్ ప్లీజ్" చెకింగ్‌కి, టి.సి. వచ్చి అడిగాడు.

క్షణం తడబడ్డా సర్దుకొని "వన్‌మినిట్ సార్, నాబేగ్‌లో వుంది తీసిస్తాను" అంటూ ముందుకు వెళ్ళబోయాడు.

"ఎక్కడ్నించి వస్తున్నారు?"

"సికింద్రాబాద్."

"ఎంతవరకు."

"వాల్తేర్."

"సరే! టికట్ చూపించండి."

గబగబా అందర్నీ తోసుకొని సీట్ నంబరు ఎనిమిది దగ్గర ఆగాడు. అందర్నీ పరకాయించి చూసి వెనుదిరిగాడు. టిపి వెనకాలే వున్నాడు.

"ఇది కోణార్క్ ఎక్స్‌ప్రెస్ కాదా?"

అనుమానంగా చూసాదు టి.సి. "అవును" అన్నాడు.

"ఇది నే నెక్కిన పెట్టె కాదండీ! అంతా క్రొత్తగా అన్పిస్తున్నారు" కంగారుగా వుంది నారాయణ గొంతు.

"చూడు మిస్టర్! చదువుకొన్నవాడి...."

"తొందరపడకండి సార్! నేనెక్కిన పెట్టెలో దరిదాపు పదిమంది దాకా వైజాగ్ ప్రయాణీకులున్నారు. వాళ్ళెవరూ ఇందులో లేరు. పైగా నా లగేజీకూడా కనబడటంలేదు" గాభరాగా అన్నాడు నారాయణ.

టిపికి అనుమానం వచ్చింది. ఇదేదో మఫ్ఫత్ జర్నీ బాపతనిపించింది. "చూడండి! మీ టిక్కెట్టు చూపించక పోతే సికింద్రాబాద్ నుండి వైజాగ్‌వరకు ఫైన్‌తో కలిపి కట్టాల్సి వుంటుంది" అన్నాడు రిసీట్ బుక్, గైడు తెరుస్తూ.

"నా సామాన్లు కనబడక నేనేడుస్తుంటే మీరు పైను, గాడిదగుడ్డు, అంటూ బెదిరిస్తారేమిటండీ?"

ప్రయాణీకులు చూస్తూ వింటున్నారు, బాగుంది కేసని.

టిపి వదల్లేదు. ఇలాటివి చాలా చూసాడు సర్వీసులో.

"మిస్టర్! ఇక నీ కహానీలు వద్దు. అంతదూర ప్రయాణం చేసేవాడివి నువ్వెక్కిన పెట్టె ఏదో కూడా తెలియనంతగా వున్నావా?" వెటకారంగా అన్నాడు.

"నేనెక్కింది ఇంజన్ పక్క భోగీ అండి."

"ఇదేనయ్యా బాబూ ఇంజను ప్రక్క భోగీ"

చిర్రెత్తుకొచ్చింది టిపికి. స్వరం పెంచాడు.

"మహాప్రభో ఇది చిన్న పెట్టె. సీటింగ్ కెపాసిటీ తక్కువగా వుంది. నే నెక్కింది డెబ్బైనాల్గు బెర్తులున్న భోగీ!" అన్నాడు నారాయణ. ప్రయాణీకుడి తెలివికి నవ్వాలో, ఏడ్వాలో తెలియలేదు.

"బలేవాడివయ్యా? ఈ బండికి విజయవాడ స్టేషన్‌లో ఇంజను మారి వెనకనుండి ముందుకి వస్తుంది. హైద్రాబాదు నుండి విజయవాడవరకు ఇంజను ప్రక్కనున్న పెట్టె, విజయావాడనుంచి చివరిపెట్టె అవుతుంది. ఏలూరులో బండి ఆగినప్పుడు దిగి పో బాబూ!" అని సౌణుక్కుంటూ చెప్పి పనిలోబడ్డాడు.

"ఇప్పుడే పోతానుసార్!" అన్నాడు నారాయణ థేంక్స్ చెప్పి సారీ అంటూ.

"కుదర్దు నాన్నా! దాన్ని కట్ భోగీ అంటారు. దీని ముందు భోగీనుండి బండిలోంచి నడుచుకుంటూ పోవచ్చు. దీనికి త్రూ కనెక్షను లేదు" చెప్పాడు. టి. సి.

ఏలూరులో బండి ఆగింది. నారాయణ దిగేడు. నడుచు కుంటూ నెమ్మదిగా చివరిభోగీ దగ్గర క్షణం ఆగి చూసేడు.

చిన్నగా నవ్వుకొన్నాడు. ఎందుకంటె ఆ విషయం తనకు ముందే తెలుసు కనక.

ఆ భోగీని దాటి, నిదానంగా ప్లాట్‌ఫారం చివరికిచేరి నడుచుకుంటూ గూడ్స్ షెడ్ రోడ్ చేరుకుని ఇంటిదారి పట్టాడు.

నారాయణ ఎక్కింది విజయవాడలోనే. ఆత్మారాముడి ఆకలి చల్లార్చగా మిగిలిన పది పైసల నాణెం దేనికీ చాలదు కనుక తెగించి తెలివిగా తప్పించుకున్నాడు. అంతే!

—ఎన్.జి. సుబ్రహ్మణ్యం, విజయవాడ.

